పామాలివ్ సౌందర్య రక్షణ

# మీ దేహకాంతికి క్రొత్త శోభనిస్తుంది!










పూర్తిగా సౌందర్యముగా కనపడుటకు పామాలివ్ సబ్బుతో స్నానము చేయండి!

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

★

Founder
K. Nageswara Rao

స్థాపితము
1908

★

సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

★

సంపుటము 55
సంచిక 4

7-10-59
బుధవారం

వికారి ఆశ్వయుజ శుద్ధ షష్ఠి

★

విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0

★

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి
మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖ చిత్రం:
పద్మశ్రీవారి 'జగన్నాటకం'లో
కృష్ణకుమారి


| | | |
|---|---|---|
| రాజధాని కబుర్లు | — | 3 |
| న్యూఢిల్లీ లేఖ | — | 6 |
| చెక్కుపుస్తకం | — | 8 |
| వాసంతి వేడుక | — | 13 |
| తెలుగు వెలుగులు | — | 15 |
| కథకానికథ | — | 16 |
| శరత్ చెప్పిన కథలు | — | 17 |
| స్వప్నం | — | 24 |
| అన్వేషణ | — | 28 |
| మా జపానుయాత్ర | — | 32 |
| పత్రఫలితాలు | — | 36 |
| బాలసాహితి | — | 40 |
| వనితాలోకం | — | 48 |
| చదరంగం | — | 54 |
| సినిమా | — | 56 |
| విద్యాప్రమాణం | — | 62 |
| గళ్ల నుడికట్టు | — | 64 |


# ఉత్తరాలు

## తెలుగు వెలుగులు

ఆర్యా,

వారపత్రిక (28-9-59) తెలుగు వెలుగులలో శ్రీ కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారిని గురించి చాలా బాగా వ్రాశారు. వారినిగురించి వ్రాసినది ఇంకాతక్కువేనని నా అభిప్రాయం.

కె. సరోజిని, కరీంనగర్.

* * *

"తెలుగు వెలుగు" శీర్షికతో ఆంధ్ర వారపత్రిక పాఠకులను మరింత సన్నిహితులను చేసుకున్నదనుట అతిశయోక్తి కాదు. ఈ శీర్షిక క్రింద నివురుగప్పిన (తెలుగు) నిప్పులను కూడ ప్రకాశింపజేయగలరని ఆశిస్తున్నాం.

టి. నారాయణరెడ్డి,
హైదరాబాదు.

## మరణదండన

అమంచర్ల గోపాలరావుగారు వ్రాసిన-మరణదండన అను శీర్షికలో కొన్ని రకముల పూర్వ మరణదండనలు మాత్రము వ్రాశారు. ఇంకా యెన్నో రకాలు వున్నాయి. వాటిని కూడ సేకరించి వ్రాసి వుండిన చాలా బాగుండేది.

ఎ. బాలకృష్ణశర్మ,
ఎర్రకోటపల్లె.

* * *

అమంచర్ల గోపాలరావుగారు వ్రాసిన 'మరణదండన' చాలా బాగుంది. పూర్వకాలపు మరణ శిక్షలు ఎంత కఠోరంగా వుండేవో రచయిత చాలా బాగా వ్రాశారు. వారికి నా ధన్యవాదాలు.

బి. వి. సుబ్బారెడ్డి,
బాపట్ల.

## ఆర్థర్ కాటన్

వారపత్రిక(16-9-59)లో అనంతంగారువ్రాసిన "అభినవ భగీరథుడు" వ్యాసం చదువుతున్నంతసేపూ ఒడలు చెప్పలేని ఆనందంతో గగుర్పొడిచింది. కళ్లనుండి ఆనందాశ్రువులు ప్రవహించాయి. అవ్యక్తమైన భావంతో హృదయమంతా నిండిపొంగిపోయింది. అంత చక్కని సంఘటనను, ఎంత చక్కగానో చిత్రించి వ్రాసిన వారికి మా హృదయపూర్వక అభినందనములు. అంతటి కృతజ్ఞతాభావంతో నిండిన హృదయంగల దయనాలుగారు ఎంతో అదృష్టవంతుడు.

కె. రావు, అడ్డతీగల.

## "విద్యార్థులకు మాత్రమే"

పై శీర్షిక క్రింద, ఎస్. శేషగిరిరావుగారు చాలా గమ్మత్తుగానే వ్రాశారు. ఎ.వి. కోటిరెడ్డిగారు, అది చాలా అసహ్యంగానూ, అసభ్యంగానూ, వున్నాయి అనటం చాలా అసభ్యంగా వుంది. శేషగిరిరావుగారు వ్రాసినట్లు ప్రవర్తించే విద్యార్థులు, విద్యార్థినులు, అనేకమందిని మనం కాలేజీల్లో చూస్తూనే వున్నాము. అలాంటివారిని ఉద్దేశంలో పెట్టుకొని తమాషాగా వ్రాసిన సలహాలను సీరియస్ గా తీసుకొని, కె. కుమారిని

(55-వ పేజీ చూడండి



# రాజధాని కబుర్లు

ప్రవీణ్

# "గుండె కలవాడేను మనిషోయ్..."

నిబంధనను తు చ తప్పకుండ అమలుజరిపి, అన్యాయం జరిగితే బాధపడే ఉద్యోగులుకొందరు. అమలు జరుపుతాం, జాగ్రత్త !- అని, అణా పైసలు బల్లక్రింద చేతిలోంచి తీసి జేబుల్లో పడేసుకునే ఉద్యోగులు మరికొందరు. మొదటిరకం వ్యక్తులు సిద్ధాంతాలు బట్టీపట్టి లక్ష్యాలనే మరచిపోతారు. రెండోరకం వారు తాము చేయదలచుకొన్నది చేసేసి, తమ చర్యలకు బలం చేకూర్చడానికి సిద్ధాంతాల గట్లు వేసుకుంటారు వెనకాల.

రాజధాని నగరంలో రోడ్లమీద గోతులు త్రవ్వినప్పుడు, గోతులవద్ద మనల్ని హెచ్చరించే ఎర్రజెండాలు కాని ఎర్రదీపాలు కాని ఎల్లప్పుడూ ఉండవు. 'కుంభకర్ణుడి పునర్జన్మ-3' లో పేర్కొనబడ్డ సందులో గోతులు త్రవ్విన గుత్తేదారుడు దీపం పెట్టడం మానేశాడు. అతను త్రవ్విన గోతిలో పడ్డాడు ఒక పౌరుడు. సహజమేగదా ?

మనకి నైతిక విలువలు ఎక్కువైపోయి, బరువు భరించలేక, ఇతర దేశాలకు ఎగుమతి చేస్తున్నామంటే ఆశ్చర్యం లేదు!

## చట్టానికి హృదయం ఉంది....

మరో సంఘటన! ఇదికూడా సెప్టెంబర్ మాసంలోనే జరిగింది.

ప్రదేశ్ ఉన్నత న్యాయస్థానానికి సంబంధించిన ఒక చిన్న ఉద్యోగి తన శిశువును కోల్పోయాడు. ఆసమయంలో అతను అస్వస్థుడై ఉండటం వల్ల, అతని బంధుమిత్రులు శిశువు శరీరాన్ని శ్మశానవాటికకు చేర్చారు. మూడోనాడు అతడు నగరపాలక సంఘం కార్యాలయం చేరి, శిశువు మరణించిందని తెలియచేశాడు: ఆ విషయం చూసే ఉద్యోగి ని మరుగోజా రమ్మన్నాన్ని. అతడు వెళ్ళాడు వివరాలన్నీ తెలిపాడు. శిశువు చనిపోయిన ఇరవై నాలుగు గంటల్లోగా సమాచారం అందచేయనందుకు నగరపాలక సంఘం అతనిపై కేసు పెట్టింది.

జనన మరణాల వివరాలు సేకరించవలసిన అవసరం ఎంతైనా ఉంది ప్రభుత్వానికి. మరణ కారణాలను నమోదు చేయటంవల్ల అంటువ్యాధుల ఉనికి తెలుసుకుని, అవి వ్యాపించకుండా అరికట్టడం సాధ్యం ఔతుంది. ఇది మీరు, నేను, ఎవరూ కాదనలేం. కాని ఇక్కడ గమనించవలసిన విషయం హైదరాబాదులో అమల్లోఉన్న హైదరాబాదు నగరపాలక సంఘాల చట్టంలో ఎక్కడా 'ఇరవై నాలుగు గంటల్లో తెలియచేయాలి మృత్యు సమాచారం' అన్న నిబంధనలేదు. చట్టాన్ని 'అనుసరించి' న'పాలక సంఘం అటువంటి నిబంధన చేసిందేమో తెలియదు: చేస్తే, అది చట్ట విరుద్ధం.

అవధారించండి:

ఆ చట్టంలో 579(1) సెక్షన్ ప్రకారం, నగరంలోని దహన, ఖనన ప్రదేశాలన్నింటిలో ప్రతీ ఒక్కదానికి న'పాలక సంఘం ఒక అధికారిని నియోగించాలి. చనిపోయిన వ్యక్తులనుగురించి సమాచారం నమోదు చేసుకో వల్సిన బాధ్యత అతనిది. ఆ అధికారి ఆ ప్రదేశంలోనే ఉండాలని న'పాలక సంఘం భావించకపోతే, అతడెక్కడ ఉంటాడో తెలుపుతూ ఒక బోర్డు, ద్వారందగ్గర ప్రముఖంగా వేలాడదియ్యాలి. ఇది 579 (2) వ సెక్షన్‌లో ఉంది. రమారమిగా అంత్యక్రియలసమయంలో ఈ సమాచారం ఆ అధికారికి అందచేయవలసిన బాధ్యత 580 వ సెక్షన్ ప్రకారం చనిపోయినవాని దగ్గర బంధువులది. 579 వ సెక్షను క్రింద నియమింపబడిన అధికారికి తెలియ చేయాలన్నదే ఈ బాధ్యత.

చట్టం అమలులోకి వచ్చి కొన్ని సంవత్సరాలైంది. ఈ చట్టాన్ని అనుసరించి 'నపాలక సంఘం మృతుల దహన, ఖనన



జయంతి, అక్టోబరు 2

"ఏది సత్యం ఏది అసత్యం
ఏది నిత్యం ఏది అనిత్యం
ఏది ఏకం ఏది అనేకం
ఏదికారణ మేదికార్యం
ఓ మహాత్మా!"

# ★ రాజధాని కబుర్లు ★

సంస్థాగ ప్రదేశాలను సక్రమంగా నియమించడానికి, ఆ ప్రదేశాలను సరియైన స్థితిలో ఉంచడానికి మాత్రమే నిబంధనలు చేయవచ్చు. [చూ. హై. న. పా. చట్టం, 16వ అధ్యాయం, సె. 586 (34)]. మరే నిబంధన చేసినా, చట్టంలో చెప్పబడ్డ సూత్రాలకు అనుగుణంగా చెయ్యాలి.

మరి–చట్టం అమలులోకి వచ్చినా, నపాలక సంఘం అధికారులను నియమించకపోతే? నియమించిన ప్రకటనలు శ్మశానవాటికలవద్ద లేకుండాపోతే? కుంభకర్ణుడు ఎంత గాఢంగా నిద్రిస్తున్నాడో గమనించండి.

ఈ కేసు హైదరాబాదునగర మేజిస్ట్రేటు శ్రీ నవరతనలాల్ ముందుకు సెప్టెంబరులో వచ్చింది. మేజిస్ట్రేటు నపాలక సంఘోద్యోగులను మందలించి, కేసు కొట్టేశారు. ఈ విషయం అటుండనిచ్చి, బల్లక్రింద చేతుల్లో కాసుల గలగలలు వినపడకపోయినందుకు పిల్లలుపోయి ఏడ్చే తల్లిదండ్రులను, భర్తలు మరణించి ఏడ్చే భార్యలను కోర్టులకీడ్చే అధికారులను ఏవిధంగా క్షమించడం? ఆంధ్రప్రదేశ్ ఏర్పడి మూడు సంవత్సరాలైనా ఉర్దూలో తెలుగువారికి నోటీసులంపే ఉద్యోగులను ఏమనడం? చట్టం చెప్పినదానికి వ్యతిరేకంగా నిబంధనలు ప్రకటించి, అమలు జరుపుతున్నపాలక సంఘాన్ని గురించి



## విజ్ఞప్తి

"కథకానికథ" పత్రికకువచ్చే వందలాది రచనలలో నిరాకరింపబడిన వాటిని తిప్పి పంపటం సాధ్యంకాదు గనుక, రచనలతో పాటు స్టాంపులు పెట్టవలదని, వాటి విషయమై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుటకు కూడా వీలుండదు గనుక కార్డులు, రిప్లయి కార్డులు పంపవలదని రచయితలకు మనవి. ఈ పత్రిక రచనల కవరుపై స్పష్టంగా "కథ కానికథ" ఎడిటర్, ఆంధ్రసచిత్రవారపత్రిక 6 & 7, తంబుచెట్టి స్ట్రీట్, మద్రాసు-1. అని వ్రాయాలి.

—సంపాదకుడు

ఏం రాసి ఏమి ప్రయోజనం?

## ప్రాణదాతకు లేదు తీరిక....

ఇంకో సంఘటన! ఇదికూడా సెప్టెంబరు మాసంలోనే జరిగింది.

నగరంలోని ఒక ప్రైవేట్ ఆసుపత్రిలో అవసరచికిత్సకి ఒక స్థానిక న్యాయవాది, ఆయన భార్య తమ శిశువుని కొనిపోయారు. వైద్యుడు నియమాలను నిబంధనలను తు. చ. తప్పకుండా అమలు జరపాలనే వ్యక్తి. కోటీశ్వరులొచ్చినా క్యూలో నిలబడవలసిందే. ఆయనవద్ద ఉదయం 'బాలరోగి'కి ఒక నంబరు ఇవ్వబడింది. ముందు వచ్చిన ముప్ఫైముగ్గురూ పరీక్షించబడితేగాని ఈ ముప్ఫైనాలుగో రోగిని పరీక్షించడానికి లేదు వైద్యుడు. ఉదయం గడిచిపోయింది. సాయంత్రం మళ్ళీ క్యూ ఏర్పడింది. మళ్ళీ మరో నంబరు! తన నంబరు రాకుండానే, డాక్టరు మహాశయుని నియమాలను, నిబంధనలను [illegible]ంచుకుంటూ అసువులు విడిచాడు శిశువు.

నీకు ఈత వచ్చివుండి, నీవు ఒడ్డుపై కూచునుండగా నీతోటివాడు నీటిలోపడి మరణిస్తే, అతన్ని రక్షించడానికి నీవేమీ చేయకుంటే, నిన్ను ఏ చట్టం శిక్షించదు. ఆ వైద్యుడినీ ఏ చట్టం శిక్షించదు. ఇక మిగిలింది చనిపోయిన బిడ్డడి తల్లిదండ్రుల గోడు మాత్రమే!

* * *

మరొక్కటి: ఇదికూడా ఈ మధ్యనే జరిగింది.

నిలోఫర్ ఆసుపత్రిలో ఒక శిశువు చేర్పించబడ్డాడు. తండ్రి ప్రభుత్వోద్యోగి, తల్లి ఒక ఉపాధ్యాయిని. ఏణ్ణర్థం వయసుగల శిశువుకి ఆక్సిజన్ ఇవ్వాలని డాక్టరు నిశ్చయించారట. కొంతవరకు స్వయంగా చూసి, నర్సుకి అప్పజెప్పి వెళ్ళిపోయారట. కొంత సేపు కూచున్న నర్సు పనిమీద వెళ్ళిపోయింది. తెల్లవారేసరికి శిశువు పరిస్థితి విషమించింది. ప్రక్కనే కూచున్న తల్లి హృదయం విదీర్ణమైంది. రమ్మనమని బ్రతిమాలుకున్నా

...గా రాలేదట. కడుపుబ్బి, శిశువు మరణించాడు ఉదయానికి.

## లేదు ప్రాణవాయువు....

క్రిందటి సంవత్సరం ఉస్మానియాలో చేర్పించబడ్డ ఒక శిశువుకి మంచుగడ్డలు తల మీద వేయాలని డాక్టరు ఆజ్ఞాపించాడు. రాష్ట్రానికంతకి పెద్దదైన ఈ ఆసుపత్రిలో మంచుగడ్డలు దొరకలేదు. తండ్రి ప్రదేశ్ కాంగ్రెసు కార్యాలయంలో ఉద్యోగి. సైకిలుపై అర్ధరాత్రి మొజంజాహీ మార్కెట్ వరకు వెళ్ళి మంచుముక్కలు తీసుకొని రావలసి వచ్చింది. ఆక్సిజన్ ఇమ్మన్నారట డాక్టరు. మెయిన్ స్టోర్ రూం నుంచి తెచ్చిన సిలిండర్లో ఆక్సిజన్ లేదు. ఆక్సిజన్ తెచ్చేలోగా ఆలస్యం అయింది. ఉదయానికి శిశువు మరణించాడు.

## విజ్ఞాన సర్పదష్టుడు!....

మూడు నెలల క్రితం ఎన్. సీ. సీ. క్యాంపుకి వెళ్ళిన కనకరాజ్ అనే విద్యార్థిని ఒకరాత్రి పాము కరచింది. అతను అన్నాడు పాము కరచిందని: నోటివెంట నురుగులు వచ్చాయి. కారులో ఉస్మానియా ఆసుపత్రికి తీసుకొనిరాబడ్డాడు. 'కేజువాలిటీ వార్డు'లో ఉన్న ఆర్. ఎమ్. ఓ. అతన్ని పరీక్షించి, అతన్ని పాము కరవలేదని నిర్ణయించి మరో వార్డుకి పంపించాడు. శెలవుదినం కావటంవల్ల అక్కడ డాక్టరు లేరు. నర్సు ఇచ్చిన మందులు కొని భరించి అతను మధ్యాహ్నానికి కన్ను మూశాడు. ఆ జట్టు కెప్టెన్‌కి చనిపోయిన విద్యార్థి తల్లిదండ్రులకు తెలపాలని కూడా తోచలేదు.

హైదరాబాదు మాజీ మేయర్ ఒకాయన మేయరుగా ఉన్న రోజుల్లోనే కొడుకు మేడమీదనుండి పడి తల బద్దలుకొట్టుకుంటే ఉస్మానియాకి తీసుకెళ్ళారు. ఒక గంటవరకు వారిని ఎవరూ పలకరించలేదు. కారులో తిరిగి అతను పోబోతూంటే, అతను మేయరని తెలిసి నాలిక్కరచుకున్న పెద్దలు, కారుల్లోపోయి తిరిగి, తెచ్చి మందిచ్చారు కొడుక్కి.

ఇది నగరంలోని దయలేని దవాఖానాల పరిస్థితి. పైన పేర్కొన్న సంఘటనల వివరాలన్నీ అవేనని రూఢిగా చెప్పలేను-భగవంతుణ్ణి కాను కాబట్టి. భగవంతుణ్ణే ఐతే వరుసక్కు పరిష్కారమార్గం చూపిస్తే వాణ్ణేమో? వైద్యులు, ఆసుపత్రుల ఉద్యోగులు ఈ విధంగా బాధ్యతారహితంగా ఎందుకు వ్యవహరిస్తున్నారు? మన నైతిక విలువలు ఇక్కడ కూడా సాక్షాత్కరిస్తున్నాయా? ఐదారేండ్లు వ్యయప్రయాసలకోర్చి చదివి వచ్చిన తర్వాత, ప్రభుత్వం ఇచ్చే జీతాలు చాలకనా? సరోజినీ ఆసుపత్రిలో ఈమధ్య మూడు నాలుగు కేసుల్లో పునఃపునః శస్త్రచికిత్స చేయించవలసి వచ్చిందని తెలుస్తోంది. ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి సమర్థులు. రాజధానిలో ఆసుపత్రుల నిర్వహణాపద్ధతి ముఖ్యంగా ఉస్మానియా, నిలోఫర్ ఆసుపత్రులు నిర్వహించే పద్ధతి - రాష్ట్రానికి గౌరవం తెచ్చేట్లులేదు. ముఖ్యమంత్రి స్వయంగా చేదతీసుకొని సమగ్ర విచారణ జరిపించి, లోపాలను సరిదిద్దాలి.



మద్రాసులో జరిగిన పశుప్రదర్శనంలో బహుమతిపొందిన ఒంగోలుజాతి గిత్త. దీని వయసు ఐదేళ్ళ పదినెలలు. గిత్త యజమాని శ్రీ పోలవరపు హనుమయ్యగారు. మద్రాసు పశుసంపదభివృద్ధిశాఖ డైరెక్టరు డా॥ పట్టాభిరామన్ (ఎడమనుంచి రెండవ వ్యక్తి) చిత్రంలో కలరు.

* * *

## విమర్శలు-'కులు

ఆర్. టి. సి. వంటి సంస్థలుకాని, మరేసంస్థలు కాని ఏవిధంగా నిర్వహింపబడుతున్నాయో రాజధాని వాసులకు అవసరంలేదు - సాధారణంగా! ప్రైవేటు బస్సులు నడుస్తున్నాయా, జాతీయం చేయబడినవి నడుస్తున్నాయా అన్న ప్రశ్నలతో మాకు నిమిత్తంలేదు.

సువిశాలమైన ఈ నగరంలో కార్యార్థులై పౌరులు పరస్పరం దూరంగా ఉన్న ప్రదేశాల మధ్య తిరుగాడుతూ ఉండవలసి వస్తుంది. ఇది ఎంత చౌకగా చెయ్యగలిగితే, ఎంత త్వరగా చెయ్యగలిగితే అంతమంచిది. మిగిలిన కాలాన్ని రెండు పూటలకు సరిపోయే తిండి తినడానికి అవసరమైన డబ్బు సంపాదించుకోడానికి, వెచ్చిస్తారు పౌరులు. ఆర్. టి. సి. అధికారుల అంతంలేని అపచారాలవల్ల ఈ ప్రశ్నలు వేయవలసి వస్తోంది! అధికా

(53 వ పేజీ చూడండి



# న్యూఢిల్లీ లేఖ

## "ఇంట గాంధీజం! బయట తాటస్థ్యం!"

ఈ వారం ఢిల్లీలో కదలిక అట్టే లేదు. మామూలుగా ప్రధాన మంత్రి రాజధానిలో లేనప్పుడల్లా ఇంతే.

ప్రధానమంత్రి, ఆర్థికమంత్రి, రక్షణ మంత్రి విదేశాలకు వెళ్ళగా ఆ స్థాయిలో ఒక్కరే రాజధానిలో ఉండిపోయారు. ఆయన మరెవరో కాదు హోంమంత్రి శ్రీ గోవిందవల్లభ్ పంత్.

ఇండియా - చైనా సరిహద్దు వివాదాల గూర్చి చర్చలు ఇంకా సన్నగా వినవస్తునే వున్నాయి. శ్రీ కృష్ణమీనన్ న్యూయార్క్‌లో ఒక ప్రకటన చేస్తూ, ఇండియాపై చైనా జరిపిన దారుణమైన దురాక్రమణ అటుంచి విశ్వరాజ్యసమితిలో చైనా సభ్యత్వానికి ఇండియా తన పలుకుబడిని వినియోగిస్తుందని ఆ వైఖరిలో ఏమీ మార్పు ఉండబోదని ఉద్ఘాటించారు. ఈ ప్రకటనపట్ల ఢిల్లీ వర్గాలలో ఖచ్చితంగా సంచలనం కలిగినమాట నిజం. అయితే ఆ సంచలనంలోనుంచి బయట పడుతున్న 'సవాల్' ఒక్కటే. చాలా ముక్తసరిగా ఉంది ఆ సంచలనం.

ఇప్పుడు న్యూయార్క్‌లో చేసిన ఈ ప్రకటనపై పార్లమెంటు సభ్యత్వానికి శ్రీ కృష్ణమీనన్ రాజీనామా చేసి తిరిగి ఎన్నికలలో నిలబడాలని ఢిల్లీ వర్గాలు 'సవాల్' చేస్తున్నారు. కాగా ఈ ఎన్నికలో చైనా దురాక్రమణ పట్ల దేశప్రజల అభిప్రాయం వెల్లడి కాగలదు. ఇటువంటి ఎన్నికంటూ జరిగితే ప్రధాన మంత్రి గౌరవమర్యాదలూ, చైనానుగూర్చిన ఆయన విశాలభావాలు ప్రోసిరాజని కాంగ్రెసు పార్లమెంటరీపార్టీ సైతం శ్రీ కృష్ణమీనన్‌ను హృదయపూర్వకంగా సమర్థించటం అనుమానమే!

ఒకవైపు ఇండియాపై చైనా 'ఖచ్చితమైన' దురాక్రమణ జరిపిందంటూనే విశ్వరాజ్యసమితిలో చైనాకు సభ్యత్వమిప్పించే విషయమై తాముపాటుపడగలమని ఇండియా తరఫున కృష్ణమీనన్ చెబుతున్నారు. 'పంచశీల' ఒడంబడికకు మూలకారణమైన దేశం వల్ల ఆ ఒడంబడికకే లోబడిన మరొక దేశం జరిపిన దురాక్రమణకు వహించవలసిన వైఖరి ఇదేనా? కాగా శ్రీ కృష్ణమీనన్ మొహాన్నే పట్టుకుని లేఖ కలుగుతూ అడుగుతారు ఇటువంటి దురాక్రమణ జరిపిన చైనాకు సమితిలో సభ్యత్వమేమిటని. కేవలం ఎన్నికలోను అదే అనుభవం అవుతుంది ఆయనకు! విశ్వరాజ్యసమితిలో చేరడానికి చైనాకు అర్హత లేదని ఆ నేతలు భావిస్తున్నారు.

కాగా శ్రీ కృష్ణమీనన్‌ను సాధ్యమైనంత దార్లు తప్పించడానికి భారత కమ్యూనిస్టులు కొకొలదీ యత్నిస్తున్నారు. అయిన్నా వారు బలపరచినకొద్దీ అంతా అనుమానపడతారని వారి సంకోచం! ఆయనకు ఆయనను వదిలేసి చూడాలి ఎన్నికంటూ జరిగితే-

ఇంతవరకు చైనా ఆక్రమించుకున్న భూభాగం ఇక విడిచివెళ్ళే ప్రమేయం ఏమీ లేదు. ఇండియా బలహీనత చైనాకు బాగా తెలుసు. ఆ బలహీనతను ఆధారంగా తీసుకుని చైనా పూర్తిలాభాలుపొందడం తథ్యం.

విధానాలు ముందు రూపొందించుకుంటే విదేశమైనా తన సాయుధబలాలను తదనుగుణంగా ఏర్పరచుకొంటుంది. ప్రబలశత్రువు ఎవరో తేలినతరువాత విధానాలు రూపొందించుకోవడం జరుగుతుంది. అమెరికా ఇందుకొక ఉదాహరణ. రష్యా తనకు ప్రబలశత్రువని అమెరికా భావించింది. అందుచేతనే రష్యాను ఎదుర్కొనేందుకు అవసరమైనంత సైనిక బలాన్ని అమెరికా పెంపొందించుకున్నది.

భారత ప్రభుత్వవిధానం మొదటినుంచీ కూడ, "ఇంట్లో గాంధీజమ్, బయట తటస్థ విధానం". అధికారంలోనికి వచ్చినప్పటి నుంచి కాంగ్రెసు 'అహింసా సిద్ధాంతం' అవలంబించడానికి ప్రతిన తీసుకున్నది. ఈ ప్రతిజ్ఞ తీసుకున్నప్పటికీ హైదరాబాదులో పోలీసుచర్య, కాశ్మీరు పోరాటం, గోవా హత్యాకాండ, జరుగక తప్పలేదు. 'అహింసా సిద్ధాంతం' ఇలా విఫలం కాకనూ తప్పలేదు.

తటస్థవిధానం అమెరికాకూడా రెండవ ప్రపంచసంగ్రామానికి ముందు అవలంబించింది. మన్రో సిద్ధాంతంప్రకారం ఆ తటస్థ విధానం కొంత జయప్రదం అయిందికూడా. అది జయప్రదం కావడానికి బ్రిటిష్ సాకా దళం మరికొంత కారణం.

తృతీయ పంచవర్ష ప్రణాళికను గూర్చి విస్తృతంగా చర్చలు జరుగుతున్నాయి. కాగా దేశరక్షణ నిమిత్తం సమగ్రమైన ప్రణాళిక ఒకటి అవసరం. ఉత్తరాదిని హిమాలయాలు చైనానుంచి రక్షణ కల్పించగలవని సంతృప్తిపడటం సమంజసం కాదు. రక్షణబలాలు పెంపొందించడానికి తగు ప్రణాళిక రూపొందించడం ఎంత అవసరమో, తెలియనివారు లేరు. హిమాలయాలుంటే రక్షణబలాలెందుకనడంలో అర్థం ఉండదు. ఇటువంటి వాదప్రతివాదాలు కొందరు చేస్తూ వుంటారు. ఇవి దురాక్రమణచేసే దేశాలను మరింత హుషారుచేస్తున్నాయి. దేశంలో ధైర్యసాహసాలు, సిబ్బందిలో క్రమశిక్షణ వీటివల్ల తగ్గే ప్రమాదం ఎంతైనా వుంది. చాలామంది ఈనాడు మనదేశంలో ఇలాంటి వ్యర్థప్రసంగాలు చేస్తున్నారు. ఈ [illegible] చేయడం సిక్కిమ్, భూటాన్, [illegible] ఆక్రమించుకోవడానికి చైనాను ఆహ్వానించడమే!

ఇండియా నేడు పాటిస్తున్న 'అతిమంచి' వల్ల ఈ చిన్న చిన్న రాజ్యాలన్నీ చైనాకు చేరిపోయే ప్రమాదం వుంది. చైనా త్వరలో అగ్రరాజ్యాలలో మొట్టమొదటిది కాబోతున్నదని శ్రీ క్రుశ్చేవ్ అన్నారు. ఈ చిన్న రాజ్యాల చేరిక ఆమాటను నిజం చేయడం తథ్యం! కాబట్టి తృతీయ ప్రణాళిక రక్షణ బలాలను కట్టుదిట్టం చేసి పెంపొందించే విషయమయి తగు కార్యక్రమం రూపొందించడం అత్యవసరం.

* * *

గోరఖ్‌పూర్ కార్మిక ఉద్యోగకేంద్రం ఎత్తివేయాలని కేంద్ర కార్మికమంత్రిత్వశాఖ చేసిననిర్ణయంతో అనేక తీవ్రసమస్యలుత్పన్నమైనట్లు తెలుస్తున్నది. సెప్టెంబరు 30-న ఈ విషయం చర్చించేటందుకు ఒక సమావేశం కూడా ఏర్పాటు చేయబడిందట.

ఖనిజాలు మొదలైన నైసర్గిక సంపదలు ఎక్కువగావుండి, జనసాంద్రత చాలా తక్కువగా ఉన్నచోట్ల, కార్మికులకొరత లేకుండా బయటనుంచి కార్మికులనురప్పించి వారికి పనిశిక్షణ, గృహాలు, తిండి, బట్ట, భత్యాలు ఏర్పాటుచేయడం యీ కేంద్రం లక్ష్యం. రేపు తృతీయ, చతుర్థప్రణాళికా కాలంలో ఇటువంటి కార్యక్రమం మరింత జోరుగా సాగవలసి వుంటుంది. ఇప్పుడీ కార్మిక ఉద్యోగకేంద్రం మూసివేయడంలో అర్థంలేదు.

ఈ కేంద్రంవల్ల ఇంకా యీ ప్రయోజనాలు కలుగగలవు:

1) కార్మికులలో షిఫ్ట్ పద్ధతి అనగా

# అమరజీవి బండారనాయకే



శ్రీలంక పారతంత్ర్య తిమిరంలో జన్మించి, స్వాతంత్ర్య సమరంలో కాకలు తీరి ఉత్తమపురుషుడుగా, శాంతిస్వభావుడుగా, రాజకీయవేత్తగా, వక్తగా, విశేషించి వ్యక్తిగా తనవారి యొక్క పరులయొక్క గౌరవాదరాలు చూరగొని అసుర ప్రవృత్తుల ప్రతీపశక్తికి బలియైన శ్రీ బండారనాయకే ఆసియా చరిత్రలో నిలిచిపోయే ఒక ఉదార పురుషుడు.

సెప్టెంబరు 25 ఉదయం పదిగంటలకు కొంచెం ముందు తన భవనంలో ఒక కుహనా బౌద్ధభిక్షువు రివాల్వర్‌కు ఆయన గురి అయ్యారు. అయిదుగంటల శస్త్ర చికిత్సతో 22 గంటలు ఆయనను బ్రతికించుకోవాలని వైద్యనిపుణులు హోరాహోరీగా పోరాడారు. కాని పరస్పర విద్వేషపూరితమైన ప్రపంచంలో నుంచి ఆయన శాశ్వతంగా నిష్క్రమించారు. ఆయన వయస్సు అరవై సంవత్సరాలు.

విద్యార్థిదశలో ఆక్స్‌ఫర్డులో మంచివక్తగా పేరుపొందారు. ఇండియన్ మజ్లిస్ అధ్యక్షుడుగా, సాహిత్యవేత్తగా లబ్ధప్రతిష్ఠులైనారు. 1931 నుంచి మరణపర్యంతం శ్రీలంక పార్లమెంటు సభ్యులు. 1956లో ప్రప్రథమంగా వామపక్షాలు అధికారానికివచ్చినప్పుడు ప్రధానిగా ఎన్నికైనారు. పశ్చిమరాజ్యాల అడుగులకు మడుగులు వత్తేస్థితి తొలగించి శ్రీలంకకు స్వతంత్ర ప్రతిపత్తిని కలిగించారు.

పంచశీల వికాసానికి, ఆసియా ప్రజల శాంతియుతసహజీవనానికి ఆయన త్రికరణశుద్ధిగా పాటుపడ్డారు. తనను చిత్రహింస చేసిన వానిపై దాక్షిణ్యంచూపమని మృత్యుశయ్యపై నుంచి ప్రజలకు విజ్ఞప్తిచేయడమే కాక 'అతనిపరిస్థితి ఎలా ఉన్నది' అని చివరి క్షణంలో కూడా అడిగిన దివ్యసంస్కారం ఆయనది.

ఒక్కసారి ఈ విషయం విన్నవారందరికీ హృదయభారంకలిగి బాపూజీ, ఆంగ్‌సాన్‌లాంటివారు మనస్సులో మెదులుతారు.

కేవలం రాజకీయాలలో నేగాక అలౌకికమైన అహింసా ధర్మంలోకూడ ఆదర్శప్రాయులైన శ్రీ బండారనాయకే సర్వమానవ హృదయాలలోను చిరంజీవి.

---

అంచెలవారీ పనికి బాగా వీలు అవుతుంది. కార్మికులు గైర్ హాజర్ కావడం చాలా వరకు తగ్గుతుంది.

2) దీనివల్ల ఉత్పత్తి బాగాసాగి అమిత ఖర్చుతో రవాణాకై ఏర్పాటుచేసిన రవాదారులు ఇనుపదారులు బాగా ఉపయోగపడి పనివేగంగా జరిగిపోతుంది.

3) అంచెల పద్ధతివల్ల కార్మికులకు కొంత వారకోరే వసతులు ఏర్పడగలవు. పనిచేసేకాలం తగ్గి, విశ్రాంతి లభిస్తుంది. జీతభత్యాలు లెక్క ప్రకారం అంది నిరుద్యోగవర్గాల ఆందోళనలు తగ్గగలవు.

4) జట్లవారీపని, సామాజిక జీవనమూ ఈ కేంద్రం నిర్వహణలో సాధ్యం కావడంతో ప్రభుత్వ 'సహకార' నినాదం కొంత ఫలవంతం కాగలదు.

5) ముందు ముందు భవిష్యత్తులో కార్మికుల కుటుంబాలకు ధనం కూడబెట్టి అందుకుగాను జీతంలోనుంచి మినహాయింపులు క్రమబద్ధంగా ఈ కేంద్రం జరుపుతున్నది.

6) ఏవిధంగానూ సంపాదనలేక బాధపడుతున్న ప్రాంతాల కార్మికులకు గనులలో పనిచూపి, గనులపనిలో తట్టుకోలేని స్థానిక కార్మికులకు తేలికయిపనులు చెప్పటంకూడా కార్మిక ఉద్యోగ కేంద్రం ద్వారా సాధ్యం కాగలదు.

7) కార్మికులలో క్రమశిక్షణకు తగు కార్యక్రమం రూపొందించి అమలుజరపడం వల్ల చాలా కార్మికసమస్యలు తొలగిపోగలవు.

పెలికయాలగూర్చి సెప్టెంబరు 12వ తేదీన లోక్ సభలో చర్చ జరిగింది. చర్చను ఉపక్రమిస్తూ ఉత్తరప్రదేశ్‌కు చెందిన శ్రీ కె. యస్. పాండే ఈ కార్మిక ఉద్యోగ సంస్థ పథకం 1942 నుంచే అమలులో ఉన్నదని రక్షణ ప్రణాళికకోసం అది అమలు జరపడం జరిగిందని వెల్లడించారు. ప్రపంచ యుద్ధం ముగిసినతరువాత గని యజమానులు ఈ ప్రణాళిక మొత్తంఖర్చు భరించే షరతు మీద ప్రభుత్వం కార్మికులను వారికి సహాయంగా నియోగించారు. బొగ్గుగని ప్రాంతాలకు కార్మికులను సప్లయి చేయడం అప్పటినుంచే ఈ కేంద్రం నిర్వహిస్తున్నది.

కాగా ప్రస్తుతం కేవలం బొగ్గుగనులకే కాక, ఇతర రంగాలకు కూడా కార్మికబలం సప్లయిచేయడం జరుగుతున్నది. చర్కిలోని ప్రభుత్వ సిమెంటు ఫ్యాక్టరీకి, కొంత క్వారీలకు కార్మికులు ఈ కేంద్రంద్వారా పంపబడుతున్నారు. వేలు కార్మికులు వలసలుగా వెళ్ళి కొన్ని ప్రాంతాలు ఆక్రమించుకొని, డామ్‌లు, పవర్ హౌసులు మొదలయినవి నిర్మిస్తున్నారు.

వీటన్నిటి దృష్టిలో పెట్టుకొని చూస్తే బొగ్గుగనులకు కార్మిక ఉద్యోగకేంద్రం లోక్యం కూడదన్న మాటకు అర్థంలేదు. ఈ కేంద్రం ఎత్తివేసే యోచన ఎందుకో అసలు అంతుపట్టడంలేదు.

గోరఖ్‌పూర్‌లోగల కార్మికులలో నూటికి ముగ్గురు గనిపనివారు. వారుచేస్తున్న ఉత్పత్తి మొత్తంలో నూటికి 12 వంతులు. ఇంత అధికోత్పత్తి ఇతర కార్మికులు సాధించడంలేదు. అందుచేత వీరికి కొన్ని ప్రత్యేకమైన సదుపాయాలు ఏర్పాటుచేశారు. ఇది ఇతర కార్మికులకు కష్టం తోచింది. తత్ఫలితంలో లోపల ఆందోళన లేవదీయడం. చివరకీ నిర్ణయం.

కేంద్ర కార్మికమంత్రి శ్రీ జి. ఎల్. నందా ఈ నిర్ణయాన్ని వెంటనే అమలు జరుపబోమని, కాగా ఈలోగా మరికొన్ని ప్రయత్నాలుచేసి సుసాధ్యమైన పథంలో అలా చేయగలమని ప్రకటించారు. ఇందునిమిత్తం కొందరు పార్లమెంటు సభ్యులతో ఒక కమిటీని నియమించగలమని కూడా శ్రీ నందా వెల్లడించారు.

కార్మిక ఉద్యోగకేంద్రం నియమాల ప్రకారం కార్మిక ఉద్యమాలవంటివి బహిష్కరించబడినాయి. ఈ కేంద్రం ద్వారా ఉద్యోగాలివ్వబడిన కార్మికులు ట్రేడ్ యూనియన్‌లలో చేరకుండా ఆంక్షలు విధించడం జరిగిందని కార్మిక మంత్రి చెప్పారు.

ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి ఈ కేంద్రం మూసివేయవలదని కోరుతూ తమకు జాబులు వ్రాశారనికూడా ఈ సందర్భంలో శ్రీ నందా వెల్లడించారు. 




క్రమ్ముచీకటి పడుతూంది...దీపాలు వెలిగించారు.

ఆ సమయంలో వెంకటేశ్వర్లు యింట్లోకి విసురుగా వచ్చాడు.

నడవలో కూర్చుని, చంటి కుర్రవాడికి పాలిస్తున్న కాంతి భర్త రాకను గమనించింది.

అతడు వడిగా చొక్కాను విప్పి, వంకె మీదకు విసరాడు. పంచెను యెగకట్టి కాళ్లు కడుక్కు వచ్చి కుర్చీలో కూర్చుని చుర, చుర భార్యవైపుకు చూశాడు.

భర్త ధోరణి కాంత యించుమించుగా అర్థంచేసుకొని, గతం గుర్తుచేసుకొని కరంగిపోయింది! అన్నయ్య యింకా లెక్క యివ్వలేదన్నమాట! చేతి అప్పులు తీర్చటంకోసం తన భర్త నాలుగువందల రూపాయలు ప్రావిడెంటుఫండులో అప్పు తెచ్చుకొని - వాటిని తీర్చకుండా ఒక మంచి ముహూర్తం చూసి, అప్పులు తీర్చుదామనే వుద్దేశంతో బ్యాంకులో పడేసి వుంచటమే కొంప ముంచింది! ఆయన చెక్కు పుస్తకం బ్యాంకు నుంచి తెచ్చి తనకు చూపిస్తూ; "వాటిమీద మనం సంతకాలు చేసి బ్యాంకుకు పంపితే కళ్ళు కద్దుకుంటూ డబ్బు యిస్తారు. ఈ బడి పంతులు సంతకానికంత విలువుందన్న మాట!" అంటూ మురిసిపోయారు...కానీ తాను గొప్పగా అప్పుడే అంది! "అప్పుచేసి పప్పుకూడులాగ మా మంచిపని చేశారం"డీ! అప్పులాళ్ళు మన యింటిచుట్టూ తా...ఈగల్లాగ, దోమల్లాగ తిరుగుతూంటే...మధ్య మీరు బ్యాంకులో ఆ డబ్బువుంచి చెక్కు పుస్తకం చూసి మురిసిపోటం యేమిటి అంటే! ఆ డబ్బు యెందుకోసమని తెచ్చుకొన్నారో దానికి ఖర్చుచేస్తే - మీ మాటా దక్కుతుంది; అందంగానూ వుంటుంది. బజారులో పలుకుబడీ చచ్చిపోదు. ఇంట్లో ఈగలమోతట! బయట బాజాలమోతట!? ఒక మూల అప్పులాళ్లు పీక్కు తింటూంటే యీ చెక్కు పుస్తకం యెందుకండీ బాబూ? మీ రలా పెట్టుకు కూర్చోండి...అప్పులు అప్పుల్లాగ వుంటాయ్...మధ్యలో యెవరో వచ్చి గద్దల్లాగ యెత్తుకుపోతారు" - అంది. తన మాటల కాయన సమాధానం యివ్వకుండా ముసి, ముసి నవ్వి వూరుకొన్నారు.

ఏమయితేనేం - తన నోటిమాట వేదవాక్కు అయింది...ఆయనగారు బ్యాంకు

లో డబ్బు వేసిన మూడో రోజున తన అన్న తమను చూసిపోదామని రాగా, యోగక్షేమాలతోపాటు తాను చెక్కుపుస్తకం సంగతి గూడా వాడికి చెప్పింది అన్న సోమనాథం అంతటితో వూరుకోకుండా అంగులో యెంత డబ్బు వుందని అడిగాడు. తాను చెప్పింది. "నాకు కొంచెం డబ్బవసరంగా వుంది. పది, పదిహేను రోజుల్లో సర్దుబాటు చేస్తాను. కాస్త బావతో చెప్పి సర్దుబాటు చేయించు చెల్లాయ్"-అని అన్న అడగటంతో శే తాను కాదనలేకపోయింది. తానిచ్చినమాట ప్రోత్సాహంతో ఆయన "పది రోజుల్లో సర్దుబాటు చేయాలి సుమా... నే చిక్కుల్లో పడతాను" - అంటూ మూడు వందల రూపాయలకు చెక్కు వ్రాసి యిచ్చారు. ఈ మధ్యకాలంలో తొంభై రూపాయలు అటుపా, ఇటుపా తన ఖర్చుల క్రింద అయిపోయాయి: ఇంక ఎకౌంటు కోసం బ్యాంకులో పదిరూపాయలు లుంచాలంటూ ఆయన వటిని తీయలేదు.

అవసరంమీద తీసుకువెళ్ళిన అన్నయ్య అనుకొన్న వ్యవధికి లెక్క తెచ్చియివ్వలేదు. పైన నెలరోజులు జరిగియికూడా అయిదెకరాలపొలం సేద్యం చేస్తున్న అన్న అనుకొన్న వ్యవధికి లెక్క ఇవ్వగలడని తాననుకొంది. కానీ అలా జరగలేదు. పాపం వాడికేర్పడిన యిబ్బందు లెటువంటివో!

గత నెలరోజులనుంచి తను యిబ్బందులు ఆ భగవంతుడికే తెలుసు. బాకీదారులు చీమలబారుగా తిరుగుతున్నారు. డబ్బు వచ్చినాక కూడా వాళ్ళచేత భర్త చివాట్లుతినటం జరుగుతూంది; ఆయన చివాట్లతో చెప్పుదెబ్బలు కూడా తన కప్పచెబుతున్నారు.

ఈలా గతాన్ని ఓమారు తలపోసుకున్న శాంత-భర్త కేసి జాలిగాలి చూసి, నిద్రపోయిన చంటిపిల వాడిని లేవనెత్తుకొని

# ★ చెక్కు-పుస్తకం ★

ఉయ్యాలలో పడుకోపెట్టుతూ "ఏమండీ" అంది.

'ఊ...' వెంకటేశ్వర్లు మేఘగర్జన చేశాడు. పిల్లవాడు ఉలిక్కిపడ్డాడు.

'ఏమిటండీ ఆగొంతు'

"నాగొంతే అటువంటిది లే."

"ఎందుకండి అంతకోపం...మీ కోసం రాఘవేంద్రరావుగారు వచ్చారు."

"నాకు కోపం దేనికి...ఇవ్వవలసిన వాళ్ళందరికీ యింట్లో అన్నీవున్నా, అల్లుడి నోట్లో శనిలాగ లేదని చెప్పి చెప్పుదెబ్బలూ: చివాట్లూ తినవలసివస్తూంది...రాఘవేంద్రరావూ వస్తాడు; శనేశ్వరరావు వస్తాడు."

"అసలు అన్నయ్య యేమన్నాడండీ..."

"ఎలాగయినా మీ అన్నయ్యేకదా! పని తీరిందిగా ఏమైనా అంటాడు"...వెంకటేశ్వర్లు మాటలు చాలా వేడిగా వున్నాయ్.

"అనవసరంగా వాడి నేం అనకండి! వాడు చాలామంచివాడు...యేవో పరిస్థితులు..."

"అవును. అందుకే నన్ను డబ్బు ఇప్పింపచేసి శుద్ధగాడిదను చేసిపారేశావ్ నువ్వు."

"రామ, రామ అవేం మాటలండీ? మిమ్మల్ని నేగాడిదచేస్తానా."

"అంతకంటె యెక్కువే చేశావ్...రేపు ప్రొద్దుట నా మొగుడు రామస్వామి వస్తాడు. అతను నామర్యాద యెప్పుడో తీసిపారేశాడు. వీధికెక్కడానికి సిద్ధంగా వున్నాడు. 'రెండువందలరూపాయలూ యిచ్చి నోటు తీసుకుంటారా...లేకపోతే కోర్టుకెక్కమంటారా...అని లేలిగ్గా వదలక: "మీరు పెద్దలుబాబూ! డబ్బు అవసరసమయంలో పుచ్చుకొన్నప్పుడుంటే మాటలు...తిరిగి ఇచ్చేటప్పుడెందుకుంటాయ్? మాట నిలబెట్టుకోని మనుషులతో మాట్లాడటంగూడా మహాపాపం సుమండీ. రేపు ప్రొద్దుట బజారులో యేముఖం పెట్టుకు తిరుగుతారండీ? మళ్ళామీకు డబ్బు అవసరంరాకుండా వుంటుందా?..." నువ్వు విన్నావుగా ఇటువంటి మాటలతో అమన్య వచ్చినప్పుడు సాధించి నన్ను తలయెత్తనివ్వకుండా చేశాడు."

కాంత, భర్త అన్న మాటలు యథార్థమవటంవల్ల సానుభూతితో అతడివంక చూసి: "అసలు మీరు బ్యాంకులో డబ్బు వేయటం మాని లెక్క అందటం తర్వాయిగా తీసుకువెళ్ళి ఆ రామస్వామి కివ్వవలసింది" అంది.

"ఇచ్చి వద్దామనే అనుకొన్నాను. కానీ యీడబ్బువచ్చేముందు రామస్వామికి సరిగ్గా రేపు రావలసిందని గడువు పెట్టాను. "ఇదివరలో చాలాగడువులు పెట్టారు. కానీ ఈ సారి తప్పితే కోర్టుకెక్కుతానంటూ" అని రామస్వామి వెళ్ళిపోయాడు. వడ్డీ తగ్గకుండని లోచినా మాట నిలకొన్నతనంకోసం- అన్న నాటికివ్వవచ్చని బ్యాంకులో వేశాను. అదిలా కొంప ముంచుకు వచ్చింది" - వెంకటేశ్వర్లు క్రోధంలో కొంచెం విసురుగా అన్నా, భార్యకేసి జాలిగా చూశాడు. ఎంత కోపం వస్తే మట్టుకు అనురాగం ఎక్కడికి పోతుందంట?

"అంతేలెండి......ఇంతకీ అన్న యేమన్నాడు."

"ఏం చెప్పనూ......అతడూ శతవిధాల ప్రయత్నించాడు. కానీ లభ్యం కాలేదు. చేతికి రావలసిన లెక్క యింకా రాలేదు. రకం త్రిప్పుకోటానికి యెవరో రెడ్లను అడిగా - నాలుగురోజులాగమన్నారట... ఈ నాలుగురోజులూ ఎలా జరపాలో నాకే అర్థం కావటం లేదు."

"ఈ నాలుగురోజుల్లో తప్పకండా వస్తుందంటారా?"

"ఆ......ఎవరో మొఖాసా రెడ్లట మీ అన్నయ్యకి యిష్టులు గూడా. వాళ్ళు తప్పకుండా ఇస్తారు. కానీ అంతవరకూ ఎలాగ? రేపు వచ్చే వీరస్వామికి యేలా సమాధానం చెప్పేది? అతన్ని యేలా పూరుకోబెట్టగలను? నా మాటమీద అతడు గౌరవం వుంచుతాడా?"

"మరో నాలుగురోజులేగా! ఏలాగో సరిచెప్పండి...అవసరం అయితే మీరు ముచ్చటగా సంపాదించుకొన్న చెక్కుపుస్తకం వుందిగా...దాన్ని చూపించండి"—కాంత నవ్వింది. అయితే యథాలాపంగా ఆమె యిచ్చిన సూచనతో అతడిలో ఒక రకం అభిప్రాయం మొలకెత్తింది.

మరి నాలుగురోజులవరకూ లెక్క అందదు. నాలుగోరోజుకి బావమరిది- మొఖాసా రెడ్డి నడిగి తప్పకుండా తీసుకువస్తాడు. రేపు, ఉదయం వీరాస్వామి - కోరాలూ మిరియాలూ నూరుతూ తనదగ్గరకు వస్తే - తానేమని సమాధానం చెప్పగలుగుతాడు? ముఖం వాచేటట్లుగా అతడి చివాట్లు తానుతినాలా? అతనంతటితో ఊరుకుంటాడా? ఇంతవరకూ వూరుకొన్న వీరాస్వామి యీ నాలుగు రోజులూ ఓపిక పడతాడనే నమ్మకం ఎక్కడుంది? కచ్చితంగా - అనుకొన్న గడువు ప్రకారం రేపు వచ్చి: "మీ మాట నిలబెట్టుకుంటారా?"—అంటే తానేం చేసేది? భార్య అన్నట్లుగా చెక్కుపుస్తకం తనకేమయినా వుపయోగిస్తుందా? బాలన్సు లేని ఆ పుస్తకం చిత్తుకాగితంముక్కలతో సమానం గదా...ఏమిటీ దారి? వీరాస్వామికి నచ్చ చెప్పటం యెల్లాగ? ఈ నాలుగు రోజులూ కాలక్షేపం చెయ్యటం యెల్లాగ?

వెంకటేశ్వర్లు భోజనానికి లేచి - ఏవో నాలుగు మెతుకులు తిన్నాడు. మంచం యెక్కి నిద్రపోయాడు. కానీ అతడి మనస్సు మాత్రం - ఆరాత్రి ఒంటిగంటన్నరవరకూ వీరాస్వామి రాకగురించి, చెక్కుపుస్తకంగురించీ ఆలోచిస్తూనే వుంది.

* * *

మర్నాడు ఉదయం ఎనిమిది గంటలయింది:

నిద్రలేని కళ్ళతో హైస్కూల్లో మాస్టరీ ఉద్యోగం వెలగబెడుతున్న వెంకటేశ్వర్లు వసారలో కూర్చుని యింగ్లీషు కాంపోజిషన్ పుస్తకాలు దిద్దుకుంటూంటే, అతను యెదురుచూస్తూ, ఊహిస్తున్న వీరాస్వామి సాక్షాత్కరించాడు! వీరాస్వామి వడ్డీవ్యాపారం చేసేమనిషే కానీ, పల్లెటూరు ఆసామీ అవటంవల్ల పట్నవాసం గొడవలు అతడికి తిన్నగా తెలియవు. కానీ మోటుమనిషి. పెళుసుగా మాట్లాడే అతడ్ని చూడటంతోటే- ముందుగా వెంకటేశ్వర్లు బేజారయిపోయాడు. అయితే గత రాత్రి నుంచీ ఆలోచించి-ఒకనిశ్చయానికి వచ్చిన అతగాడు-తన మనోనిశ్చయాన్ని ఆచరణలో పెట్టటంకోసం ఒకమూల గుండె దడ,దడలాడుతూండినా; తెచ్చుకొన్న మందహాసంతో వీధి అరుగుమీద చాప తెచ్చి వేసి—"కూర్చోండి వీరాస్వామిగారూ"అన్నాడు.

చాప తెచ్చి వేయటం, "నువ్వు" అనిపించుకునే తన్ను 'మీరు' అని సంబోధించటం వీరాస్వామి కానందం కలిగించాయి.

"చిత్తం...నాకు పనుంది...తొందరగా వెళ్ళాలి" వీరాస్వామి అన్నాడు కూర్చుంటూ.

"మిమ్మల్ని నేను అనవసరంగా కూర్చోపెట్టను..." ఇలా అంటూ, ఇంట్లోకి వెళ్ళి చెక్కుపుస్తకంతో వెంకటేశ్వర్లు అక్కడికి వచ్చాడు. అతడిచేతులు యెందుకో వణుకుతున్నాయ్.గుండె దడదడ కొట్టుకుంటోంది. చెక్కుపుస్తకం చూటంతోటే వీరాస్వామి

"అతను జీవితాన్ని సౌందర్యానికి అంకితం చేశాడు!"

"ఓహో బహుశా చిత్రకారుడై ఉంటాడు"

"చిత్రకారుడైతే సౌందర్యం అనుభవించేవాడు. అది కాదు సంగతి. అతను ఒక సినితారను పెళ్ళాడాడు. సౌంధర్యానికి అంకితమైపోయాడు."

ముఖం వికసించింది. తన లెక్క చేతులోపడి నట్టే అతడు సంతోషించాడు.

వెంకటేశ్వర్లు చాపమీద కూర్చొని పుస్తకం చేత్తో పట్టుకొని లెక్క యిచ్చేసే మొగవాడిలాగ బెగురుస్వరంతో: "లెక్క కట్టార?" అడిగాడు.

"చిత్తం. నిన్నటివరకూ చూస్తే రెండు వందల ముప్ఫైరెండు రూపాయలు వడ్డీతో సహా అయిందండి..." డబ్బు వసూలు చేసుకోబోతున్నాడు కనుక వీరాస్వామి వినయంగా అన్నాడు.

"నాకూ అంతే వచ్చిందిలెండి..." లెఖ కట్టకపోయినా మాటలో మాట ఔచిత్యం కోసం అన్నాడు వెంకటేశ్వర్లు.

"నాదగ్గర లెక్క కట్టడంలో పొరపాటు జరగదండి."

"నాకు తెలియదేమిటి...మీరు కోటు తెచ్చారా?" వీరాస్వామి కోటుతీసి చూపిం

# ★ చెక్కు—పుస్తకం ★

వాడు.

"అయితే...బ్యాంకుకు చెక్కు వ్రాసి యిచ్చేస్తుంటారా"...మాటలుతడబడి లేదు కాని వెంకటేశ్వర్లు కొంచెం కంగారుగా అన్నాడు.

"కేష్ లేదాండీ?"

"కేష్ ఉంచవలసిందే...కానీ మీరాక కోసం యెదురుచూస్తూ, దగ్గర ఉంచుకోటం కంటె బ్యాంకులో ఉంచటం మంచిదని అందులో పడేశాను."

"అయితే లెక్క మీకెప్పుడో అందిందన్నమాట."

"ఆ...అనుకొన్న రోజున ఇచ్చి మాట దక్కించుకుందామని యిలా చేశాలెండి..."

"లేలెండి...అయితే చెక్కు వ్రాసి యిస్తానంటారా? సరే కానివ్వండి..."

వెంకటేశ్వర్లులో తిరిగి దడ ప్రారంభమయింది......అయితే పథకం ఇదివరలో ఊహించినది అవటంవల్ల: "చెక్కు మీకేలాగా ఇచ్చేస్తున్నాననుకోండి. మీరు దాన్ని యెప్పుడు కేష్ చేసుకుంటారూ?" అని అడిగాడతను.

"ఈవేళ కుదరదులెం ...ఊరికి వెడుతున్నాను. రేపు వచ్చి చేయాలి. డబ్బు చాలా అవసరం."

"రేపు...అది కుదరదనుకుంటాను. ఈ వేళ మంగళవారమా...మీరు శుక్రవారం నాడు చెక్కు కేష్ చేసుకోవాలదూ..." వెంకటేశ్వర్లు తెలివితేటలుగా బావమఱది పెట్టిన గడువుకంటే ఒక రోజు యెక్కువ వేసుకొన్నాడు

"అదేమిటండీ—" వీరాస్వామి తెల్లబోయాడు.

"ఏం లేదులెండి ... నా డిపాజిటు ఎకౌంటు పుస్తకం... హెడ్డాఫీసుకు వెళ్ళింది అది శుక్రవారంనాటికి వస్తుంది. మీరా వేళ పన్నెండుగంటలకి వెడితే వాళ్లు చెక్కు తీసుకొని కేష్ ఇచ్చేస్తారు." వీరాస్వామి ఆలోచనలో పడ్డాడు. వెంకటేశ్వర్లు ఇంత వరకూ పథకం తమాషాగానే వేసుకు వచ్చాడు. వీరాస్వామి కతడిమాటలు అర్థం కాలేదు. "శుక్రవారందాకా చెక్కు కేష్ అవదంటారు."

"ఊఁ. శుక్రవారం పన్నెండుగంటల కెళ్లి మీరు కేష్ చేసుకోవచ్చు."

"మరో మూడు రోజులు ఆలస్యం అన మాట...సరే యివ్వండి."

తాను చేస్తున్న పని యెటువంటిదో గురించకుండా వెంకటేశ్వర్లు రెండువందల ముప్ఫై రెండు రూపాయలకూ చెక్ వ్రాసి, సంతకం చేసి వీరాస్వామికిస్తూ "మీరు శుక్రవారంలోపున దీన్ని బ్యాంకుకు తీసికెళ్లకండిసుమా—" అన్నాడు.

"మీ రంతగా చెప్పాలాండీ! మీ నోటిదిగో..." వీరాస్వామి నోటివ్వబోయాడు.

"నా నోటుకు ఖంగారులేదు. కేష్ మీరు తీసుకున్నాక నా నోటు నాకు మీరివ్వవచ్చును" వెంకటేశ్వర్లు యిలా ఉదారంగా అనటంతోటే—

"సరేలెండి వస్తా...తిరిగి కలుస్తా" అంటూ వీరాస్వామి నిష్క్రమించాడు.

"బ్రతికి బయటపడ్డాను" అనుకుంటూ వెంకటేశ్వర్లు యింట్లోకి వచ్చాడు. ఇదంతా వంటగదిలోంచి గమనిస్తున్న శాంత అక్కడికివచ్చి "చెక్కు యిచ్చారు యేమిటండీ! కొంప మునగదుగదా" అంది.

"ఏం మునుగుతుంది? మీ అన్నయ్య శుక్రవారం ఉదయం లెక్క తెచ్చి యిస్తాడు. నేను శుక్రవారందాకా వాయిదా పెట్టేను. అతడు కనీసం శుక్రవారం వచ్చినా బాధలేదు. ఆ వేళే అది బ్యాంకులో నే పదిగంటలకు పడేస్తాను. అటుగం ఎప్పుడు పన్నెండుగంటలకు వీరాస్వామి చెక్కు కేషు చేసుకోటానికి మరేటువంటి ఆటంకం ఉండదుకదా—"

"అన్నయ్య శుక్రవారం ఉదయాని కయినా లెక్క తప్పకుండా తెచ్చియిస్తాడంటారా...?" శాంత అనుమానంగా అంది.

"ఊఁ..."

"అయితే ... చెక్కు పుస్తకం, చెక్కు చూపించి మీ మర్యాద బాగా ప్రస్తుతం దక్కించుకొన్నారన్నమాట" శాంతనవ్వింది.

"మరేమనుకొన్నావ్" అన్నట్లుగా భార్యకేసిచూసి "అప్పుడే తొమ్మిదయింది. ముందు వంట సంగతి చూడు" అన్నాడు వెంకటేశ్వర్లు.

* * *

ఆ వేళ శుక్రవారం...

ఉదయం ఎనిమిదిన్నర గంటలయింది...

ప్రస్తుతం వెంకటేశ్వర్లు [illegible] కళ్లు పరుగెడుతున్నాయ్. [illegible]వారం తప్పకుండా రాగలనన్న బావ అది శుక్రవారం వచ్చినా రాలేదు. ఒకతప్పును కప్పిపుచ్చుకోటంకోసం మరోతప్పు అతడు చేశాడు. ఈరోజు పది గంటలలోపుగా నయినా తనబావ రాకపోతే తనగతేంకాను? వీరాస్వామి బ్యాంకుకు వెడితే తనబ్రతుకు అభాసేకదా! "ఆయనకసలు బ్యాంకులో నిలవే లేదు. తమాషాకు చెక్కు ఇచ్చాడు" అని బ్యాంకువాళ్లంటే—వీరాస్వామి తనను మాటలతో వదులుతాడా! తానిటువంటి పొరపాటు పని యెందుకు చేశాడు?

కాలం గడుస్తూంది. వెంకటేశ్వర్లు భార్యకేసి చురచురా చూస్తున్నాడు. "నీ మూలకంగానే నాకీ తిప్పలన్నీ వచ్చాయి"—అన్నటుగా వుంటున్నాయి ఆ చూపులు!

శాంత గృహసంబంధమైన ఏమైనా ప్రశ్నలడుగుతే కసురుకుంటూ సమాధానాలిస్తున్నాడు. మాటిమాటికీ వీధిలోకి తొంగి చూస్తున్నాడు.

ఈవిధంగా తొమ్మిదిన్నరదాకా కాలం గడిచింది.

"మీ అన్నయ్య నాకొంప ముంచాడు. ఆపదానికంటె అవమానస్నయిపోయాను... ఆయనగారి దర్శనం అయ్యేదాకా—ముసుగు వేసుకొని మూల కూర్చోవలసిందే..." శాంతను వెంకటేశ్వర్లు విసుగ్గా అంటూ కొంతాంతిరాలచె బడికి రాలేనంటూ సెలవుచీటి వ్రాసి, ప్రక్కింటి కుర్రవాడిచేత బడికిపంపించాడు.

విధి వశాన్నికి ఎదురుగా కూర్చోటం ఇష్టంలేక వంటగదిలోకి తన మకాం మార్చుకొని, వెంకటేశ్వర్లు తనఖర్మను తాను నిందించుకుంటుంటే జరిగిన సంగతులన్నీ తలుచుకు శాంత ఆపరిస్థితిలో నవ్వుతూంటే భర్త పళ్లు పటపటలాడిస్తూంటే కాలం గడుస్తూంది.

* * *

మధ్యాహ్నం పన్నెండున్నర గంటలయింది...

"వెంకటేశ్వర్లుగారూ" — వీరాస్వామి విసుగ్గా బయటనుంచి కేక వేశాడు. వంటగదిలో పిల్లిలాగకూర్చున్న వెంకటేశ్వర్లు ప్రాణాలు పైకెగిరిపోయాయి. "ఏదో సమాధానం చెప్పి పంపించవలసిందని" ప్రాధేయపూర్వకంగా భార్యకేసి చూశాడు వెంకటేశ్వర్లు. శాంతనవ్వు నాపుచేసుకుంటూ, నడవ

(53-వ పేజీ చూడండి)

ఒకాయన: 'నేను ఏం చెయ్యాలనుకుంటానో-ఏం చేస్తానో అన్నీ మా ఆవిడకు చెప్పేస్తాను.

మరోఆయన: 'నేనలా చెప్పవలసిన అవసరమేంలేదు. ఏం చేతంటే నేనేమనుకునేది మా ఆవిడకి తెలుసు - ఏం చేస్తానో పక్కింటివాళ్లు చెప్పనే చెబుతారు!'

# వాసంతి వేడుక

“నెలకు ఐదువందలు సంపాదిస్తున్న ఒక పాతికేళ్ళ ఆంధ్రయువకునికి ఇరవై ఏళ్ళలోపు అందమైన, చదువుకున్న వధువు కావలెను. కుల మతములతో నిమిత్తం లేదు.”

వాసంతి దృష్టిని ఈ ప్రకటన అమితంగా ఆకర్షించింది. ఈ పెళ్ళి ప్రకటనలు చదువుతూంటే మనస్సెంతో తమాషాగా పరవశం చెందుతుంది. అసలు రోజూ ‘హిందూ’ రాగానే తను మొట్టమొదట చూసేదల్లా ఈ శీర్షికనే! తనకు అనేకసార్లు సందేహం వేస్తూవుంటుంది ‘ఈ పత్రికల మూలంగా పెళ్ళయినవాళ్ళు అసలు వున్నారా?’ అని. తనుకూడా ఓ అప్లికేషను పడేసి తమాషా చూడాలని చాలాసార్లు అనుకుంది కానీ... ఎప్పటికప్పుడు ఏదో ఆటంకం వస్తూనే వుండేది. కావాలన్న క్వాలిఫికేషన్సలో ఏదో ఒకటి తక్కువై పోయేది తనకు. చివరకు ఈనాడు తన నిరీక్షణ ఫలించబోతున్నది, కుల గోత్రములతో నిమిత్తం లేదట, ఎంత విశాల హృదయం!

వాసంతి గబగబా కాయితం, కలం తీసుకుని వుత్తరం మొదలుపెట్టింది.

“అయ్యా!” అని వ్రాసి ఆలోచనలో పడిపోయింది వాసంతి. కాబోయే భర్తను ‘అయ్యా’ అని సంబోధిస్తే బాగుంటుందా? బాగోకపోతే మాత్రం మరేమని వ్రాయాలి? మరి... పెళ్ళికాకుండానే ‘నాథా’ ‘మై డియర్’ అని వ్రాస్తారా?

అసలు పెళ్ళి అయ్యాకైనా వుత్తరం వ్రాసేటప్పుడు భార్యలు, భర్తను ఏమని సంబోధిస్తారో? తనకేమైనా తెలిసి ఏడుస్తేనా? ఒకమాటు అక్కయ్య బావగారికి వ్రాసినవుత్తరం పొరపాటున తన కంట బడింది. మొదటినుంచి చివరదాకా చదివినా కావల్సినదేమీ తనకు బోధపడలేదు. ఎక్కడా సంబోధించిన జాడేలేదు. కాని, అక్కయ్య దారి వేరు! చదువుకున్న వాళ్ళు ఎలా వ్రాసుకుంటారో? ఈ సందేహం తనను చాలా రోజులనుంచీ పీడిస్తున్నది.

పోనీ, తనుకూడా అక్కయ్యలాగా ‘అడ్రసు’ చేయకుండా వుత్తరం వ్రాసేనో? అబ్బే! అతనేమనుకుంటాడు? చదువూ, సంధ్యారాని పల్లెటూరిదని అనుకుంటేనో. అసలే చదువుకున్న యువతి కావాలని గోల పెడుతూవుంటే? ఆ, ఏమోలే! ఇంతకీ అతను తనను పెళ్ళిచేసుకోవాలనే వుద్దేశం తనకుంటేగా, ఏదో తమాషా చూద్దామని తప్ప!

వాసంతి వుత్తరం గబగబా వ్రాయటం మొదలుపెట్టింది.

“అయ్యా!

మీరు పత్రికలో వేసిన ప్రకటన చూశాను. మీరు కావాలనుకున్న లక్షణాలన్నీ నాలో

**మందరపు పద్మ, లలిత**

వున్నాయనుకుంటాను. మీరు అందమైన యువతి కావాలంటున్నారు. నేను అందంగానే వున్నాననుకుంటా. ఆ మాటకొస్తే ఎవరిమటుకు వాళ్ళు అందంగానే వున్నామనుకుంటారేమో!

అట్టే ఆలోచిస్తూవుంటే నేను అందంగా వున్నానా, లేదా అని నాకే అనుమానం వేస్తున్నది. అయినా, అందం అంటే ఎలావుండాలో వివరంగా వ్రాస్తారని తలుస్తాను. మీ జాబుకోసం ఎదురు చూస్తుంటాను.

స్వర్ణలత,”

మారుపేరుతో వ్యవహారం నడిపిస్తే ఎటొచ్చి ఏంవచ్చినా తనకే చిక్కు వుండదు, తమాషా చూడాలని తప్ప. తనకు బావతో ఏనాడో వివాహమైపోయింది మనసులో—

వుత్తరం పోస్టులో వేసిన పదిరోజుల కల్లా



“అయ్యా” అని వ్రాసి ఆలోచనలో పడిపోయింది వాసంతి.

# ★ వాసంతి వేడుక ★

అతని దగ్గఱనించి జవాబు వచ్చింది. వాసంతి తొందర తొందరగా తన గదిలోకి వెళ్ళి తలుపులు గడియ పెట్టి తీరిగ్గా వుత్తరం చదివింది.

"కుమారి స్వర్ణలత గారికి,

నమస్తే! మీరు వ్రాసిన జాబు అందింది. మీరు అందాన్ని నిర్వచించమంటున్నారు. అదెలాగో నాకర్థం కావటంలేదు. మన తెలుగు పుస్తకాలన్నింటిలోనూ ఆడదాని అందంగురించి కనీసం అరడజను పేజీల వర్ణనైనా వుంటుంది.

పోనీయండి! మీరా పుస్తకాలన్నీ తిరగేసి శ్రమపడ నక్కరలేదు. నాకే జ్ఞాపకం వున్నంతవరకు అందాన్ని మాటలలో వివరించటానికి ప్రయత్నిస్తాను.

చంద్ర బింబంలాంటి ముఖం, కలువరేకుల్లాంటి కళ్ళు, సంపంగిలాంటి ముక్కు, దొండపండులాంటి అధరం, తామరతూడులాంటి చేతులు, గడ్డంక్రింద చిన్న గుంట, లొత్తలుపడే బుగ్గలు, త్రాచుపాములాంటి నల్లని పొడవైన జడ, వీటన్నింటికీ తోడు మంచి ఛాయ- ఇవన్నీ మీకు వున్నాయనుకుంటే జవాబు వ్రాయండి.

భాస్కర్"

* * *

"శ్రీ భాస్కర్ గారికి,

నమస్తే! మీ వుత్తరం అంది సంగతులు తెలిశాయి. ఆశ్చర్యం! సరిగ్గా మీరే మేమైతే వర్ణించారో అచ్చంగా అవన్నీ నాకు సరిపోయాయి. నన్ను చూసినట్టుగా వర్ణించేశారు.

ఇకపోతే మీ విషయం నేను తెలుసుకోవాల్సి వుంది. మీ అందచందాలు, ఆస్తిపాస్తులు, చదువు వుద్యోగహోదాలు వివరంగా వ్రాయండి.

స్వర్ణ"

* * *

"స్వర్ణ గారికి,

మీ వుత్తరం అందుకున్నాను. చాలా సంతోషం! ఇక చదువువిషయం, ఎమ్. ఏ. ఎఫ్. ఆర్. సి. ఎమ్. ఎస్. (లండన్) చదివాను. ప్రస్తుతం ఇక్కడ అమెరికన్ సంస్థలో మేనేజరుగా వుంటున్నాను.

మా అమ్మా, నాన్నకి నేనొక్కడినే సంతానం. అందుచేత ఏ మాత్రం ఆస్తివున్నా దక్కేదంతా మనకే! ఇంక రంగు సంగతంటారా, మరీ నలుపు కాదు, చామన ఛాయ! వున్నమాట చెప్పొద్దూ, చూసినవాళ్ళంతా అందగాడిననే అంటారు.

ఇంకా ఏమైనా సందేహాలుంటే చెప్పండి.

భాస్కర్."

* * *

"భాస్కర్ గారికి,

మీరు వ్రాసిన సంగతులు తెలుసుకుని సంతోషించాను. ఆస్తిపాసులగురించి నాకేమంత పట్టుదలలేదు లెండి. చామన ఛాయని వ్రాశారు! ఫరవాలేదులెండి, దానికేం చేస్తాం. దేవుడిచ్చిన రంగు! అయినా సాధారణంగా అందమైన వాళ్ళంతా నల్లగానే వుంటారులెండి!

ఎటొచ్చీ మీ చదువుగురించి మాత్రం నాకేమీ తెలియలేదు. ఎం. ఏ. వరకూ అర్థం అయ్యింది లెండి కాని ఆ 'లండన్' డిగ్రీ అర్థం ఏమిటో తెలియలేదు. వివరంగా అడుగుతున్నందుకు క్షమించండి. తెలియనప్పుడు స్పష్టంగా అడిగి తెలుసుకోవటం మంచిది కాదంటారా? త్వరలో జవాబు వ్రాయండి.

స్వర్ణ."

* * *

"స్వర్ణ గారికి,

అమ్మయ్య! ఇప్పటికి నా గుండెలు కుదుటపడ్డాయనుకోండి! ఛాయ తక్కువనేసరికి మీరు నన్ను మరోలా వూహించుకుంటారేమోనని ఎంత భయపడ్డానని!

F.R.M.C.S. అంటే ఫెలో ఆఫ్ రిసెర్చి ఇన్ మేథమెటిక్స్, సివిక్స్ అండ్ సైన్స్. ఈ విషయం మీకు తెలియదంటే నాకెంతైనా ఆశ్చర్యం వేస్తున్నది సుమండీ.

మీ చదువు, వయస్సు మొదలైన వివరాల కోసం ఎదురుచూస్తుంటాను.

భాస్కర్."

* * *

"భాస్కర్ గారికి,

మీ ఫారిన్ డిగ్రీగురించి వివరంగా వ్రాశారు ఇప్పటికి అర్థం అయ్యింది. నిజం

(63-వ పేజీ చూడండి)

# తెలుగు వెలుగులు



శ్రీ ద్వారం వేంకటస్వామినాయుడు గారు బహు చిన్నవయస్సులోనే, విశాఖపట్టణమున, కవిగారైన, మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారు కోరగా సభలో ఫిడేలువాయించారట బహు శ్రావ్యంగా. కవిగారు తమ ఆనందాన్ని వెలిబుచ్చేందుకు, ఒక బంగారు ఉంగరాన్ని ఆయనచేతి నుంచుతూ, ఫిడేలు నాయుడని నామకరణం చేశారట. ఆ మహానుడు ఏ ముహూర్తమున ఫిడేలు నాయుడని నామకరణంచేసి, చేతిని ఉంగరాన్నుంచాడో, శ్రీ నాయుడు గారు, తదుపరి, వజ్రపుటుంగరాలను బహుమతిగా బడసినా ఈనాటికీ ఆయన అంగుళీకిసలయాన్ని కవిగారి ఉంగరమే తొంగిచూస్తూంది.

విజయనగరములో కాలుపెట్టిన ప్రతి దాక్షిణాత్యుడు జట్కావాలాను పిలిచి "ఫిడేలునాయుడుగారింటికి పోద్దుబ్బా" అంటాడు.

ప్రతి ప్రత్యూషాన, సాయంసమయాన శ్రీ నాయుడుగారు గానపాఠశాలకు పోయే దారిలో, వీధుల్లో ఆడుకుంటున్న పిల్లలు, ఆయన్ని చూచి. ఆట నిలిపి, ఆశ్చర్యము సూచించే నయనదీప్తులతో, ఒకరిచొక్కాయింకొకరులాగుతూ "ఫిడేలు నాయుడుగా" రంటారు.

పౌరణనుండి ఘోషాస్త్రీలు, అవకుంఠనాలు సడలిస్తూ, "జహాదజహాలజ్జాసంగ్రహ దృగ్జాలముల" వీక్షిస్తూ, "ఫిడేలు నాయుడు గారు బడికి పోతున్నారు" అని అనుమందరములో ఉచ్చరిస్తారు.

ఫిడేలునాయుడన్న పదమే వేంకటస్వామిని తోసిరాజంది.

స్వతంత్రవాద్యమునందు శ్రీ నాయుడు గారు గోవిందస్వామి వారసుడు. ఫిడేలు తీగలతోపాటు, శ్రోతల హృదయాలను కూడా నొక్కుతాడు. మెత్తగా హాయిగా అమృతమును దోసిళ్ళతో అందించి ఆనంద సముద్రములో సొక్కచేస్తాడు. కమానుతో వజ్రాలను కోయగలడు. రాగము వాయిస్తే, ముగ్ధలు ప్రౌఢలవుతారు. హంతకుడు పశ్చాత్తాపపడతాడు. నాస్తికుడు ఆస్తికుడవుతాడు. లోభికి దాతృత్వవాంఛ పొడసూపుతుంది. చంటిపిల్లలు ఏడ్పు మాని నవ్వుతూ ఆడుకుంటారు.

ప్రక్కవాయిద్యమునందు శ్రీ నాయుడు గారు, దాక్షిణాత్య సంగీత విద్వాంసులకు చేదోడు వాదోడు. మృదంగవాద్యమునందు హిమాలయ శిఖరంలాంటివాడు, కీర్తిశేషుడు దక్షిణామూర్తిపిళ్ళై, రణ పెంకి; ఎంత విద్వాంసుణ్ణి, తృణప్రాయముగా చూసేవాడు. ఎప్పుడు శ్రీ నాయుడు గారు తన కంటబడినా, ఘుర్ఘాఘోష సందేశాలను పంపే అతని వామహస్తముతో పెసరకాయలాంటి శ్రీ నాయుడుగారి వ్రేళ్ళను బట్టి కనుల కద్దుకొనడం నే నెరుగుదును. దాక్షిణాత్యవిద్వాంసులతో, తరచు ప్రక్కవాద్యం వాయించిన ఆంధ్రుడితడొక్కడేనని సగర్వముగా చెప్పగలను.

శ్రీ నాయుడుగారు పల్లవి భీమసేనుడు, స్వరకల్పనాపార్థుడు, కీర్తిశేషుడు, నైనా పిళ్ళైకు వేడుకచెలికాడు. రామానుజయ్యం

# కథ కాని కథ

## ఏ ఎండ కాగొడుగు

(మొదటి బహుమతి రూ. 10/-)

సామాన్యంగా మనం ఏ విషయాన్నైనా తెలుసుకోవాలంటే దానితో ఎక్కువ పరిచయం వున్నవాళ్ల సలహా పాటిస్తాం. మా యూనివర్సిటీ హాస్టల్సుకు, రోజూ ఒక పాలిష్ కుర్రాడు వస్తాడు. మనం పాలిష్ డబ్బాఇచ్చి పాలిష్ చేయమంటే అణా తీసుకుంటాడు. పాలిష్ వాడిదేఅయితే బేడ తీసుకుంటాడు. ఒకరోజు పాలిష్ వేసుకోవటానికి ఉద్దేశించి వాణ్ణి పిలిచాను. బూట్లు, "బాటా" పాలిష్ డబ్బా ఇచ్చి పాలిష్ వేయమన్నాను. వాడు డబ్బా తీసుకొని "బాటా అంతమంచిదికాదండి. బూట్లు నల్లబడి పోతాయి. నాదగ్గర "చెర్రీబ్లాజమ్" వుంది. అదివేస్తే బాగా పాలిష్ వస్తుంది" అన్నాడు. 'కాబోలు' అనుకొని "సరే నీపాలిషే వెయ్యి" అన్నాను. వాడు పాలిష్ వేసి రెండుఅణాలు వసూలు చేసుకొని వెళ్తూ "బాటా డబ్బా నాకిచ్చేయండి బాబూ" అన్నాడు. ఎటూ "చెర్రీబ్లాజమ్" కొందాంగదా అని డబ్బా వాడికిచ్చేశాను.

సెలవులువచ్చాయి. మళ్ళీ తిరిగివచ్చినతరువాత రూము మారాను. మళ్ళీ ఒక రోజున వాడి గొంతుకవిని పిలిచాను. బూట్లు 'చెర్రీ బ్లాజమ్" పాలిష్ డబ్బా వాడిముందుంచాను. వాడు నన్ను గుర్తుపట్టలేదు. మెల్లగా నసిగాడు "బాబూ, చెర్రీబ్లాజమ్ అంతబాగా షైనింగ్ రాదండి, బాటా చాలమంచిదండీ" అంటూ బాటా డబ్బా పైకి తీశాడు. దాని మీద నాపేరు స్పష్టంగా కనిపిస్తోంది. నాకు నవ్వాలో ఏడవాలో అర్థంకాలేదు. "ఏ ఎండ కాగొడుగు" అన్నసామెత లీలగా జ్ఞప్తికి వచ్చింది.

వి. కాంతాప్రసాదు, వాల్తేరు.

* * *

## చిన్ననాటి సంఘటన

[రెండవ బహుమతి రూ 5/-]

అప్పుడునాకు ఏడేళ్లుంటాయి. నేను నాల్గవ క్లాసు చదువుతున్నాను. నాకు. మా చెల్లెలికి ఇంకా ఐదారుగురు పిల్లలకు ఒక ముసలి మేష్టారు ప్రైవేటు చెప్పేవారు. ఒక రోజున ఆయన కృష్ణలీలలు కథలుగా చెప్తూ 'శ్రీకృష్ణుడు అరవై వేలమంది గోపికాస్త్రీలను పెళ్లాడాడ్రా' అని చెప్పి ఇంకా ఏదో చెప్తూంటే మేం వెంటనే ఫక్కున నవ్వడం మొదలెట్టాము. అప్పుడు మా మేష్టారు "ఎందుకురా అంత నవ్వుతున్నారు?" అని అడిగారు. అప్పుడు నేను అందరిలోకి పెద్దదాన్నవడం చేత "మాష్టారూ! ఒక్క కృష్ణుడు అరవై వేలమంది గోపికాస్త్రీలను పెళ్ళాడాడంటున్నారు కదా! అంతమంది ఒక్క పల్లకీలో ఎట్లా పట్టారండి?" అని అడిగాను. అది విని మేష్టారు కూడ పకపక నవ్వి ఓసి వెర్రిదానా! అరవై వేల మంది అరవై వేల పల్లకీలలో కూర్చున్నారే!" అని చెప్పారు. ఈ సంగతి మావాళ్ళు ఇప్పటికీ చెప్పుకుని నవ్వుకుంటూ ఉంటారు.

వి. కామేశ్వరీ దేవి, రాజోలు.

* * *

## అట్లు అడిగినాయన

[రెండవ బహుమతి రూ. 5/-]

మా అక్కయ్యావాళ్ళు, వాళ్ళ స్నేహితురాలింటికి పెళ్ళికి వెళ్లారు. పెళ్లికొడుకు పుస్తె మెడకేసేసమయానికి అతని స్నేహితులెవరో "జాగ్రత్తరోయ్! చేతిలో అట్లకాడ ఉందేమో! నీపుమీద వాతవేయగలదు," అని అంటున్నారు. నాకేమీ అర్థంగాక "ఏమిటక్కయ్యా! అని అడిగేను. అక్కయ్య వాళ్ళ స్నేహితురాల్ని అడిగితే నవ్వి, ఇలా చెప్పింది:

"మా మావగారిఊరుకి ఒకసారి మేమంతా వెళ్లాము. అవి వేసవికాలపు రోజులు కావడము మూలాన వాళ్ళతోటలో సాయంకాలంపూట ఆడుకునేవాళ్లము. ఒకరోజున మేమందరము వనభోజనమని తోటలో ఒక చెట్టుక్రింద అట్లు పోస్తున్నాము. ఆతోటకి కాస్త దూరములో ఒక మేడవుంది. అక్కడ సెలవులకని కొందరు విద్యార్థులు విహారార్థము వచ్చారు. వారా వాడు నేను అట్లు పోయడము మేడమీంచి చూసి "ఓరేయ్! అట్లు మనకు రెండిస్తే బాగుండునురా!" అని అన్నాడు. దాంతో నాకు కోపమువచ్చి "క్రిందకి దిగిరండి! వీపుమీద వాలుకవేస్తా," నన్నాను. దాంతో వారు హడలెత్తి పారిపోయారు. అందులో ఒకతను నన్ను అట్లు ఇమ్మని అడిగినతను. ఇప్పుడతనే నాకు......" అని చెప్పి సిగ్గుతో తలవంచుకుంది.

ఇదివిని అందరూ ఆశ్చర్యముతో ఆమెవేపు చూశారు. నేను అప్పటినుండి ఈ సంఘటన మరువలేను.

గురుజాడ దుర్గాప్రసాదరావు,
విజయనగరం.

* * *

## తెలుగు వెలుగులు

గారి పాట జిగికి గీటురాయి. 'చెంబై' కలకంఠ గానశోభకు ప్రాభృత పయోధరము. 'ముసిరి' గాత్రంపు కొసరుల కసటు గడుగు సంగీతసారఘుసారపారిణి.

మూడు పుష్కరాలకు పైగా విజయనగరంలో సంగీతకళాశాలకు సారథియై, వడిపించి, నరసింగరావు నాయుడు, మారెళ్ళ కేశవరావు; స్త్రీలలో కుమారి మంగతాయారు లాంటి ఎంతోమంది ఉత్తమ శిష్యకోటిని తయారుచేశారు.

భారతావనికి స్వాతంత్ర్యం వచ్చాక, రాష్ట్రపతి భవనములో తన సంగీతముచే మొగల్ ఉద్యానవనాలనే పుష్పింపచేసి రాష్ట్రపతిచే యావద్భారతానికి తంత్రీ వాద్యమునందు నీకు నీవేసాటి అని బిరుదుపట్టా, సన్మానం పొందేరు.

పృథ్వి అంతటికి మేటయని వయొలిన్ వాద్యములో కీర్తి నార్జించుకున్న అమెరికన్ సంగీత విద్వాంసుడు మెనూహిన్, శ్రీ నాయుడుగారి సంగీతము విని "అద్భుతము" అని అన్నాడు.

నేడు వానప్రస్థాశ్రమము స్వీకరించి, చెన్నపట్నాన్ని విడిదిగా చేసుకొని తన గానమాధుర్యముచే సముద్రపుగాలికి చల్లదనాన్ని ప్రసాదిస్తున్న "సంగీత రత్నాకరుడు!"

నాయుడు గారూ!
మీ శరీర మాకాశం!
మీ హస్తం హరివిల్లు!
చిత్రవిచిత్ర వర్ణాలు
శ్రీవారి శ్రేణ్ఫు!

—శ్రీ రంగం నారాయణబాబు ★

# శరత్ చెప్పిన కథలు

తెనిగింపు: సాంబశివరావ్, బొబ్జి



## పెళ్ళి సందడి

యమున' పత్రికా కార్యాలయం అది. ప్రతిరోజులాగే ఆవేళ సాయంకాలం కూడా చాలామంది సమావేశమయ్యారు. 'యమున' పత్రికా సంచాలకుడూ, శ్రేయోభిలాషులూ చాలామంది వున్నారు. శరచ్చంద్రుడు కూడా వొచ్చాడు. రకరకాల కాలక్షేపం కబుర్లెన్నో మాట్లాడుకుంటున్నారు. అంతలో సురేంద్ర మోహనముఖోపాధ్యాయుడు తనేదో వూళ్లో పెళ్లిసంబంధం కుదిర్చి ఆ వూరికి తర్లి వెళ్ళినప్పుడు పడ్డ అగచాట్లు గురించిన కథ చెప్పాడు. ఆయన చెప్పినకథ ఆలకించి శరచ్చంద్రుడిలా అన్నాడు:—

"ఓస్ – ఇంతేనా? – ఇదేమంత ఘనకార్యంలెండి. నేనో పెళ్ళిసందర్భంలో పడ్డ పాట్లు చెప్తా, వినండి:—

ఆరోజుల్లో చాలనాళ్లుగా కలకత్తాలోని 'మెస్'లో వుంటున్నా. అక్కడ నాసరి వుజ్జీగాళ్లు చాలామందున్నారు. వాళ్ళకీ నాకూ కత్తు బాగా లిసింది. అంతా ప్రాణస్నేహితులమైపోయాం. వాళ్ళలో ఒకరిల్లేమో 'బారాసాత్'లో వుంది. అతగాడు తన పెళ్ళికి మా అందర్నీ పురమాయించాడు. పెళ్ళి పెద్దలమై వూరేగింపులో ముందు నిలబడాలన్నమాట. పెళ్ళికూతురు గలవాళ్లేమో శ్రీరాంపురంలో వున్నారు. పెళ్ళికొడుకుతోబాటు బారాసాత్ నించి శ్రీరాంపురానికెళ్లడం మావల్లనయేపనికాదుగా మరి! అందుకని ఎవరిపనులు వాళ్ళు ముగించుకుని రైలెక్కి తిన్నగా శ్రీరామపురంస్టేషను చేరుకోవాలనుకున్నాం. మా నేస్తగాడు మా అయిదుగురికీ ఇంటర్ క్లాసు రిటర్న్ టిక్కెట్లు ముందే కొనిచ్చి రెణ్ణాళ్లకిందటే యింటికెళ్ళిపోయాడు. వెళ్లేముందు గులాబీరంగు శుభలేఖకూడా ఒకటిచ్చి, యిలా అయినా సరే తనపెళ్ళికి తప్పకుండా రావాలని మరీమరీ కోరి చెప్పాడు.

పెళ్ళినాడు పనిపాట్లన్నీ కాస్త పెందలాడే ముగించుకుని ఇంకా సాయంత్రం కాకముందే బయటపడ్డాను.

రైలెక్కి శ్రీరాంపురం స్టేషను చేరుకునేప్పటికప్పుడే బాగా చీకటిపడింది. టికెట్ కలెక్టరుకి అరటిక్కెట్లిచ్చి స్టేషన్నుంచి బయటపడ్డాం. శ్రీరాంపురమయితే వొచ్చేంగానీ ఎక్కడికెళ్ళటం? పెళ్ళికొడుకిచ్చిన గులాబీరంగు శుభలేఖ మాలో యెవ్వరూ తీసుకురాలేదాయను! అంతా మరిచిపోయారు. ఆఖరికా పెళ్ళికూతురు తండ్రిపేరేవిటోకూడా యెవ్వరికీ యాదాస్తులేదు. అప్పుడిహ మా గతెలావుంటుందో మీరే ఆలోచించండి.

అయినా యేం చెయ్యగలం? ఏదో కాస్త గుండె తమాయించుకున్నాం. పెళ్ళంటే వూళ్ళో అందరిళ్లలోనూ జరగదుగదా! అందుకని అలా దారింట వెళ్తూంటే, ఏయింటి గడపముందు పెళ్ళిపందిరీ, తోరణాలూ, కూర్గాలా కనిపిస్తే, అక్కడడిగి తెలుసుకోవొచ్చునని అందరం తీర్మానించుకుని అక్కణ్ణుంచి కాళ్ళీడ్చుకుంటూ బయల్దేరాం. అలా వూళ్ళోవుండే రాదార్లన్నీ కాలుగాలిన పిల్లిలా తిరిగి గాలించాం గాని పెళ్ళివారిల్లొక్కటీ అవుపించలేదు. ఛీ, శ్రీరాంపురంలో వుండే తల్లిదండ్రులు ఎంత నిర్దయులు! కూతురుపెళ్ళికి పందిరి సైతం వెయ్యకుండా పెళ్ళిచేసెయ్యాలనుకున్నారు గామోసని, ఓమూల వాళ్లని తిట్టుకున్నాం.

మాకేం పాలుపోక యెక్కడికెళ్తున్నామో తెలీకుండా తిరుగుతున్నాం. అంతలో చటుక్కున యేదో సందులోంచి పెళ్ళి బాజాలు వినిపించాయి. దాంతో ఎండకెండిన ఆకులకి మళ్లీ వాడిపోయిన మా గుండెల్లో తొలకరి చిలకరించినట్టయింది. ప్రాణాలు గభాల్న లేచివచ్చాయి. శబాష్. అదే ఆడపిల్లగలవాళ్ల యిల్లయివుంటుందనుకుని, మేమంతా ఆ యిల్లు వెతుక్కుంటూ బయల్దేరాం. ఆఖరికా యింటికెళ్ళి చూశాం. ముందువాలో చాలామంది జనం వున్నారు. వరుడికోసం మాంచి విలువైన ముఖమల్ దిండ్లు గలిగిన సోఫా వేశారు. కాని వరుడి జాడమాత్రం తెలీలేదు. పెళ్ళిలగ్నం సాయంత్రం తర్వాతేమో మరి!–అందుకే పెళ్ళికొడుకెక్కడో లోపలే వున్నట్టుందనుకున్నాం.

ఇంట్లోపల చూస్తే జనం కిటకిట్లాడిపోతున్నారు. ఎవరొచ్చారో, ఎవరుపోతున్నారో యెవ్వరూ పట్టించుకోవటంలేదు. మమ్మల్ని కూడా అలానే యెవ్వరూ పరామర్శ చెయ్యలేదు. అక్కడున్నవాళ్లని మాత్రం మాకేం తెలుసు, పెళ్ళికొడుకయితే యిట్టే పట్టేయగలం గాని; అయినా పరామర్శచేసి గౌరవించాల్సిన అవసరమేవిటుంది గనక! మేం పెళ్ళికొడుకు తరఫునుంచి వొచ్చిన పెద్దమనుషులం. కాబట్టి విందు భోజనాలవీ దండిగా జరిగాయి. సుష్టుగా పీకలమొయ్యా భోంచేసి 'త్రేవ్' మంటూ లేచి పెళ్ళిపందిట్లో ఓవారని ఆయాసంగా జారగిలబడ్డాం. కాస్సేపయాక యెవరో అబ్బాయి పెళ్ళికొడుకు నాశీర్వదిస్తూ రాసిన పద్యరత్నాల పేపర్లు పంచిపెడ్తూ మాకూ ఒక్కొక్క టందించిపోయాడు. అందులో పద్యరత్నాలు చదివేసరికి మా పంచప్రాణాలూ పట్టుమని యెగిరిపోయాయి. అసలా పెళ్ళికొడుకు పేరు 'పాల్.' మావాడి పేరేమో చక్రవర్తి. అంటే నాటికి నాటయిరవై పాళ్లు శుద్ధ శ్రోత్రియ బ్రాహ్మలన్నమాట. ఇది తెలిసికూడా యిహ అక్కడెలా సిగ్గులేక కూచుంటాం. అందరికళ్లూ కప్పి యెలాగో అక్కణ్ణుంచి నింపాదిగా జారుకుని బయటపడ్డాం.

కన్నుచించుకున్నా కనిపించని కాటుకలాంటి చీకటి – మా మనసులు విచారంతో మరీ చీకటయాయి. దార్లో కనబడ్డవాళ్ళందర్నీ, "అయ్యా, ఇక్కడెక్కడయినా బ్రాహ్మల పెళ్ళవుతూందా? కాస్త చెప్పండీ, మీకు పుణ్యముంటుంది" అంటూ అడగడం మొదలెట్టాం. ఇది విని కొంతమంది విసుక్కుని ఈసడించుకుంటూ పోయేవాళ్లు. మరి కొంతమంది మమ్మల్ని చూసి కేళోళంగా నవ్వుకుంటూ పోయేవాళ్ళు. ఇంకా కొంతమంది మా వేపు యేదో అనుమానంగా చూసేవాళ్లు. అలాంటప్పుడిహ మా అవస్థ యేంటని చెప్పాలి. ఎవర్నడిగినా చెప్తేగా!

ఆఖరికో పుణ్యాత్ముడికి మామీద జాలికలిగింది. మా వ్యవహారమంతా చూసి,

# ★ పెళ్ళి సందడి ★

"ఇంతకూ పెళ్ళికొడుకువాళ్ళు తర్లి వొచ్చారంటున్నారే! ఏవూర్నుంచి వొచ్చారు?" అని అడిగాడు.

"వారాణాశ్ నుంచి" అన్నాం ఆత్రుతగా.

అతగాడు అరగంటసేపాలోచించి అటూ యిటూ తిప్పి మాకోయింటి ఎడ్రసిచ్చాడు. అతగాడిచ్చిన ఖోగట్టా చూస్తే యీ పెళ్ళిసంగతి తెలిసే వుంటుందనుకున్నాం. సరేనంటే సరేనని అతగాడు చెప్పినప్రకారం యెన్నో సందులూ, గొందులూ తిరిగి తిరిగి మొహాలన్నీ సొమ్మసిల్లి సోలిపోయేవేళకో పెళ్ళియిల్లు చేరుకున్నాం. మళ్ళా యెక్కడ పొరపాటు పడ్డామో అనుకుని ముందుగా ఆ యింట్లో వాళ్ళనడిగాం. అడిగితే పెళ్ళికొడుకు పేరు చక్రవర్తేనని తెలిసింది.

ఇహానేం! మువ్మూర్తులా మనవాడే; కష్టపడి కాళ్ళరిగిపోయేట్టు తిరిగినా ఆఖరికి అసలు గమ్యానికే చేరుకొన్నామన్న సంతృప్తి కలిగింది మాకు.

ఆ పెళ్ళింటిముందు పెద్ద మండువావుంది. రోడ్డుదాటుకుని ఆ లోపలికెళ్ళాలి. మండువాలో జనం చాలామందున్నారు. మరి పెళ్ళంటే మాటలా పాపం!—నాలుగురకాల వాళ్ళూ నాలుగుపేటల్నుంచీ చేర్తారాయెను. అందుకని గోలా, గుంపూ తప్పదు మరి!

అయినా న్యాయంబట్టిచూస్తే పెళ్ళిపందిట్లోనే జనం సందడి వుండాల్సింది. కానీ అసలక్కడెవరూ లేరు. అప్పుడే అంతా ఖాళీ అయిపోయినట్టనిపించింది. అదిచూసి మాకేం పాలుపోలేదు. లోపలచూస్తే యేదో హైరానా పడుతున్నారు. ఒహారిద్దర్ని అడిగా లగ్గానికిముందేమో కట్నంవిషయంలో పెళ్ళికొడుకువాళ్ళూ, పెళ్ళికూతురువాళ్ళూ కమామీషుపడి, మాటలేవో మిగలజెప్పుకుని పెద్ద వీరాంగం జరుపుకున్నారట! పెళ్ళికూతురికి చేసిన రవ్వలపట్టెడలో అరతులం బంగారం కొరతగావుందని వరుడితరఫువాళ్ళు వంకలుపెట్టి బంగారాంటి పెళ్ళిని రసాభాస చేశారట! వరుడితండ్రేమో వరుణ్ణి పెళ్ళిపీటలమీంచి బరబరా లాక్కెళ్ళిపోయాట్ట! కొంతసేపెలాగయితేనేం ఆ యిరుగు పొరుగునున్న పెద్దమనుషులంతాచేరి యిద్దరిమధ్యనూ రాజీకుదిర్చారట. ఆ రాత్రికి రాత్రి, ఏమైనాసరే కొరతబంగారాన్నలాగో భర్తీచేసేందుకు పెళ్ళికూతురుగలవాళ్ళు వరుడికి రెండొందల యాభైరూపాయిలిచ్చేందుకొప్పించారట. పిల్లతాలూకు మేనమామ నగలు తాకట్టుపెట్టి నగదు తీసుకొచ్చేందుకప్పుడే వెళ్ళాట్టకూడాను; ఇక్కడచూస్తే ముహూర్తం ముంచుకొస్తోంది. అదికాస్తా దాటిపోయిందంటే యినంతా వృథాయేగా! అందుకని పెళ్ళితతంగం యథావిధిగా ఆరంభమయింది.

అయినాకాని, తరలివచ్చిన పెళ్ళికొడుకు తాలూకువాళ్ళు బుద్ధిబద్ధంలేకుండా చేసిన ఈ అఘాయిత్యపు పనికి, మా అందరికీ మహా చిర్రెత్తుకొచ్చింది సుమండీ! అది జరిగినప్పుడుగాని మేంవుండుంటే వాళ్ళనేం చేసేవాళ్ళమో! అయినా ఈకయ్యం కాస్తా చల్లారిపోయిందిగా! అందుకని యీ సమయంలో తవ్వాయిలు పెట్టుకోడం తగు మనుషులపని కాదని నోరుమూసుకుని వూరుకున్నాం.

చెప్పుజోళ్లుతీసి బయటపెట్టి పెళ్లి విడిదింట్లో ఓమూలకెళ్లి కూచున్నాం. వూరంతా తిరిగి తిరిగి కాళ్ళు కొళ్లయిపోయాయి. తిప్పటమూలాన బాగా అలసిపోయివున్నాం. దానికితోడు ఆకలితో కడుపులో పేవులన్నీ పెళ్లివీర్ణాలకు మళ్లే ఫెళఫెళధ్వనులు చేస్తున్నాయి.

లోపల పెళ్లి మండపంలో ఏకనాదంగా శంఖంవూదటం మొదలెట్టారు. కాస్సేపటికది ఆగిపోయింది. వీర్ణాలమోతకూడా ఆగిపోయింది. లగ్గం దాటిపోకుండా పెళ్లయిపోయిందేమో ననుకున్నాం. అంతలో లోపల్నుంచి పెళ్లికొడుకుతాలూకు వాళ్లలో నలుగురైదుగురు పెద్దలు గబగబా బయటకొచ్చారు. వాళ్ళమొహాలుచూస్తే బాగా మాగిపోయిన క్రపెండలం దుంపల్లా వున్నాయి. వాళ్ళు కాస్త నోటిధాటీగల వాళ్ళేమో! ఎదటివాళ్లని సుళువుగా తిటడంలో ప్రాక్టీసు జాస్తీలావుంది. వాళ్లంతా పెళ్ళికూతురు తరఫు పెద్దమనిషా కాయనపై అమ్మలక్కల్లా అమాంతంగా విరుచుకుపడి "హిం-ఏం బతుకయ్యామీది. మా విస్తళ్ల దగ్గర రోజా మేం పారేసే ఎంగిలిమెతుకులపాటి విలువలేదు మీకు. ఏం యిప్పటికైనా ఆ సొమ్ము ముట్టజెప్తారా, లేదా?" అంటూ హుంకరించి మరీ అడిగారు.

ఆ వెర్రి ముండావాడు పాపం ప్రాణాలు బిగబట్టుకుని "అయ్యా, తొందరపడకండి. మీ డబ్బెక్కడికీ పోతుంది. తలతాకట్టు పెట్టయినా అణాపైసాల్తో యిచ్చేస్తాం. పిల్లతాలూకు మామయ్య అందుకే తిరుగుతున్నాడు. ఈపాటి కప్పుడే వొచ్చేస్తూనే వుంటాడు. కోపగించకుండా కూచోండి. భోజనాలవీ వొడ్డిం చేశారు కూడాను" అంటూ అపశంగా చరచరా

# పెళ్ళిసందడి

యింట్లో కెళ్ళిపోయాడు.

భోజనాలవీ వడ్డించేశారన్న మాట మాకా సమయంలో వరాల మూటలా అనిపించింది. అంటే అంత ఆకలితో అవురావురు మంటున్నాం. ఇంట్లో కెళ్లిన ఆ మహానుభావుడు ఎంత వెంటట బయటికొచ్చి మమ్మల్నందర్నీ మళ్ళీ ఆహ్వానిసాడా అని వెయ్యి కళ్ళు పెట్టుకుని ఎదురు చూసుకుంటూ వున్నాం.

కాని యిలా అనుకున్నంతలోనే వాంప పాడుపడింది. గబుక్కున యింట్లోనుంచి వురుములురుముతున్నట్టు పెద్ద పెద్ద అరుపులు వినిపించాయి. కాస్సేపటికి కా వురుములు కాస్తా మారి, పిడుగులు పడ్తున్నట్టు కూడా అనిపించింది.

"తింటార్రా, ఎందుకు తినరూ! ఎంగిలాకులు నాకిన మొహాల్లారా తింటారు. మీ బడాయి తంపవెయ్యా. మాకు తేరని బతుకా మీది. పైని పటారం-లోన లొటారం. పుస్తె కాస్తా ముడిచేశారు. కనక పెళ్ళికొడుకు యీ క్షణంనుంచి మా వాడు. ఇహ తిందురు గాని రండి. ఇప్పుడే మీ వొళ్ళు చిత్రికపట్టి చీరేస్తాం. మీనోళ్లు విడగొట్టి దవడలు రెండూ దబాయించి, తాటకమ్మలు చీరినట్టు చీరేస్తాం, నోళ్ళు వెలక్కాయ నొక్కినట్టు నొక్కేస్తాం. వుండండి. ఒరేయ్ వారీస్, కన్నయ్యా, నవీన్, గింటూ, ఇలా రండ్రా, వీళ్ళబడా యేపాటో చూసేద్దాం. పెరట్లో బాణాకర్రలున్నాయ్. పట్టుకొచ్చి ఒక్కొక్కళ్ళ్నే కుళ్లబొడిచేయండి; దరిద్రగొట్టు పిండాలు. అప్పటిగ్గాని వీళ్ళకి డబ్బుజబ్బు వొదల్దు" అంటూ పెళ్ళికూతురు తరఫు పెద్దమనిషెవరో చమ్చు తెగేసి చెప్తున్నాడు.

ఈ హంగామా వినేసరికి మా గుండెలు రెండు చెక్కలైపోయాయి. మా ఆకలి యెక్కడిదక్కడే పటాపంచలైపోయింది. మొదట్లో మేం అదంతా వేళాకోళమేమో అనుకున్నాంగాని అంతలో నిజంగానే అయిదారుగురు మాంచి అచ్చోణీల్లాంటి మీసాల్దార్లు శాపాటి కర్రలు పట్టుకుని అక్కడ తయారయిపోయారు. పళ్ళికిలింపులూ, సకిలింపులూ, బూకరింపులూ, తలపంకింపులూ, గోండ్రింపులూ, ఖండ్రింపులూ రెండు పక్కల్నుంచీ వినిపించాయి. పూర్వ జన్మలో బాకీ వున్న తిట్లూ, చీవాట్లూ ఇరు పక్షాలవారూ అణా పైసాలతో సహా జమాలు చేసేసుకున్నారు. ఇంకేముంటి? ఏక చెండ్రుకోడం! ఏక యెద్దవా! ఆ తిట్లు విన్లేక మా చెవులు ఘుడులడిపోయాయంటే నమ్మండి. ఒహాటే రావణాగోల!

కనిపించిన కర్రలూ, కత్తిపీటలూ అన్నీ ఆ సమయంలో యుద్ధానికి ఆయుధాలుగా

బయటికి వొచ్చాయి. ఒకాయనేమో కర్రపీటని బొంగరంలా తిప్పేస్తున్నాడు. మరోవాడు గొంతుకి మిరపకాయ రాచుకున్నట్టు తిట్ల దస్తరం విప్పి తెగ తిడుతూ అరుస్తున్నాడు. ఇంకొకాయనేమో గొడుగువాళ్ళని పూరిపుచ్చుకుని ఒపాకాయల్లా లెంపకాయలు పేల్చేస్తున్నాడు. మరోవాడు పెళ్ళి పందిరి గడ కుంజ దొరక పుచ్చుకుని సాము గరిడీకి మల్లే అటూ, యిటూ చుట్టూ తిప్పి వూపేస్తున్నాడు. ఇదంతా చూసి మా గుండెలు పీచు పీచుమనడం మొదలెట్టాయి. వొళ్ళంతా కొయ్యబారిపోయింది. నోళ్ళు పిడచకట్టుకు పోయాయి. ఏం చెయ్యడం?-అక్కణ్ణుంచి మర్యాదగా కాళ్ళకు బుద్ధి చెప్పడం తప్పితే గత్యంతరం లేదు. గడియసేపు, అక్కడుండి పోయిన మా చెప్పు జోళ్ళకోసం అటూ యిటూ గాలించాం, గాని అంతలో ఆపిం జారీ కాడీలు మా వైపుకూడా పరుగెత్తుకొచ్చేస్తుండడం కనిపించింది. అది చూసి, అమ్మ రొయ్య, బతికుంటే అలాంటి వెన్ని జోళ్ళయినా కొనుక్కోవొచ్చునని, జోళ్ళమీద మమకారం వొదులుకుని అక్కణ్ణుంచి మేం అయిదుగురం ఎలాగో తప్పించుకుని ఆ పొలాలంబడీ పరుగు లంకించుకున్నాం. ఆ వెంట్రుకవాసి తప్పిందిగాని లేకపోతే ఆవేళ మా వొళ్ళు సైతం తప్పెట గుళ్ళయిపోయేవే!

పుట్టి బుద్ధెరిగిం తర్వాత యిలాంటి గందరగోళం ఎప్పుడూ జరగలేదు. ఇహ మా కా అర్ధరాత్రిగల్లు దారీ, తెన్నూ యేమీ అవుపించలేదు. కంకరరాళ్ళూ, గతకలూ-గోతులూ, కయ్యలూ, గట్లూ, దిబ్బలూ, రొంపీ, మట్టీ, మశానం, ఇంకేమీ చూసుకోలేదు. పైగా తీర్థయాత్రలకి బయల్దేరినవాళ్ళలా జోళ్ళొకటి లేవాయెను! అయినా యేం చేస్తాం? వెధవ కర్మం. ఓ వేపు కాళ్ళు రక్తాలు కారుస్తున్నాయి. ఎదో కాళ్ళకి తగిలి గబుక్కున ఆగి వెనక్కి తిరిగి చూశా. ఇంకా యెవడో త్రాష్ఠంగాను మమ్మల్ని వెంట తగులుకుంటూ వొస్తూనే వున్నాడు. అది చూసి మేం పరుగు మరి జోరెక్కించాం.

అలా ఒగర్చుకుంటూ, ఒగర్చుకుంటూ పరుగెత్తుకెళ్ళి గంగాతీరాని కెలాగయితేనేం చేరుకున్నాం. అప్పటికి గాని మాకా దిక్కుమాలినవాళ్ళపీడ వొదిలిందికాదు. అయినా మాలో యెవ్వరికీ నోరు పెగలట్లేదు. 'బ్రతుకు జీవుడా' అనుకుంటూ ఎవరిముట్టుకి వాళ్ళం కాళ్ళూ చేతులూ బారజాపి, అమాంతంగా యిసుకలో కూలబడిపోయాం. వొళ్ళంతా చెమట గంగాప్రవాహానికి మల్లే కారుతోంది. బొబ్బలెక్కిపోయిన మా కాళ్ళవేపు మళ్ళీ ఓ మారు చూసుకునేసరికి మా కెక్కడాలేని దుఃఖం వెల్లువకి వొచ్చింది. ఇహ ఆ కాళ్ళ నెలా వర్ణించాలో తెలీకుండా వుంది. శుభ్రంగా కోసుకుపోయాయి గీరుకుపోయాయి. ఒక్కొచోట రక్తాలుకారి గడ్డలుకట్టుకుపోయాయి కూడాను. ఇంతకన్నా ఆ పెళ్ళి

# పాండ్స్

## డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం వాడి

ప్రొద్దున్నుండే తాజాదనమును

రోజంతా పొందండి




స్నానముచేసిన తరువాత పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం పౌడరును రాసుకొంటే రోజంతా తాజాగా మరియు హాయిగా ఉండగలరు!

శీతలమైన సువాసనగల పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం పౌడరు ఎంతో మృదువుగా ఉంటుంది మరియు చెమటను పీలుస్తుంది. దీనిని రాసుకొని తాజాదనపు హాయిని రోజంతా అనుభవించండి'

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఏ.లో స్థాపించబడినది)

P. 7730

# పెళ్ళి సందడి ★

పందిట్లో మమ్మల్నెవరో రాలుకి కటిపడేసి కుళ్లబొడిచినా హాయిగా సయించి వూరుకునేవాళ్లం. అదే భావుణ్ణు.

ఆ పళాన్ని గంగానదిలోకి దిగి కొళ్ళు శుభ్రంగా కడుక్కున్నాం. మొహాలపైని కూడా కొంచినీళ్ళు చిలకరించుకున్నాం. అప్పటికిగాని మేం మాలోకి రాలేదంటే నమ్మండి. వొళ్లు కొంచ కుదుటపడింది. కాని మమ్మల్ని మరో కొత్తజబ్బు పట్టుకు పీడించడం మొదలెట్టింది. అదే పొత్తగోగమే. ఆకలిరోగం—ప్రాణాల్ని రక్షించుకునే నిమిత్తం యింతవరకూ దాన్ని సలే మరచిపోయాం. మళ్ళీ అదిప్పుడు మమ్మల్ని దొరకబుచ్చుకుంది. అయినా దాన్నని యేంలాభం చెప్పండి. ఈ రాత్రి జరిగిన హంగామా అంతా, యింతా కాదు. పైపెచ్చు సాయంత్రం నుంచి మేం చేసిన కవాతు తక్కువ తక్కువ కొదుగా! కొస కెలాగో మేం లేచి అక్కణ్ణుంచి నింపాదిగా బయల్దేరాం. ఆ రాత్రిగట్ల యే తలమాసిన వాడయినా కాఫీకొట్టు తెరుచుకుని వుంటాడా, ఏ గడ్డిఅయినా దొరక్కుండా పోతుందా అని ఆకలి తీర్చుకోడానికి అన్వేషణ ఆరంభించాం. అలా తిరుగుతూ, తిరుగుతూంటే ఆఖరి కెలాగో ఓ నక్కలాటి కాఫీకొట్టు తారసపడింది. కొత్తమే తీసేవుంది. కాని ఆ కొటుదాగు పేవో అప్పడే చాప పరచుకుని, దిండు వేసుకుని నడుం వాల్చేందుకు తయారు అవుతున్నాడు. గబుక్కున ఆకొట్లోదూరి,—"బాబ్బాబూ, నీపుణ్యముంటుంది అప్పడే పడుకోకు. కొట్లో తినేందుకేమయినా వున్నాయో లేదో చెప్పు" అంటూ ప్రతిమాలుకున్నాం ఆత్రుతగా.

అతగాడు వున్నాయని తెలూపాడు. సోమాసులూ, గులాబ్ జామూ, పూరీలూ!

"సరే అవే పదివేలు. మేం పంచపాండవుల్లా అయిదుగురం వున్నాం. తెంపూ తెరపాయీ లేని ఆకల్తో తెగ అవస్థ పడుతున్నాం. అవేవో కాస్త మా మొహాన పారెయ్యి" అన్నాం.

అంత అర్ధరాత్రిగట్ల మా అయిదుగురి కేసి చూసి ఆకొట్టువాడు వుబలాటంతో వుప్పొంగిపోయాడు. గభాల్న లోపలికెళ్లి కొళ్ళు కడుక్కోడానికి మాకు నీళ్ళు పట్టుకొచ్చాడు. తర్వాత బొడాసుల్లో తీపి తీపి టిఫిన్ మాకు నొడ్డించాడు.

కన్నుమూసి తెరిచేంతలో అతగాడు చేసిన వంటకాలన్నీ యిట్టే గారడీలా మాయంచేసి పారేశాం. కడుపునిండా నీళ్ళుతాగి, 'త్రేవ్' మని త్రేన్చి "ఎంతయిందిబిల్లు?" అంటూ అడిగాం.

ఆకొటు చిన్నదైనా, కొట్టువాడుమాత్రం లెక్కల్లో ఖలేగట్టివాడు. మూడునిమిషాల్లో ముమ్మారు వేళ్ళు లెక్కపెట్టి—"ఏడున్నరంది" అన్నాడు టకీమని.

ఈమాట వినేప్పటికి మా ప్రాణాలు పైకెగిరిపోయాయి. మా అందరి జేబుల్లో వున్నదే డబ్బులు తీసిచూస్తే ముచ్చటగా మూడు రూపాయిలకన్న యెక్కువలేదాయెను. ఏం చెయ్యాలం? ఆఖరికి నే ఆకొట్టువాడి చేతిలో పెడ్తూ, "చూడుబాబూ, మమ్మల్ని కొట్టుతిట్టు ఏమయినా చేసుకో గాని మాదగ్గర ఇంతకన్న మూడుకోటీలు కూడా లేవు" అని తెగేసిచెప్పాం.

మూడు రూపాయలు చూసేప్పటి. కొటుకొట్టుదారు కళ్లు వెలవెలా పోయాయి. మనిషి నిలువునా రాతిబొమ్మకిమల్లే నిర్ఘాంతపడి నుంచున్నాడు.

"ఏంచెయ్యం బాబూ. మా ఖర్మ యిలా యేడ్చింది. మేకల్లాంటి మాకిన్ని తిప్పలొచ్చి పడ్డాయి. ఏదో మావాడి పెళ్ళంటే కలకత్తా నించి కొళ్లకి బలపాలుకట్టుకుని యీవూరికి తగలడ్డాం. ఇంతకూ ఆ పెళ్ళింట్లో పిడికెడన్నంకూడా పెట్టలేదు గాని దుడ్డుకర్రలు పట్టుకు తరిమిగిలేశారు. అక్కణ్ణుంచి పరుగెత్తుకొచ్చి ప్రాణాలతో బయటపడేసరికి నా తాతలు దిగొచ్చారు. ఇలాంటి ఆపద సమయంలో నీ మిఠాయిలు మా ప్రాణాల్ని నిజంగా నిలబెట్టి రక్షించాయనుకో. లేకపోతే ఆకల్తో 'హరీ'మని యెక్కడో అయిపు లేకుండా చచ్చిపడుండేవాళ్ళం. ఇక్కడికొచ్చి ఇలాంటి ఇరకాటకంలో పడ్తామని మేంమాత్రం కలగన్నామా చెప్పు. అందుకే జేబునిండా డబ్బు తెచ్చుకోలేదు. అసలు పెళ్ళికెళ్ళేప్పుడు డబ్బే అవసరం లేదనుకున్నాం వెర్రిబాగులవాళ్ళం. ఆకలీ, అవురావురుమంటూంటే ఈ సంగతులన్నీ తలంపుకొస్తాయా? ఇదిగో ఈ అయిదు రిటర్న్ టిక్కెట్లుమినహా మాదగ్గరింకేమీ లేవు. కొదూ, కూడదూ అంటే వీటిని కూడా తీసుకో. కలకత్తాకి కాలినడకనే యెలాగో వెళ్లిపోతాం. ఏంజెయ్యడం మరి!"

"పోనివ్వండి—" అన్నాడా పుణ్యాత్ముడు మాకథంతా ఆలకించి; మళ్ళీ మాకు ప్రాణం లేచివొచ్చింది. నింపాదిగా ఆకొట్లోనుంచి బయటపడ్డాం.

అల్లంతదూరం వెళ్ళేక వెనక్కి తిరిగి చూద్దుంగదా, పాపం ఆకొట్టువాడింకా కళ్ళు వెళ్ళబెట్టుకుని మావేపే చూస్తున్నాడు." అంటూ ముగించాడు శరత్ బాబు.

సౌరీంద్రనాథ్ యీకథ యెంతో వుబలాటంగా విన్నాడు. శరత్ బాబు మరో చుట్ట ముట్టించాడు. "నిజం చెప్తున్నా శరత్ దాదా! పెళ్ళిలో మీరుపడ్డ అవస్థలకీ, నేను పడ్డపాట్లకీ, నక్కకీ. నాగలోకానికీవున్నంత తేడా వుందనుకుంటే. బలే రంజుగా వుంది మీకథ" అన్నాడు సౌరీంద్రనాథ్. ★

# నెచ్చెలి

శతురిగాం
గుకోరాజ్ఞి

మోకాళ్ల మీద గడ్డం ఆన్చి, క్రింది కి చూస్తూ కూర్చుంది సుమిత్ర. క్రింద గడ్డిపోచల మీద తడి మెరుస్తోంది. దూరాన చిన్న నీలంపూలు గాలికి ఊగుతున్నాయి. గాలికి పైనుంచి కనకాంబరం రంగు గొట్టం పువ్వొకటి రాలి క్రిందపడింది. బరువుగా నిట్టూర్పు వదిలింది సుమిత్ర.

పుస్తకంలోంచి తలెత్తి చూసింది వసుంధర. "ఏమిటది? ఇందాకట్నుంచి చూస్తున్నాను?" అన్నది.

సుమిత్ర మాట్లాడలేదు. దూరానవున్న చెట్లకొమ్మల మీద స్వర్ణారుణ కాంతితో సూర్యకిరణాలు ప్రసరిస్తున్నాయి. అంతా నిశ్శబ్దంగా వున్నది.

"హాస్టల్లో చేరి చదువుకునే ఆడపిల్లలంతా యీ గార్డెన్సులో కూచుని, నిట్టూర్పులు విడవటానికి కాదు యింత అందంగా యీ తోట వేసింది— తెలుసా?" అన్నది వసుంధర.

ఎంతో ప్రశాంతంగా వున్నది వాతావరణం. తీయని శోభ గోచరిస్తోంది చుట్టూ ప్రకృతిలో. దూరాన హాస్టలు బ్లాకుల్లోంచి ఏవో యింగ్లీషు పాటలు వినిపిస్తున్నాయి. మధ్యమధ్య కీచుమని కేకలు, పకపక నవ్వులు వినిపిస్తున్నాయి.

సుమిత్ర మళ్లీ నిట్టూర్చింది. వసుంధర పుస్తకం మూసేసి ప్రక్కన పడేసింది. "ఏమిటా వేదన? చెప్పమంటుంటే!" అన్నది. సుమిత్ర మనస్థితి విరబూసిన పారిజాత వృక్షంలా వున్నది. కదిలిస్తే జలజలా రాలుతాయి పుష్పాలు. ప్రకృతి మాధుర్యానికి మనస్సు కంపిస్తోంది. తనలోని ఆలోచనలన్నీ ఏదో విధంగా చెప్పుకోవాలనీ, ఆర్ద్రతని విరజిమ్మాలనీ అనిపిస్తోంది.

"నీకెప్పుడైనా పెన్‌ఫ్రెండ్స్ అంటూ వున్నారా?" అన్నది సుమిత్ర.

"నాకు గిట్టవు అలాంటివి. ఏం, నీకు కావాలా యిప్పుడు?" అన్నది వసుంధర. "ఒక వయస్సులో అది చాలా రొమాంటిక్ గా కనుపిస్తుంది. 16-20 సంవత్సరాలమధ్య - కాదూ."

"కావొచ్చు - ఇంతకీ దేనికీ ఉపోద్ఘాతం?" సుమిత్రకళ్లు సగం మూసుకుని చూస్తోంది. "జీవితంలో ప్రతి వ్యక్తికీ యితరులకి కొంత ఆనందం, కొంతదుఃఖం కలిగించే అవకాశాలుంటాయి. అవి మనం ఉపయోగించుకోవడంలో వుంటుంది నేర్పు."

వసుంధరకి సుమిత్రకళ్లు ఆర్ద్రంగా మెరుస్తున్నాయా అని అనుమానం కలిగింది. క్రింద పడిన పచ్చపూవుని పట్టుకున్న ఆమె వ్రేళ్లు వణుకుతున్నాయా అనిపించింది— వసుంధర మౌనంగా ఊరుకున్నది. ఈ విణ్ణారం పరిచయంలో రెండు మూడుసార్లుకూడా చూడలేదు యీ మూడ్‌లో సుమిత్రని. ఒకే రూములో వుంటూ, ఒకే సారి కాలేజీకి వెళుతూ రిసెర్చి చేస్తున్నారు. ఇరవై నాలుగంటలూ యిద్దరూ కలిసే వుంటున్నారు—

కానీ యిలాంటి మూడ్స్‌లో సుమిత్ర పడి కప్పుడు వసుంధరకి ఆమె అర్థంకాదు ఏమీ చెప్పదు, దగ్గరగా ఏడిచేసి బాధపైనా తీర్చుకోదు. ఏదో ఒక పరమసత్యాన్ని లోక సామాన్యంగా చెప్పి, దాన్ని గురించే బాధపడుతున్నట్లు కనిపిస్తుంది. ఆమెచేత మాట పలికించడం అసంభవం.

కానీ—యీనాటి వాతావరణం భిన్నంగావుంది చుట్టూవున్న అందం, తమని అంటకుండా దూరందూరంగా జరుగుతున్న ధ్వనులు, మూగగా ఆనందాన్ని విరజిమ్ముతూన్న పూలు, పిట్టలు, చెట్లు—వీటన్నిటిమధ్య తామిద్దరే ఏదో ఒక సామీప్యం అనుభవిస్తున్నారు కుసుమభరితమైన లత—వున్నది సుమిత్ర

"సుమిత్రా, చెప్పు నేను వినడానికి సిద్ధంగా వున్నాను." అన్నది వసుంధర. సుమిత్ర క్రిందకివాలి గడ్డిమీద పడుకుంది వసుంధర ఆమె తలనుతీసి, తన ఒళ్లో వుంచుకుంది "చెప్పు మరి" అన్నదామె.

"నేను యింటరులో వుండగా పెన్ ఫ్రెండ్స్ సంఘంలో చేరాను—అంటే ఏడేళ్ళ క్రితం అన్నమాట దూరదూరాల్నించి వచ్చే వుత్తరాలు, కలిగే పరిచయాలు, అవి కొని తెచ్చే స్నేహపరిమళాలు నా మనస్సులో నిత్యం మెగులుతుండేవి. ఎక్కువమంది మగవాళ్ళే వ్రాసేవారు నాకు. లక్నోనుంచి ఒక తను-సంగీతం నేర్చుకునే అబ్బాయి, మద్రాసునుంచి ఒక అయ్యంగార్ల అబ్బాయి, స్పోర్ట్స్‌మేన్, హైదరాబాదులో ఒక యం. ఏ. స్టూడెంటు—ఎవరో యింకా—తిరుపతినుంచి మరో అమ్మాయి పరిమళ అని—ఇంకా ఎందరో వ్రాస్తుండేవారు. అందరికీ ఏదో ఒక పోజ్ యిస్తూ వ్రాయడం అలవాటు నీకర్థమౌతుంది కదూ ఆ వయస్సు!

సభ్యుల జాబితాలో నా యోగ్యతలు—16 సంవత్సరాలు, కవిత్వం, సంగీతం, ఫోటోగ్రఫీ అంటే యిష్టం-అన్నిట్లో ప్రవేశం, యితర ప్రాంతాలలోని కాలేజీలను గురించి, విద్యార్థులను గురించి తెలుసుకోవాలని కుతూహలం-యివీ యితరులకు సంబంధించినంతవరకు యితరులకు తెలిసేవి. బాగున్నాయి యివన్నీ మరి.

గుప్పున వాసనవేసే వుత్తరాలు కొన్ని వస్తే-అమ్మ చూసి కేకలేసింది రెండు మూడుసార్లు యీ వ్రాతలన్నీ మానేయమని—కానీ నేను వాళ్ళకి వ్రాయడం మాత్రమే మానేశాను

రోజు విడిచి రోజు ఉత్తరాలు వచ్చేవి. నేను ఆ రాత్రి రాత్రే కూర్చుని, కొంచెం కాలేజీ ఫంక్షన్లు, కొన్ని ప్రకృతి వర్ణనలు, మానసికావస్థలు-అన్నీ కలిపి వ్రాసేదాన్ని ప్రణయాత్మకంగా.. .."

సుమిత్ర ఆగింది-వసుంధర సుమిత్ర నుదుటిమీద వెంట్రుకలని ఉంగరంగా చుట్టి అల్లా వదిలింది.

"ఇంతకీ పైన చెప్పినవాళ్లలో ఎవరిని ఏరుకోమంటావు నీకథకి?" అనుకోకుండానే చిన్నగా నవ్వుతూ అడిగింది వసుంధర

"అంత సుఖాంతమైన కథేమీ కాదు వసుంధరా—ఏడాది తిరిగేలోపుగానే అందరికీ వ్రాయడం మానేశాను నేను మీ ఫోటో పంపండనో, వివాహాన్ని గురించి, వర్ణాంతర, రాష్ట్రేతర వివాహాలనుగురించి మీ అభిప్రాయమేమిటనో, మీవూరు వస్తాము కలుస్తారా అనో" ఇలాంటివి వ్రాసేవారు కొందరు ఇలాంటి వాళ్లకి సమాధానం వ్రాయాలనిపించేది కాదు.

వీళ్లందరిలోకీ ముందునుంచి ప్రత్యేకంగా కనుపించాడు ఒకతను—శ్రీ పూరి అతనే. బెజవాడలో వున్న నాకు యీవూరు చాలా గొప్పగా అనిపించటంలో ఆశ్చర్యం లేదు. యం. ఏ. చదువుతున్నానని వ్రాశాడు. సాహిత్యంతో బాగా పరిచయమున్నవాడు—అదీకాక, ఏవేవో వర్ణనలు వ్రాసేవాడు



# ★ స్నేహం ★

అతి రమ్యంగా. పత్రికల్లో కథలు చదివినంత ఉత్సాహంగా చదివేదాన్ని మొదట్లో. అప్పుడప్పుడే వికసిస్తున్న ఆలోచనలు నావి. తీయనిమాటలు, రమ్యమైన వర్ణనలు, మధురమైన భావనలు—యిల్లాంటివి ఎక్కడ, ఏ రూపంలో గోచరించినా మనస్సు పులకించేరోజులవి. ముత్యాల వరుసవంటి అతని అక్షరాలు అంత చక్కని దస్తూరీ ఎక్కడా చూడలేదు నేను. మనస్సుని రంజింపచేసే మాటలతనివి.

అతనితో స్నేహం నాకు అలవాటైంది. మొదట్లో అతన్నిగురించి నిర్వికారంగా ఆలోచించినా, తర్వాత త్వరలో ఏవో వూహాలు మెదిలేవి. విశాలమైన నుదటి మీద దీపం కాంతి మెరుస్తుండగా, చక్కని వ్రేళ్ల మధ్య కలంపుచ్చుకుని వ్రాసే అతని మూర్తి కనుపించేది. నవ్వితే చిన్న గుంటపడే అతని కపోలం, మోచేతుల పైకి మడిచిపెటిన అతని షర్టు, ఆ మెడదగ్గర కనిపించే సౌందర్యం, గుండీ వూడదీసిన అతని లాల్చీ ఇల్లా రకరకాలుగా అప్పుడప్పుడు అతని రూపం కనుపించసాగింది. అతని కళ్లు—ఎంతో ప్రయత్నించిన మీదట వూహించగలిగాను. పొడుగాటి రెప్పల వెంట్రుకలు, సుతిమెత్తగా కనుపించే కనురెప్పలు, నవ్వితే ముడుచుకుపోయే కళ్లు—అవిమాత్రం కనుపించేవి."

సుమిత్ర కంఠం వణుకుతోంది. కళ్ళు గట్టిగా మూసుకుని వసుంధర చేతినిపట్టుకుంది. "ఏమిటో రొమాంటిక్ ఫూల్ ననిపిస్తుంది ఇప్పుడు—ఆ వయస్సు, పరిచయాలు, అవన్నీ అనుభవించేసి మర్చిపోయేవి. వాటి మర్చిపోనివి పర్యవసానాలే జీవితంలో జ్ఞాపకముంటాయి. ఆ పర్యవసానాల నంటిపెటుకున్న సంఘటనలు, మమతలు అన్నీ జ్ఞాపకముంటాయి కాబోలు.

ఉత్తరాల్లో ఎప్పుడూ అతను నా రూపాన్నిగురించి ప్రశ్నించలేదు, అతని రూపాన్నిగురించి వ్రాయలేదు. మూడేళ్లు వ్రాసినా ఉత్తరాలు - ఎన్నడూ ప్రస్తావించే ధైర్యం కలిగిందికాదు. ఏవిధమయిన వ్యక్తిగతవిషయాల ప్రసక్తి ఉండేదికాదు అతను వ్రాసేవాటిల్లో. ఏదో చిన్న చిన్న వ్యాసాలు, చక్కని స్కెచెస్ అతనిఉత్తరాలు. నాకు ఎన్నిసార్లో కుతూహలం కలిగేది ఫోటో పంపండని వ్రాద్దామని. మగవాడు అతనే ఉత్సాహం చూపనిదే నేనెందుకు చూపాలి అని, తమాయించుకునేదాన్ని. ఎంత వద్దనుకున్నా, అతని ఉత్తరం రాగానే మనస్సు ఊయలలూగి, ఆనందంతో పులకరించేది. ప్రతి అక్షరం తేనెలొల్కుతూ కనుపించేది. అర్ధరాత్రి నిద్రలేచికూడా చదువుకునేదాన్ని అక్కడక్కడి పంక్తులు.

అతను యం. ఏ. పాస్ అయిపోయాడు. ఒక ఏడాది అవీ ఇవీ ఉద్యోగాలకోసం వెతికి లెక్చరరుగా స్థిరపడ్డాడు. నేను బి. ఎస్ సి. పూర్తిచేసేసరికి మేము ఒకరినొకరం చూసుకోకుండా, ఆప్యాయమొలికే మాటలు ఒక్కటికూడా వ్రాసుకోకుండా కూడా అతిసన్నిహితమైన స్నేహితులమై పోయాము. నేను అంటీఅంటకుండా భిడియపడుతూ వ్రాయడం నేర్చుకున్నాను. ఊహించుకొన్నకొద్దీ అతనికళ్ళే జ్ఞాపకంవస్తుండేవి. అతన్ని చూడడమే తరువాయి, మా స్నేహం లతలల్లుకుని, పుష్పిస్తుందని వూహించుకునేదాన్ని. మెరుపులు మెరిసే నవ్వు అతని కళ్లల్లో గోచరిస్తుందని వూహించేదాన్ని. ఇదంతా—దేనికెంత ప్రాముఖ్యమివ్వాలో తెలియకపోవడంవల్లనే అనుకుంటాను. వన్నలముకున్న పరిమళంవంటిది అతని స్నేహం. ఆ నాలుగేళ్ళ నాజీవితంలో ప్రతివారం పోస్టు మేన్ రాకకి, ప్రతిరోజూ తెల్లవారడానికీ ఒక ప్రాముఖ్యం ఇచ్చాయి అతనిని గురించిన ఆలోచనలు. ప్రొద్దున ఆలస్యంగా నిద్రలేవగానే సూర్యుని కిరణాలు కళ్లని తాకితే-అతనే జ్ఞాపకం వచ్చేవాడు.

కాలేజిలో క్లాసులో పాఠాలు జరుగుతుంటే చుట్టూవున్న మొగపిల్లలవంక తేరిపార చూసేదాన్ని, ఎక్కడైనా అతని పోలికలు కనిపిస్తాయేమోనని-వస్తూ, మరీ పిచ్చిగా వుందికదూ?"

వసుంధర లేదని తలూపింది, "లేదు. చెప్పు" అన్నది.

నిజంగా అదిపిచ్చే- బి. ఎస్ సి. పూర్తికాగానే హైదరాబాదులో యం. ఎస్.సి. చదువుతున్నాను. మిగిలినచోట్ల దరఖాస్తు చేసినా సీటు రాలేదు కాబట్టి వెంటనే ఒప్పుకున్నాను. ఊరువిడచి మరోచోట ఉండటానికి వెడుతున్నానంటే ఉత్సాహంగా ఉండటం సహజమే కానీ రెపరెపలాడే మనస్సుతో చూడసాగాను అతన్ని కలుసుకోవడంకోసం. నాకు సీటు దొరికిందని వ్రాశాను అతనికి. అతను వేరే ఏదో కాలేజీలో లెక్చరరు అన్న సంగతి మా అన్నయ్యకి తెలుసు. హైదరాబాదు వెళ్లిన తర్వాత అతన్ని కలుసుకుంటానన్న సంగతి అన్నయ్యకి మాటవరసకి చెప్పినట్లుగా చెప్పాను. వారంవారం వచ్చే అతని ఉత్తరాలని అందరూ గమనిస్తూనేవున్నా. అతిస్నేహంగుణమో చాలా మర్యాదస్తుడనో క్రింద జమకట్టేసి, పట్టించుకోవడం మానేశారు. హైదరాబాదుకి బయలుదేరే ముందుకూడా ఎక్క

వగా మాట్లాడలేదు నేను అతన్ని గురించి. ఏమిటో వెనుదీశాను.

నేను అన్నయ్య వచ్చి యిక్కడ హోటల్లో దిగాము.

యూనివర్సిటీకి వెళ్ళడం, ఫీజు కట్టడం. యిక్కడికి వచ్చి హాస్టల్లో సీటు సంపాదించడం, అవీ యివీ కొనుక్కోవడం అన్నీ ఒకవారంలో పూర్తయినాయి. ఈవారం రోజుల్లో ఎన్నో చోట్లు తిరిగాము. బయలుకు రావడం తప్పు ఎక్కడో అతను కనిపిస్తాడని నటికేవి నాకళ్ళు. అతను ఎవరని వెతుకుతాను నేను, సిగ్గుపడతాను!

అన్నయ్య వెళ్ళిపోయాడు నన్ని హాస్టల్లో దింపి. అతనికి వ్రాద్దామని సంకల్పం. రాత్రి వ్రాద్దామని ప్రొద్దున్న, తెల్లారిలేచి వ్రాద్దామని రాత్రి వాయిదా వేసేదాన్ని. ఎందుకనో జాప్యం-వ్రాయగనే అతను వస్తాడు. అందుకనేమో అర్థంకాని జాప్యం చేశాను. ఒకరాత్రి పడుకున్నాను ఎంతకీ నిద్రపట్టలేదు చేయదలచుకున్న పని ఏదో మిగిలిపోయినట్లు. లేచి అతని చిరునామాకి కవరు వ్రాశాను. నేను వచ్చాననీ మళ్ళీ శనివారంనాడు సాయంత్రం నన్ను చూడ్డానికి రమ్మనీ. తప్పక వస్తానని వ్రాశాడతను. ఆ జవాబు వచ్చినప్పట్నించి నామనస్థితి వర్ణనాతీతం. ఆసాయంత్రాన్ని తలచుకుంటూనే. ఊహలు వేసి మనస్సుతో కాలం గడిపాను.

—వసూ. యింత కంటుందేమో నీకు ఆశ్చర్యంగా అనిపిస్తుందికదూ? ఏవో వింత వసలు కల్పించుకుని, ఒక ప్రణయాన్ని కాంక్షిస్తూ, అందుకై ఆరాటపడ్డాననంటావు కదూ? కావచ్చు. మూడేళ్ళక్రితం నాస్థితి అల్లాంటిది మొదటిసారిగా యిల్లువదిలి, ఒంటరిగా వుంటున్నాను. నాఒంటరితనం, అతనిని గురించిన ఊహల్లోని నవ్యత — నా పరిస్థితికి కారణాలనుకుంటాను

అతను రాకని, ఆ సమయంలో నా అలంకరణ, సంభావణ, నన్ను చూసి అతను వెలిగాగా ప్రవర్తించేది-అతనూహించని సౌందర్యాన్ని అతను నాలో చూసి ఏమనుకునేది — అన్నీ వూహించుకున్నాను. నా వేపు ఆశ్చర్యంతో చూసే అతని కళ్ళని, పలకరించే నా హృదయస్థితిని తలచుకున్నాను.

శనివారం రానేవచ్చింది. సాయంత్రం నాలుగు నుంచీ నేను వద్దనుకుంటూనే అలంకరించుకున్నాను. పరీక్షకు వెళ్ళే విద్యార్థిలాగా వణుకుతున్నాను.

ఐదుగంటలకి విజిటర్స్ చిటీలు పట్టుకు వస్తోంది ఆయా. వరండాలోనే నుంచున్నాను. అతని చిటీ వచ్చింది నల్లగాపోయిన వ్రేళ్ళలోకి ఆ చిటిని తీసుకున్నాను. అదేదన్నా రీ, గదిలోకి వెళ్ళి చెప్పులు వేసుకుని, బయటకు వచ్చాను.

(44 వ పేజీ చూడండి)

# అన్వేషణ

పోతుకూచి సాంబశివరావు

(గతవారం తరువాయి)

రైలులోని వివిధతరగతుల జనం ఆకార రేఖలు బొమ్మల్లా కదిలాయి. ఒక్కొక్క వ్యక్తి ఒక్కొక్క బొమ్మలా కనిపించాడు. హావభావ భంగిమలు, రూపురేఖలు, గీతల్లో యిమిడ్చి ఊహించాడు శివరాం. ప్రతిదీ అద్భుతమైనరేఖా-చిత్రంలా తయారయినట్లు పొంగిపోయాడు శివరాం. రైల్వే స్టేషన్‌లో కదిలేజనం బొగ్గుమసి చొక్కాలతో నడిచే రైల్వేకూలీలు. ఇంజను డ్రైవరు, పళ్ళ అమ్మేకూలి, చుట్టాబీడీ, సిగరెట్సు! అంటూ అరచే పిల్లవాడు, టీస్టాలు గీతల్లో దృశ్యాలుగా కళ్ళముందు కట్టాయి శివరాంకు. పేరిశాస్త్రి ఆ రైల్లో ప్రయాణంచేస్తూ ఏదో స్టేషనులో దిగి పచారుచేస్తూ ఏమోయి అంటూ నవ్వుతూ పలకరించాడు శివరాంను. జగతిఅంతా విచిత్ర వ్యక్తులతో కూడిన వివిధ దృశ్యాల సౌందర్యమయం అనుకున్నాడు శివరాం.

బ్రహ్మయ్యగారు మనమడిలేఖ చదివి, ఏ నిష్ఠలేనిశ పొగరాదని నమ్మి ఆ సంబంధం గురించి ఇంక ప్రయత్నం చెయ్యడం అనవసరమని నిర్ణయించుకున్నారు. అదే జవాబు శివరాంకు అందింది. అయినా తన ప్రయత్నలోపం ఉండకూడదని పేరిశాస్త్రి గారింటికి బయలుదేరాడు శివరాం. దారిలో పేరిశాస్త్రి ఎదురయ్యాడు.

'సరిగా నిన్నుగురించే ఆలోచిస్తున్నానోయ్!' అన్నాడు పేరిశాస్త్రి శిఖాగ్రం ఊపుకుంటూ నవుస్తూ.

శివరాం నవ్వాడు. హోటల్కి నడిచారు యిద్దరూ. ఒద్దు ఒద్దు అంటూనే పేరిశాస్త్రి నాల్గువడలు, అయిదు అట్లు చక్కటి వేడి కాఫీ సేవించి, సంతృప్తిగా త్రేన్చాడు. ఒక డిప్యూటీ కలక్టరు కొడుకు బి. ఏ. చదువుతున్నాడని, ఒక హెడ్మాస్టరు కొడుకు ఇంజనీరింగులో యీ ఏడే చేరేడని ఒక బి. యస్ సి. యువకుడు ప్రస్తుతం కాలేజిలో ఒక చిన్నఉద్యోగం చేస్తున్నాడని, వీలైనంతవరకు కన్యలకు పెళ్ళికొడుకులను నిర్ణయించడంలో, ఉద్యోగంలో స్థిరపడిన వ్యక్తులను ఎరుకోవడం మంచిదని చెప్పారు పేరిశాస్త్రి, గంభీరంగా ఫలహారబలాన్నంతా జాగ్రత్తగా ప్రయోగిస్తూ 'కాని కట్నాలు చాలా హెచ్చుసుమీ!' అంటూ పెదిమవిరిచి కళ్ళు పెద్దవిచేసి ముఖం చిట్లించాడు శాస్త్రి.

"సమంజసమైన కట్నం మేమూ యిచ్చుకుంటాంకదూ!" వినయంగా చెప్పాడు శివరాం.

'ఆ!...ఇంచుమించు ఏడెనిమిదివేల రూపాయిలకు తగ్గనుకుంటా. అంతా పరువు ప్రతిష్ఠగల కుటుంబాలు ...రత్నాల్లాంటి అబ్బాయిలు! అయినా మన ప్రయత్నం మనం చేద్దాం వీలైనంతవరకు కట్నం తగ్గించేలా తంటాలుపడదాం...అదేనా నిన్ను చూసి—నిన్ను చూస్తుంటే ఏమిటో ఆప్యాయత ఉట్టిపడుతోందోయ్!" ఆనందంతో కళ్ళుమెరిశాయి శాస్త్రికి.

శివరాం తాను నివసిస్తున్న అద్దెకొంపకు తీసుకెళ్లాడు శాస్త్రిని. గృహయజమానులు ఆంగ్లోయిండియనులని తెలిసి శాస్త్రి చీదరించుకున్నాడు.

'ఎల్లాగుండ గలుగుతున్నావోయి యీ యింట్లో... నీచువాసన... వెకవెకలు...పకపకలు...గౌనులతో తిరిగే ఎదిగిన ఆడాళ్ళు మన సాంప్రదాయాలకు తగదోయ్ యీ వాతావరణం...నీకు మా యింటిప్రక్క ఏదైనా ఇల్లు చూపిస్తా!" శాస్త్రి యింక అక్కడ ఉండకంటూ శలవు పుచ్చుకుని వెళ్లిపోయాడు.

మతాలు వేరైనా, జాతుల నడతలలో భిన్నత్వమున్నా, సర్వం ఏక మానవుల కుటుంబం అనే దృక్పథం ప్రబలిన ఆధునిక యుగంలోకూడా శాస్త్రివంటి కొంచెం పురాతన మనుష్యులు లేకపోలేదని అర్థమయింది శివరాంకు. ఒక్కొక్కసారి సనాతనత్వ సంకుచిత ప్రవర్తన, ఆధునిక విశాల దృక్పథం అన్నది కాలానుగుణ్యమైన గుణాలుకాకపోగా, మానవ సైజగుణాలేమో అన్న భ్రమ కలిగింది శివరాంకు.

శాస్త్రిగారి ననుసరించాడు సాయంత్రం వేళల శివరాం. డిప్యూటీ కలక్టరు గారు కలుసుకోవడం కష్టమని ఆయన తమ్ముడి గృహానికి తీసుకువెళ్లాడు శాస్త్రి. లుంగీ, చొక్కా తొడుక్కొని చక్కగా క్రాపు దువ్వుకుని శాస్త్రిని చిరునవ్వుతో ఆహ్వానించాడు ముప్ఫయి అయిదేళ్ళ మనిషి. పెద్ద మనుష్యుల పరిచయంకోసం వెడుతున్న శివరాం తానుకూడా ఒక కోటు బిగించి పెద్దమనిషి తరహా కనపరచాలనుకున్నాడు. శాస్త్రి సంబంధం గురించి కదిపాడు.

'ఏమిటి శాస్త్రిగారు ... మీరుకూడా యిటువంటిపని చేస్తారేమిటి ... ఇతని తాలూకు పెద్దవాళ్ళని రమ్మనక యీ కుర్రాడని తీసుకు వచ్చారేమిటి?' కుండ బద్దలు కొట్టినట్లు కోపంగా అన్నాడు ఆయన.

శాస్త్రి కొంచెం బాధపడి, బాధ మరుగు పరుచుకుంటూ తమాషాగా నవ్వాడు.

శివరాంకు అవమానోద్రేకం హృదయంలో రగిలింది. వ్యక్తికి విలువలుపోయి, వయస్సుకు గౌరవం పెరిగింది అనిపించింది. వయస్సుమళ్ళిన తెలివితక్కువను ప్రశంసించి, యువకవ్యక్తుల తెలివిని విస్మరించే వ్యక్తులుకూడా ఆధునికయుగంలో కనుపించడం శోచనీయమనిపించింది. అయినా ఏ యుగంలో నయినా వయస్సు మళ్ళిన పెద్దలు వయస్సులో తక్కువైన కుర్రవాళ్ళ సలహాలు ఎంత ఉత్కృష్టమైనా గమనించరనేది మానవుని సహజగుణంగానే తోచింది శివరాంకు.

ఇదే అనుభవం శాస్త్రి ఎక్కడికి తీసుకెళ్ళినా జరిగేది. వివాహం కాకపోవడం, వయసులో బాగా పెరిగి పెద్దమనిషిలా కనిపించకపోవడం కుటుంబ పెద్దగా తన్ను అనర్హుణ్ణి చేశాయి అని విచారించాడు శివరాం. తన ప్రయత్నాలు తాతయ్యకు ఏ విధంగానూ సహకారం యివ్వలేకపోతున్నందుకు దుఃఖించాడు శివరాం. స్వార్థపరుడైన అన్నగారు ఏ విధంగాను తాతయ్యకు సహాయం చెయ్యడని తెలిసిన శివరాం తానుకూడా, స్వార్థంలేకపోయినా, నిరుపయోగుడైపోయానని కుమిలి బాధపడ్డాడు. సమితి కార్యాలయానికి రావటంలేదని ఈశ్వరయ్య నేరం మోపాడు శివరాంపైన.

సమితిమీద ఎక్కువ శ్రద్ధచూపని కార్యదర్శి, రాజీనామా యిచ్చి తప్పుకుంటే మంచిదన్నాడు ప్రభాకరం. పూర్వం తాను సమర్థించిన మనిషినే యిప్పుడు త్యజిస్తున్న ఈశ్వరయ్య, ప్రభాకరం పద్ధతి చూసి సంతోషంగా నారయ్య, వెంకట్రావు కార్యదర్శి ప్రవర్తనపై తమ నిరసనకూడా తెలియజేశారు.

చెల్లెలి పెళ్ళి విషయాలలో నిమగ్నుడై, కొద్ది రోజులు నాటక సమితి కార్యక్రమాలు వాయిదా వేసిన దగ్గర, ఇంతవరకు తాను సమితికి చేసిన కృషి, సేవ, విస్మరించిన విశ్వాసహీనులు తనను చుట్టుకున్నారని చికాకు పడ్డాడు శివరాం. అయినా శాంతంగా, కోపం తగ్గించుకుని త్వరలోనే మళ్ళీ క్రొత్త రీతుల్లో కార్యక్రమాలు సాగిస్తానని, ప్రస్తుతం తన చెల్లెలి వివాహం స్థిరపడటంతో, చాలా పనులు చేసుకునే భారం మీద పడిందని సభ్యులను సముదాయించాడు. బ్రహ్మయ్యగారు ఉత్తరం వ్రాశారు, చెల్లెలికి సంబంధం స్థిరపడిందని, లగ్న నిర్ణయం పదిహేను రోజులలోనే నిశ్చయింపబడిందని, తక్షణం బయలుదేరి రావలసిందని. శివరాం పదిహేను రోజులు శెలవు పెట్టి రాజమండ్రి వెళ్ళిపోయేడు.

మనుమడు అందగా పెళ్ళి ముహూర్తానికి పదిహేను రోజులు ముందు రావడం బ్రహ్మయ్యగారికి ఎంతో ఆనందం కలిగించింది. వెంకటేశ్వర్లు ఆఫీసుపని బాగా పెరిగిపోవడంవల్ల, ఆఫీసరు దుర్మార్గుడుగా సంచరిస్తుండడంవల్ల ఉద్యోగక్షేమం దృష్టిలో పెట్టుకొని తక్షణం రాలేకపోతున్నందుకు చింతిస్తున్నానని, సరిగ్గా పెళ్ళిముహూర్తానికయినా తప్పక వస్తానని జాబు వ్రాశాడు. అన్నగారి పద్ధతిలో క్రొత్తదనం ప్రత్యేకముగా ఏమీ లేదని భావించాడు శివరాం.

పెళ్ళి ప్రయత్నాలు ముమ్మరంగా జరుగుతున్నాయి. తన బంధువుల కందరికీ వివాహ లేఖలు పంపించేరు. బ్రహ్మయ్యగారు పొలాలమీది శిస్తు సేకరణ, ధాన్యం దంపించడం, పసుపు కొట్టించడం, ఊరగాయలు పెట్టించడం, స్వయంగా శివరాం పర్యవేక్షణలో చేయించసాగాడు. పెళ్ళి పనులలో సహాయం చేయవచ్చునంటూ మధ్య వయస్సు వితంతు బంధువులు పదిరోజులు ముందుగానే బ్రహ్మయ్యగారింట్లో పదిలంగా బసచేశారు. బ్రహ్మయ్యగారితో ఒక సాయంత్రం బజారుకువెళ్ళి పెళ్ళికి కావలసిన బట్టలు, ఆభరణాలు సరుకులు పట్టించుకువచ్చాడు శివరాం.

లక్ష్మి పెళ్ళికళతో అలరారుతోంది. సిగ్గుతో, వినయంతో, నమ్రతగా, ఎక్కువ కదలకుండా ఇంట్లో మసులుతోంది. పెండ్లికొడుకు దీక్షితులు ఎక్కువ చదువుకున్నవాడు కాకపోయినా, ఇంటరు పరీక్ష చదివి మానేశాడు. చిన్నతనంనుంచి తండ్రికి సేద్యములో సహాయం చేస్తుండడంవల్ల వ్యవసాయ అనుభవం బాగా గడించేడు. ఎంత చదివినా పొట్టకూటికి ఏదో ఉద్యోగం చేయక తప్పదు గనుక, చదువుకు అనవసరమయిన ఖర్చులు మాని ఉన్న భూములు వ్యవసాయం చేసుకుంటే, లేని ఉద్యోగంకోసం ప్రత్యేకం తాపత్రయపడనవసరం లేదని అతని అభిప్రాయం. అభివృద్ధికి రావలసిన తమ్ముళ్ళు, చెల్లెళ్ళు ఇంకా వుండగా తనమీద కుటుంబ ఆదాయం ఖర్చుకాకూడదనే త్యాగభావముతో తన చదువుకు స్వస్తి చెప్పాడు దీక్షితులు.



"ప్రియా! ఈరోజు నీకేమి ప్రెజెంటు తెచ్చానో చెప్పుకో చూద్దాం!"

చిత్రం: కె. రామకృష్ణారావు—బందరు.

దీక్షితులు గుణగణాలు ఉత్తమమయినవని విన్న బ్రహ్మయ్యగారు గృహస్థుడికి ఉండవలసిన ముఖ్యలక్షణం ఉందని, లక్ష్మి సుఖపడుతుందని సంతోషించారు. ఎక్కువ కట్నం ఇచ్చుకోలేక మధ్యతరగతి జీవనం గడిపే తనబోంట్లకు అనవసరం అయిన సరుకులు దీయకుండా, యీ సామాన్య సంబంధంతో ముడిపడితే, కుటుంబాలకు సమాన ప్రతిపత్తులు కలిగి కలిసి మెలిసి బ్రతుకగలవనే ఆశ బ్రహ్మయ్యగారిలో కలిగింది. అందువల్ల సంబంధం నిశ్చయించారు లక్ష్మికి.

స్ఫురద్రూపి, తనకన్న ఎక్కువ చదువుకున్నవాడు, బుద్ధిమంతుడు, అని అం చేసుకున్న లక్ష్మి, దీక్షితులును వివాహం చేసుకోడానికి బ్రహ్మయ్యగారి నిశ్చయంతో ఏకీభవించింది. వివాహ ఉత్సవం ఘనంగా జరపాలని ఆత్రత చూపుతున్న సుభద్రమ్మ నకుని కుటుంబం మంచితోనే సంతృప్తి పడింది.

పెళ్ళి పందిరి వేయించి, మామిడితోరణాలు కట్టించి, కాగితాల బుట్టలు మధ్యన వ్రేలాడదీయించి, స్తంభాలకు అరటిచెట్లు కట్టించి, శోభాయమానంగా యేర్పాటు చేశాడు శివరాం వివాహమంటప ప్రదేశం. ద్వితీయ పుత్రుడైనా కుటుంబపెద్దగా పనులు పురమాయిస్తూ కార్యభారం వహించిన శివరాంను చూసి సుభద్రమ్మ అభిమానంతో పులకరించి ఆనందాశ్రువులు రాల్చింది. అమ్మ తండ్రిపోలికలు పుణికి పుచ్చుకున్న శివరాం, భర్త చనిపోయినా ఎదురుగా చిన్న ప్రతిబింబంగా కనిపించాడు సుభద్రమ్మకు.

వివాహానికి బంధువులంతా చేరారు వానాకాలంలో కప్పలు చెరువుకు తరలి వచ్చినట్లు. పెట్టెలు, పరుపుచుట్టలు ఇల్లంతా నింపి, చిందరవందరగా వస్తువులు అక్కడక్కడ విడుస్తూ పిల్లలఅల్లరి అరికట్టుకునే కేకలతో సందడిగా బ్రహ్మయ్యగారిల్లు బంధువులతో నిండిపోయింది. వివాహ లగ్నంనాటికి పెళ్లి పందిరి రకరకాల ముత్తైదువులతో, రంగురంగుల చీరల అందాల్లో మెరిసే కన్యలతో కళకళలాడింది. పురోహితుల మంత్రాలు ప్రతిధ్వనించాయి. బ్యాండువాళ్ళ వాయిద్యాల స్వరకంపనలతో హృదయ కుహరాలు దద్దరిల్లాయి. అజమాయిషీ చేసే పెద్దల సలహాల కేకలమధ్య దీక్షితులు లక్ష్మికి మూడుముళ్లు వేశాడు. దంపతుల శరీరాలు పులకరించాయి. నిండు సిగ్గు చూపులతో పరస్పరం ప్రథమంగా భార్యాభర్తలు చూసుకున్నారు వారిద్దరు. పదిహేను రోజుల శ్రమ ఫలించిందనుకున్నాడు శివరాం. చెల్లెలికి కన్యాదానం ఎవరో దూరపు బంధుదంపతులు చేశారు. శారద తన్ను వివాహమాడివుంటే చెల్లెలి కన్యాదానం తనే చేసివుండేవాణ్ణి కదా అని ఒక్కసారి ఆలోచనకలిగి బాధగా

# అన్వేషణ

చిక్కని మొహం పెట్టాడు శివరాం. బాధ అణుచుకుని బలవంతంగా ముఖభంగిమలలో ఆనందం తెచ్చుకున్నాడు. కాని శారద ఎక్కడుందో, ఏం చేస్తోందో అన్వేషించటం అసాధ్యం అని నిరాశగా నిట్టూర్చాడు శివరాం.

లక్ష్మి వివాహం అయినాక బంధువులంతా పెండ్లిభోజనాలు సంతృప్తిగా ఆరగించి, ఆరగించిన భోజనం అరిగేలా మిగిలిన శివరాం వివాహంగురించి ప్రస్తావనలు లేవదీశారు. పొరుగింటి కన్యలు, బంధువుల పెండ్లికాని కూతుళ్లు దూరదేశాల్లో శివరాం ఉద్యోగంలో ఉన్నతస్థితిలో ఉన్నాడని విని ఆశగా అతనివైపు యిష్టంగా నవ్వుతూ తిలకించుకుని నడిచేవారు. శారద మీద హృదయం లగ్నమయి, ఆశలు భగ్నమయిన శివరాంకు వివాహమంటే ఈసడింపు కలిగేది.

బ్రహ్మయ్యగారు పదిమందిబంధుజనంలో శివరాంకు చెప్పారు త్వరలో ఏదోకన్యను స్థిరపరచుకుని ఒకయింటివాడవు కావాలని. బంధువులంత ఏకగ్రీవంగా ఆయనమాట సమర్థించారు. శివరాం ఒక నవ్వునవ్వి వూరుకున్నాడు. అమాన్షం కూడిన నవ్వులో చిన్న దిగులు, నిరా బ్రహ్మయ్యగారు సుభద్రమ్మ గుర్తించ పోలేదు.

వెంకటేశ్వర్లు ఒక్కడే పెళ్ళి సమయానికి వచ్చి తన భార్యకు వంట్లో బాగుండలేదని, పిల్లలకు జ్వరాలని, యింటికి వెళ్ళకపోతే కుటుంబాన్ని చూసే దిక్కు ఎవరూ లేరని, మర్నాడే తాతగారివద్ద సెలవు తీసుకుని నిష్క్రమించేడు.

లక్ష్మిని అత్తవారింటికి మణుగుపూలతో సాగనంపారు బ్రహ్మయ్యగారు. వచ్చిన బంధుజనం క్రమంగా వెళ్ళిపోయారు ఒకొక్కరు. శివరాంకూడా తాతయ్యకు నమస్కరించాడు వెడతానంటూ. బ్రహ్మయ్యగారు కళ్ళనీళ్ళపర్యంతం తెచ్చుకుని ఒంటరిబ్రతుకులో సుఖం లేదనీ, గృహస్థధర్మం నిర్వర్తించవలసిన బాధ్యత గుర్తించుకుని త్వరలో నచ్చిన కన్యను స్థిరపరచుకోమని తిరిగి బోధచేశారు. శివరాం నిర్లక్ష్యంగా పేలవంగా నవ్వాడు.

పదిహేనుదినాల తర్వాత సికింద్రాబాదు నగరంలో అడుగుపెట్టిన శివరాంకు బాహ్య వాతావరణంలో చాలా మార్పు కనిపించింది. శివరాం గంధర్వనాటకసమితిపై నిర్లిప్తత వహించాడని, అతని చెల్లెలి వివా

హం శుభలేఖ లందుకున్న సమితి నటులంతా, ఆ వివాహాలగ్నం రోజునే కార్యవర్గ సమావేశం చేసి అతనిపై విశ్వాసరాహిత్య తీర్మానం చేశారు. ఈశ్వరయ్య కార్యదర్శిగా ఎన్నుకోబడ్డాడు. తన చిరకాల వాంఛితం యీడేరిందని మనసులో సంతృప్తిపొందేడు ఈశ్వరయ్య. కార్యదర్శి కావడంతో ఇంతవరకు శివరాం నగరంలో పొందిన పలుకుబడి తనకీ సంక్రమిస్తుందని ఆశించాడు ఈశ్వరయ్య.

వ్యక్తిగత విలువలకు, సంస్థ పదవులు ఆక్రమించి విలువలు సంపాదించుకునే వ్యక్తులకు ఉన్న వ్యత్యాసం తన భావిప్రవర్తనలో గంధర్వ నాటక సమితికి చూపించాలని నిశ్చయించుకున్నాడు శివరాం. కాలం అంతా వినియోగించి కట్టుకున్న మంగళసూత్రంలా సంస్థలనంటిపెట్టుకుని బ్రతుకుతే కాని పదవులు చిరకాలం నిలువవని తెలిసింది శివరాంకు. కొందరువ్యక్తులు స్వీయపరపతి వృద్ధి చేసుకుని సంస్థలకన్న ఉన్నత స్థాయిలో బ్రతికగలరనే విషయం జగద్విదితమయినా, గంధర్వ నాటక సమితి నటుల దృష్టి అంత విశాల దృక్పథం అందుకునే స్థితిలో లేకపోయింది. అయినా సమితిసభ్యత్వానికి రాజీనామా యివ్వకుండా సభ్యుడిగా చేరి వ్యక్తిగత విలువలు ప్రదర్శించుకోవాలని నిర్ణయించుకున్నాడు శివరాం.

ఎదురుగా అంతా ఏమిటో శూన్యం గోచరించింది శివరాంకు. మానవ కృషికి ప్రపంచంలో అమరమైన చిహ్నాలు ఎప్పుడూ ఉన్నట్లు గోచరించలేదు అతనికి. మానవశక్తి నిర్విరామముగా పనిచేసినంతకాలం పరిసరాల నుంచి ప్రశంసలు ఉద్భవిస్తాయి. మానవశక్తి క్షీణించగానే గతమంతా కాలప్రవాహంలో కొట్టుకుపోయి విస్మరింపబడుతుంది. నిత్యం జగతిలో స్మరింపబడే వ్యక్తి లెక్కకు ఒక్కడూ కనిపించలేదు శివరాం దృష్టిలో. జీవితంపరిపూర్ణత లక్ష్యసాధనలోనే వుంది.

ఆకాశం శూన్యంలోకి వదిలిన గాలిపటాలు తోకలు ఆడించుకుంటూ పైకి క్రిందకు ఎగురుతున్నాయి. పక్షులు రెక్కలు విరుచుకొని ఆకాశంలో స్వేచ్ఛకలిగినా నిమ్నోన్నతాలగతులు మార్చ లేకుండా ఎగురుతున్నాయి. ఇంటి యజమానుల కుక్క అరుపులు ప్రతిధ్వనించి, ఆరంభశూరత్వచర్యల్లా సమసిపోతున్నాయి. అనంతమైన జగతిలో సర్వవ్యాప్తమైన పగటి వెలుగులో హృదయాకర్షణీయమైన ప్రత్యేక కాంతి ఏమీ కనిపించలేదు శివరాంకు.

## 8

నాంపల్లిలోని హోటల్లో తనగదిలో కిటికీ దగ్గర నిలుచుని వీధిలోకి చూడసాగాడు పరమహంస. షరాయి, లాల్చీ, వదులుగా వేలాడుతూ కిటికీమీదనుంచి వచ్చే గాలుల్లో క్రాపు చెదురుతూ పరమహంస వ్రేలాడే దవడలముఖం ఆలోచనల మెలికలతో నిండిపోయింది. గదిలో మేజాబల్ల మీద చదరంగం బల్ల గడులలో కదిలి చెదిరిన పాచికలు పరిచి ఉన్నాయి.

ఎదురుగా రైల్వేసేవను భవనం గోపురం మధ్య అతికిన గడియారంలో ముల్లులు కదులుతున్నాయి. సెకనుముల్లు పెద్దముల్లును, పెద్దముల్లు చిన్నముల్లును కదిలిస్తున్నాయి. వృత్తాకార ప్రపంచం కార్యక్రమంలో చైతన్యంకలగాలంటే పరస్పర ధాత్ర్యం అర్థం చేసుకుని బ్రతకాలి. ఒక మనిషిని కదిలిస్తే అతని చుట్టు వున్న సంఘం కదిలి, ప్రయోజనసిద్ధికి ఉపకరిస్తుంది. రాణి తను కలిసిమాత్రమే విచిత్ర రీతుల్లో ఏదో నాటక ప్రదర్శనాలిచ్చి, వ్యక్తిగత విలువలు ఆధారంగా గత రెండు నెలల నుంచి నగరంలో కాలక్షేపం చేస్తున్నాడు. నాటకాలలో పాల్గొని ధనాపేక్ష కలిగినా సహాయంచేసే నటీమణులకొరత రాణి దొరకటంతో చాలా తగ్గిపోయింది. మరి యిద్దరు మంచి నటుల సేకరించి ప్రదర్శనలు విస్తృతంచేసి ధన సేకరణ చేయాలనే ఊహ కలిగింది పరమహంసకు.

చాలా కాలం తరువాత నగరానికి వచ్చిన తనకు పురజనుల ఆదరణ బహుళంగానే లభించింది. పాత సంసార జీవితంగోని, ప్రతి నిత్యం క్రొత్తరీతుల బ్రతుకు కావాలని వాంఛించే పరమహంసకు నగర రాజధానిలో క్రొత్త సంఘాలలో పాతకళ మళ్ళీ ప్రదర్శిస్తే కొంత ఆకర్షణ కలగక మానదని విశ్వసించాడు. అది నిజమయింది. ధనం కొంత లభించింది పుష్కలంగా. బందరులో ఉన్న కుటుంబానికి, రాణికి, తనకు ఖర్చులకు వచ్చిన ఆదాయం సరిపోతుంది. కారణమేదయినా రాణి తనకు మంచి సహాయకారిగా ఉంది. నాటక ప్రదర్శనలో అందాలరాణిని చూడటానికి కూడా ప్రజలు వస్తున్నారని వినికిడి. ధనసేకరణకు ప్రతిభతోపాటు ప్రత్యేక ఆకర్షణ ఉంటే ఎక్కువ రాణిస్తుంది. ప్రదర్శన రీతులు, ఆకర్షణలు పెంచాలంటే వాతావరణం విస్తృతం చెయ్యాలనుకున్నాడు పరమహంస.

కనుబొమలు బాణాకారాల్లా ఫాలభాగంలోకి నిగిడ్చి రాణి ఫోటో పరమహంసను పరీక్షిస్తోంది. పరమహంస చిదానందంగా నవ్వుకున్నాడు.

పరమహంసకు ఇంతవరకు నగరం చూసిన నటులంతా దృష్టిలో మెదిలేరు. సాత్వికుడు, ప్రతిభావంతుడు, తనతో కలిసిమెలసి పనిచెయ్యగలిగిన నటుడు, శివరాం అని తట్టింది. పరమహంసకు. తక్షణం అతన్ని కలుసుకోవాలని బస్సు ఎక్కాడు.

శివరాం ఆఫీసునుంచివచ్చి ఇంటిదగ్గర పెన్సిలుతో చిత్రాలు గీస్తున్నాడు. తీరుబడిగా. ఒకనాటి పరిచయమే చిరకాల స్నేహంగామార్చి ఆప్యాయంగా ఆత్రంగా గదిలో అడుగుపెట్టి సంతోషంగా కరచాలనం చేశాడు పరమహంస.

ఇష్టాగోష్ఠి ప్రథమంలో పూర్తయింది.

పరమహంస చెప్పాడు తన నాటకాల విస్తృతం చెయ్యదలుచుకున్నానని. అతని సహకారం కావాలని... నగర కార్యక్రమాలలో ఏవిధంగా పాల్గొనవలెనా అని యోచనచేస్తున్న శివరాంకు మంచిఅవకాశం లభించినట్లయింది. శివరాం తన అంగీకారం తెలియజేశాడు. తన నాటకం రిహార్సల్సు హోటలులో తన గదిలోనే జరుగుతాయని, మర్నాడు సాయంత్రం అక్కడికి రావలసిందని కోరాడు పరమహంస. శివరాం అభ్యంతరం లేదన్నాడు.

పరమహంస, శివరాంసహకారం కోరడంలో కొంత స్వార్థం లేకపోలేదు. అతనికొక పాత్ర యిచ్చి అతను ఎరుగున్న స్థలాలలో నాటకప్రదర్శనాలిస్తే ఎక్కువ ధనం సంపాదించవచ్చనే ఆశ పరమహంసకు కలిగింది. ఆ ఆశ పర్యవసానమే శివరాంను ఒక పాత్రధారుడుగా చెయ్యవలసివచ్చింది.

మర్నాడు అనుకున్న కాలానికి శివరాం పరమహంసహోటలు వెతుక్కుంటూ వెళ్లాడు. పరమహంస అక్కడే మంచంమీద ఒరిగి, జుట్టు రేగిన తీవ్ర ఆలోచనలముఖంతో ఒక లుంగీ, బనీను తొడుక్కుని ఇంగ్లీషు మేగజైను పేజీలు త్రిప్పుతున్నాడు. గది అంతా చిందరవందరగావుంది. మాసిపోయిన బట్టలు చెల్లాచెదరుగా మంచంక్రింద పడివున్నాయి. దోమతెర పూర్తిగా ఉపరి భాగం మీద ముడుచుకుపోయింది. కాల్చి విసరిన సిగరెట్టు పీకలు, నుసి, గది అంతా చెల్లాచెదరుగాపడి ఎగురుతున్నాయి. పాత మేగజైన్లు, పత్రికలు మేజాబల్ల క్రింద, మీద దొంతరలుగా పడివున్నాయి. కోటా సామానుల పెట్టె ఒకటి రంగుల ముఖంతో కిటికీలో హాస్యగాడిలా నవ్వుతోంది. మంచం మీద మాసిపోయిన దుప్పటి ముడుతలుపడి చికాకుగా ఉంది.

(ఇంకా వుంది)

★ చింతలపాటి వెంకట



ప్రసిద్ధికెక్కిన టోక్యోటవర్

ఒక స్నేహితుని ఆహ్వానముమీద నేను, నా భార్య జపానుయాత్రకు, పోయిన వేసంగిలో వెళ్ళాము. జపానుయాత్ర అనగానే శ్రీమతి భానుమతి వ్రాసిన "అత్తగారు, జపానుయాత్ర" మాదిరిది తృతీయాత్ర అనుకుంటారేమో! నిజంగా వెళ్ళి వచ్చాము. ఆ దేశములో నన్ను విశేషముగా ఆకర్షించిన విషయములను వ్రాస్తున్నాను.

జపాను దేశము విశేషంగా పర్వతమయం. శీతోష్ణస్థితి యూరపులో మాదిరిగా వుంటుంది. ఏప్రిల్, మే, జూన్, సెప్టెంబరు, అక్టోబరు నెలల్లో వెడితే బాగా వుంటుంది. జపానులో తొమ్మిది కోట్లమంది మూడు వందల దీవులలో నివసిస్తున్నారు. రాజధానినగరమైన టోకియోలో 90,00000 ప్రజలున్నారు. జపానీయులు విపరీతముగా శ్రమిస్తారు. టోకియో రైల్వేస్టేషన్ నుంచి ప్రతిరోజూ 2090 రైళ్ళు బయలుదేరతాయి. పగలు సగటున 26 సెకండ్లకు ఒక రైలు బయలుదేరుతుంది. అన్ని రైళ్లు సకాలానికి బయలుదేరి గమ్యస్థానము చేరుతాయి. జపానులో అన్నీ మీటరు గేజి రైళ్ళు.

రైళ్లలో గాని, బస్సులలో గాని, బజారులలో గాని, ఇంట్ల దగ్గర గాని బిచ్చగాండ్లు కానరారు. వ్యవసాయక్షేత్రాలలో ఒక పశువుతో గాని, ఒక ఎద్దుతో గాని, చేతితో నడిచే చిన్న ట్రాక్టరుతో దున్నుతారు. జపానులో భూకంపములు విశేషముగా రావటంవలన, చాలావరకు ఇండ్లు చెక్కలతో నిర్మిస్తారు. కొన్ని పెద్ద పెద్ద భవనాలలో ఎస్కలేటర్లు, లిఫ్టులతో సహా అమరుస్తారు. ఇక్కడ పెద్ద స్టోర్సులో పూచిక పుల్ల మొదలు మోటారుకార్ల వరకు సమస్తము దొరుకుతాయి. వీటిలో బేరము లేదు. ఇక్కడ చిన్న చిన్న దుకాణాలలో మాత్రం బేరము చేయవచ్చును. దుకాణములలో లెఖలు కట్టుటకు బడిపిల్లలు ఉపయోగించే పూసల చట్రాలు వాడుతారు.



గైషా యువతి

## నిజాయితీ

ఆంధ్రప్రదేశ్ అవతరణకు పూర్వము, హైదరాబాదులో వుండే నిజాయితి, తరువాత క్షీణించినట్లే, రెండవ ప్రపంచయుద్ధానికి తరువాత, జపానులో నిజాయితీ తగ్గిపోయింది. "చాప చినిగినా, చదరంతా" అని యెంత తగ్గినా, వాళ్ళ నిజాయితి, మనకంటె చాల యెక్కువ. జపానులో పశుసంపత్తి తక్కువ. పాలవాడకం చాల తక్కువ అమెరికనులు వచ్చిన తర్వాత, కొంచెము కొంచెముగా పాలవాడకము పెరుగుతున్నది. చలిదేశములో పండేపండ్లు సమృద్ధిగా దొరుకుతాయి. వీరి జాతీయ పానీయం "సాకీ" అనే వరిసారా. అగ్గిపెట్టెలు, కాగితము, చౌక. జపానులో టెలిఫోనులు విస్తారముగా వాడుతారు. వాళ్ళ టాక్సీలలో కూడ టెలిఫోనులు వున్నాయి.

జపానులో ఒకరినొకరు కలుసుకొన్నప్పుడు మూడుసార్లు వంగి వంగి ప్రతి నమస్కారములు చేస్తారు. అన్ని రంగములలో యువతులు పనిచేస్తారు. జపానులో స్త్రీ పురుషులు ప్రత్యేకమైన స్నానమందిరాలలో, టర్కిష్‌పద్ధతిలో స్నానాలు చేస్తారు. అవిరి స్నానాలు చాలామంది యాత్రికులను ఆకర్షిస్తాయి. మన మాదిరిగానే, జపాను వారికి కూడ శకునాలమీద నమ్మకాలు వున్నాయి. వాళ్ళకు కాకి అరిస్తే అపశకునము.

## "గైషా" స్త్రీలు

ప్రసిద్ధికెక్కిన "కిమోనో"లు, గైషా స్త్రీలు క్షీణిస్తున్నారు. ఒకనాడు, స్వాతంత్ర్యానికి, పర్యాయపదమైన గైషాలు, యీనాడు, జపానులో, అకృతుగా కనపడుతున్నారు. ఎవరో కొద్దిమంది, పాతకాలపు వాండ్లు గైషాస్త్రీలు తప్పి సీకిమోనోలు ధరించడం మానివేస్తున్నారు. పాశ్చాత్యానుకరణ, అమెరికన్ పద్ధతులు, విపరీతముగా పెరిగి, విగ్రీతలలు వెయ్యడం మొదలెట్టినాయి. అర్ధనగ్నముగా హోటళ్ళలోను, సంగీతమందిరాలలోను స్త్రీలు విచ్చలవిడిగా తిరగడము చూచి, భయభ్రాంతులైన "నగోయా" నగర పాలకులు స్త్రీలు ధరించవలసిన దుస్తులపై ఆంక్షవిధించారు. దుస్తుల వక్షో భాగమునుంచి

మూకాళ్ళ
వర్కుకనిషి
నిషేధాజ్ఞ
లలో క

ఆరుయే
బాల బాలి
భ్యాసము
పైబడ్డ
చదువుకో
పిల్లలక
దుస్తులు,
కోజాలలో
పట్టుకొని
నిక యా
సంప్రదాం
నుంచి ఎడ



# ...యాత్ర

## ...సుబ్బయ్య ★

వరకు తప్పవుండాలి. శరీరపురంగు, ...ంచే పలచనిబట్టలు ధరించకూడదని జారీచేశారు. కాని ఇతర నగరా...లు ఈచర్య తీసుకొనలేదు.

...ళ్ళనుంచి, పదిహేను ఏళ్ళవరకు ...లు అందరు నిర్బంధముగా విద్యా చేసితీరాలి. పదిహేను ఏళ్ళ ...లు కావాలంటే కాలేజిలో ...న్ను. జపానులో స్కూలు ...ళ్ళకి, మొగవాళ్ళకి వేరు వేరు ...ట్టుక తిరింపులు నిర్ణీతం. సెలవు ...ళ్ళ వాళ్ళ స్కూలుజండాలు పిల్లలను ఉపాధ్యాయులు వైజ్ఞా...త్రలకు తీసుకొని వెళతారు.

...మ విద్ధముగా జపానువారు కుడి నుకు నిలువుగా వ్రాస్తారు. ఇప్పుడిప్పుడు అడ్డముగా ఉర్దు, పరిషియన్, అరబ్బి భాషలమాదిరి కుడినుండి ఎడమకు వ్రాస్తున్నారు. మనము తారీఖు, నెల, సంవత్సరము వ్రాస్తాము. జపానులో నెలముందు, తరువాత తేది, ఆతరువాత సంవత్సరము వ్రాస్తారు. 1959 తో సమాప్తమయినజపానువారి శక సంవత్సరము 34.

జపానులో ఆదాయము ఒక్కొక్కరికి నెలకు నూరురూపాయలు మొదలు అయిదు వందల రూపాయలవరకు వుంటుంది. అక్కడి ఖర్చులను...త్రి వ్యక్తిగత ఆదాయము తక్కువ అని తోచవచ్చు. కాని యుక్తవయస్సు వచ్చిన కుటుంబంలోని ప్రతివ్యక్తి ఆర్జించి, జీవితమును సుఖము చేసుకుంటారు. ఇరవై యేళ్లు పైబడ్డ ప్రతివారికి ఓటుహక్కు వున్నది. అమెరికాతో చేసుకొనిన ఒడంబడిక ప్రకారము పోలీసులు, రక్షణశాఖ తప్ప, సైన్యముగాని, నౌకాబలముగాని, విమానబలముగాని ఏమీ లేదు. రెండవ యుద్ధానికి ముందు విదేశీయులు స్థిరాస్తులు కొనుక్కోడానికి వీలులేదు. ఇప్పుడు ఎవరు పడితేవారు స్థిరాస్తులను సంపాదించుకోవచ్చును. 1868 సంవత్సరమునకు పూర్వము జపానులో మరణించినవారిని ఖననము చేసేవారు. ఇప్పుడు దహనసంస్కారములు విద్యుచ్ఛక్తితో చేస్తున్నారు. జపానులో దేవాలయాలలోని మూలవిరాట్టు మొదలు, ఏరోప్లేనులు, ఏరోడ్రోములు ఏవిపడితే వాటిని ఫోటోలు తీసుకోనిచ్చెదరు. మన దేశములో, అఖరికి నాగార్జునసాగర్ ఆనకట్ట దగ్గర ఫోటో తీసుకోవలెనని కెమేరా తీసుకు వెళ్ళితే, ఊరుముందు గేటుదగ్గర కెమేరా ఇచ్చివేసి వట్టిచేతులతో వెళ్ళిరావాలి. అది కాకున్నా లేదుగాని. వీలుగావుంటే మన కలకొయ్యగూడా గేటుదగ్గిర అట్టేపెట్టి వెళ్ళిరమ్మనమనే వాళ్ళేమో మన అధికారులు.

మా సొంతవూరు విజయవాడలో, నాగేశ్వర రావుపంతులుగారి మేడమీద నుంచు నుంటే కాలువలతో వెనిసునగరమా అనిపిస్తుంది విజయవాడ. కాని కాలువగట్టుమీద దేవుడి మూడో అవతారాలు, మనుష్యులా సహృదయంతో సందర్శించటం కనిపిస్తుంది. జపానులో ఇలాంటి దృశ్యాలు కలికానికి కూడ లేవు. పారిశుధ్ధ్యం అంటే జపానునే చెప్పుకోవాలి.

"నారా" లో 58 అడుగుల ఎత్తున్న బుద్ధవిగ్రహం

క్యోటోలోని కుకుంజి సువర్ణ దేవాలయం

## ముఖ్యప్రదేశాలు

టోకియో:— టోకియోనగర విమానాశ్రయం, సముద్రతీరాన వున్నది. చూడడానికి, అంత ఆకర్షణీయంగా లేకపోయినా, సాంకేతికముగా, ప్రపంచములోని, గొప్ప విమానాశ్రయాలలో, ఒకటని విన్నాను. పట్టణంలో ఆకర్షించేది టోకియో టవరు. దీనియెత్తు 332.6 మీటరులు. పారిస్ లోని ఐఫిల్ టవరుకన్న చాలా యెత్తుఅయినది. "డయట్ హౌసు" అనే పార్లమెంటు భవనము, రాజభవనానికి సమీపములో, నగరమధ్యములో ఉన్నది. టోకియోలో

# ★ మా జపాను యాత్ర ★

అనేక క్రీడాస్థలము లున్నవి. క్రిందటి సంవత్సరము, ఆసియా క్రీడలు జరిగినవి. పీరి జాతీయ క్రీడాస్థలములో 60,000 ల మంది ఆసీనులై, ఆటలను చూచే అవకాశమున్నది. "కోరకేవాన్" క్రీడాస్థలములో "బేస్ బాల్" ఆడుతారు. ఇక్కడనే ప్రపంచ విఖ్యాతి గాంచిన జపాని మస్తీ పద్ధతి "జూడో" కూడ నేర్పుతారు. ఇందులోనే పిల్లలకు ఒక ఆరామము, మంచి ఆటల క్రీడాస్థలము ఉన్నాయి మేము వెళ్లినప్పుడు ఈ మంచు క్రీడాస్థలములో "హాలీ డే ఆన్ ఐస్" అనే ప్రదర్శనము జరుగుతున్నది.

"యూ-యి-యన్-ఓ" పార్కు చాలా పెద్దది. ఇక్కడనే భారత ప్రధాని, భారత దేశము తరఫున, జపానుకు బహూకరించిన ఏనుగు వున్నది. ఈ పార్కులో మమ్ము ఆకర్షించినవి, ఆఫ్రికా దేశపు నల్ల చిరుతపులి.



'హిరోషిమా'లో ఆటంబాంబు ఫలితంగా తులైన శిశువులస్మారక చిహ్నం

పిల్లలకోసం అంతరిక్షములో అమర్చిన ఒంటిపట్టా రైలుమార్గమున్నా. మే 6వ తారీఖునుంచి 22వ తారీఖువరకు సముద్ర తీరాన, అంతర్జాతీయ వాణిజ్య ప్రదర్శనము యేర్పాటుచేశారు. పెద్ద పెద్ద చావళ్లలో వ్యవసాయము, రబ్బరు, భారిపరిశ్రమలు కర్రపని, మోటారుకార్లు మొదలైన అనేక పరిశ్రమల విభాగాలను, వివిధదేశాలు ప్రదర్శించాయి. గడియారాలు, ఆటవస్తువులు, ఫోటో సామగ్రి మొదలైనవి, జపానులో తయారైన వస్తువులు యింకోచోట ప్రదర్శించారు.

భారతీయ ఆహారము, ఇక్కడవున్న ఒకేఒక నాయరు హోటలులో దొరుకుతుంది. ఫలహారానికి వెళ్లితే ఆ యజమాని భారత ప్రభుత్వాన్ని, ప్రధాని నెహ్రూను, తిట్టే తిట్లు, విసిరే విసుర్లు కర్ణకఠోరముగా ఉండి, చెవులుమూసుకొని, భరించి, ఫలహారము ముగించి, బయటపడ్డాము. లండనులోని ఇండియా హౌసు ఫలహారశాలమాదిరిగానే టోకియోలోకూడ, ఒక ఫలహారశాలను భారత ప్రభుత్వము యేర్పాటుచేస్తే జపాను వెళ్లే భారతీయులకూ, అక్కడ చదువుకొంటున్న భారతీయ విద్యార్థులకు, ఆ నాయరు హోటలుకువెళ్లే దుస్థితి తప్పుతుంది. "మెయిజీ" చక్రవర్తి స్మారకార్థము ప్రజల విరాళాలతో నిర్మించిన మందిరము చూడముచ్చటగా వున్నది. టోకియో నగరములోని "గింజా", "మరూనోఉచి" ప్రాంతాలు, వ్యాపారకేంద్రాలు, అక్కడ బజార్లలో దీపాలంకరణ, రాత్రిపూట చాలా బాగా వుంటుంది "అసకుస" ఆరామము, దగ్గరనున్న విహారస్థలాలు, బుద్ధుని దేవాలయము, యాత్రికులను విశేషంగా ఆకర్షిస్తాయి. అక్కడి "కకుసి" నాట్యరంగములో ప్రదర్శింపబడే, నృత్యనాటకాలు రమణీయముగా వున్నాయి టోకియోనగర హృదయములో వున్న "కబుకి" నాటకశాలలో శాస్త్రీయ జపానీ నాటక ప్రదర్శనాలు నిర్వహిస్తారు. ఇందులో నటులంతా పురుషులే. మాస్కో నగరములోని "పనోరమ" మాదిరి సినిమా ప్రదర్శనము "సినిరమ" అనే పేరుతో ప్రదర్శిస్తారు.

నిక్కో:- టోకియోకి ఉత్తరముగా 70 మైళ్లలో "నిక్కో" విహారస్థలము సముద్ర మట్టానికి 3500 అడుగుల యెత్తున ఉన్నది. ఒక చక్కని సరస్సు, "తోషోగు" దేవాలయము, రమణీయమైన జలపాతములతో యీ ప్రదేశము ప్రజలను ఆకరిస్తుంది.

కామకుర:- ఈపట్టణంలో 42 అడుగుల యెత్తు, బుద్ధభగవానుని కంచు విగ్రహము ఉన్నది ఈవిగ్రహములోపల డొల్ల లోపల నుండి మెట్లమీదుగా తలవరకు ఎక్కి చూడడానికి యాత్రికులకు వీలువుంది.

హకొని.- ఈ పట్టణము, 2400 అడుగుల యెత్తునవుంది. ఈ పట్టణం పరిసరాలలో, చాలా ఉష్ణగుండాలు వున్నవి. ఈ ఉష్ణగుండాలలోని వేడినీటిని "హకోని", "అటామి" పటణాలకు, చన్నీళ్ళతో పాటు, సర్ఫరా చేస్తారు. ఈ పట్టణం దగ్గర, 20 చదరపు మైళ్ళ వైశాల్యముగల, సరస్సు ఉన్నది. యాత్రికులు, మోటారుబోట్లమీద, లాంచీల మీద, యీ సరస్సులో విహరిస్తారు. 12,396 అడుగుల యెత్తుగల అగ్ని పర్వతము, "ఫుజియామ" ఇక్కడనుండి కనుపిస్తుంది.

అటామి:- సముద్రపు ఒడ్డునవున్న, విహార విరామ స్థలము, ఒక తంతి మార్గముద్వారా, 1000 అడుగుల యెత్తునవున్న కొండమీదికి పోవచ్చును. ఈ వూరికి దగ్గరలోనే, 26000 అడుగులు పొడవుగల కొండను తొలచిన "ఒసాకా" నగరానికి వెళ్ళే రైలుమార్గము వున్నది.

నగోయా - పాశ్చాత్య పద్ధతులను, పూర్తిగా జీర్ణముచేసికొన్న పట్టణం నగోయా. ఈ నగరము ప్రముఖ ప్రఖ్యాతి, పారిశ్రామిక వాణిజ్యకేంద్రము. ఈ నగరంలోనే సుందరమైన పాతకోటా, రేవుస్థలము ఉన్నాయి. మంచి జంతుప్రదర్శనశాల టెలివిజన్ ప్రసారకేంద్రము, పెద్దపురమందిరము, ఈ నగరములోని యితర ఆకర్షణలు.

"నారా".- ఎనిమిదవ శతాబ్దములో నారా జపానుకు, రాజధానిగా వుండేది. 1426 సంవత్సరములో, నిర్మించబడిన "కఫోకుజి" దేవాలయము చాలా అద్భుతమైనది అయిదు అంతస్తులలో 165 అడుగుల యెత్తున కర్రతో నిర్మించారు దీని గోపురాన్ని. దీపాలదేవాలయము అని పిలువబడే "కసాగా" దేవాలయములో 2000 పాతలోహదీపాలు ఉన్నాయి. 749 సంవత్సరములో, నిర్మించిన, బౌద్ధాలయము "తోడైజి" నారాలోనే ఉన్నది ఈ దేవాలయములో, 500 టన్నుల బరువు, 58 అడుగుల ఎత్తుగల, బుద్ధభగవానుని కంచువిగ్రహం ఉన్నది. ఇక్కడనే 18½ అడుగుల ఎత్తు, 9 అడుగుల వ్యాసముగల పెద్ద కంచు గంట వున్నది.

క్యోటో:- సూర్యారాధకుల, ముఖ్యస్థలమైన, ఈ నగరము, 1000 సంవత్సరాలకు పైగా, ప్రభుత్వ కేంద్రముగాను, నివాసముగాను వుండేది. 500 ఎకరాల స్థలములో నిర్మించబడిన, రాజప్రాసాదము ఉన్నది. జపాను ప్రభువుల పట్టాభిషేకములు, యీ భవంతిలోవున్న పట్టాభిషేక మండపములో,

జరుగుతాయి. ఇక్కడ యుద్ధధారణైన తరువాతనే, ప్రభువులు, ప్రస్తుత రాజధాని టోకియోనగరానికి వెళ్లుతారు.

క్యోటో రైల్వేస్టేషన్ దగ్గరనున్న "హిగాషి హోంగాంజ" దేవాలయం చాలా బాగా వుంటుంది. క్యోటో నగరములో ప్రాచీన సంప్రదాయాలు, పాశ్చాత్య ప్రభావాల దాడికి తట్టుకొని, ఈనాటికీ నిలిచి వున్నది. 500 దేవాలయాలతో "కుకుకుంజ" బంగారపు దేవాలయం, ఈనగరంలో వుంది.

ఒసాకా:—44 లక్షల ప్రజలతో వెన్నిస నగరానికి అనురూపముగా, నీటిదారులతో విరాజిల్లే రెండవ పెద్దనగరము. ఈ నగరము ప్రఖ్యాత వాణిజ్య కేంద్రము. ఇక్కడి రేవులోని ఎగుమతి దిగుమతులు, "యోకోహామా" (టోకియో) రేవులోకన్న చాలాయెక్కువ. బట్టలు, యంత్రాలు, ఎలక్ట్రిక్ సామానులు మొదలైన పరిశ్రమల కేంద్రము. వివోర, విలాసాలకు ప్రఖ్యాతి వహించి, యాత్రికులను ఆకర్షిస్తుంది.

టకారాజుకా —ఈ పట్టణము "కోబి" "ఒసాకా" పట్టణాల మధ్య వున్నది. ఇక్కడ 4000 మంది ప్రేక్షకులకు సావకాశము గలవిశాలమైన నాటకమందిర మున్నది. 800 మంది యువతులు ప్రదర్శనలు ఇస్తుంటే చూడడానికి, ఆహ్లాదకరముగా వుంటుంది. ఈ నాటకరంగములో యువతులే, పురుషుల పాత్రలను కూడా ధరిస్తారు.

కోబి:—ఈ నగరం వ్యాపారస్థలం. ఓడరేవు ఉన్నది. ఇక్కడనుంచి బెప్పుకు స్టీమరులో పోవచ్చును. ఈ పట్టణంలో 500 మంది భారతీయులున్నారు.

బెప్పు:—నిద్రాణమైన, అగ్నిపర్వతం పైన నిర్మింపబడిన నగరము యీ బెప్పు. ఈ నగర పరిసరాలలో అనేక ఉష్ణగుండాలు, వేడినీటి సహజ జలయంత్రాలు ఉన్నాయి. "టాస్మాకీ" అనే సహజ జలయంత్రములో వేడినీళ్లు, 60 అడుగుల యెత్తుకు ఆకాశములోకి ఎగురుతాయి. "బోగోజిగాకు" గంధక ఉష్ణగుండములో రాళ్ళను ఉడకబెట్టి, పంచులకు యెత్తడము చూచాను. ఎందుకు ఇలా చేస్తున్నారని అడిగితే, యీ ఉడకబెట్టిన రాళ్ళను గజ్జి, మొదలైన చర్మవ్యాధులకు మందుగా ఉపయోగిస్తారని చెప్పారు. ఉష్ణగుండాలలోని వేడినీటిని "హాకోని", "అటామి" పట్టణాలలో మాదిరిగానే నగరవాసులకు సరఫరా చేస్తారు.

మియాజిమా :—"ఇట్సుకుసు" దేవాలయము "మియాజిమా" వద్ద సముద్రములో తేలుతూ ఉంటుంది. రంగు రంగులతో అలంకరించబడిన యీ దేవాలయము, దాని ముఖద్వారం అత్యంత రమణీయముగా వుండి, చూపరులను ఆకర్షిస్తాయి. దేవాలయం అలలతో కొట్టుకు పోకుండా, బలమైన గొలుసులతో ఒడ్డుకు కట్టివేస్తారు.

"ఓటా" నదీతీరమందున్న హిరోషిమా నగరమే మొట్టమొదటి ఆటంబాంబుకి ఆహుతి అయినది. 1945 ఆగస్టు 6-వ తేదీన 4 లక్షల ప్రజలలోను, 2 65,000 మంది అమాయిక ప్రజల ఆయుర్భాగ్యాన్ని దోచుకున్నది.

ఈ నగరము మధ్యలో ఒక స్మారక చిహ్నము నిర్మించారు. నగరములో చాలా భాగాన్ని పునర్నిర్మించారు. కాని నగర మధ్యములో ఉన్న పారిశ్రామిక ప్రాంతములోని ఒక భవనాన్ని మాత్రము, అమెరికా ఆటంబాంబు చేసిన దుష్కృత్యమునకు చిహ్నముగా వదిలిపెట్టారు.

జపాను అంతా తిరిగి, మారిన తరువాత జపాను తన ప్రాచీన సంప్రదాయాలను జీవిత పద్ధతులను, తుడిచిపెట్టిన అమెరికన్ సంస్కృతి విరివిగా ము చేస్తున్న. అమెరికన్ వలసరాజ్యముగా రూపొందింది అన్న జాగృత్తాభావమున న్నా వేకించినవి. మన ప్రాచీన జాతీయ సంప్రదాయాలను, జీవిత పద్ధతులను, కాపాడుకోగలిగిన మన జాతీయతను, స్మరించి గర్వించాను. జపాను స్త్రీలలో మాదిరి, పాశ్చాత్య నాగరికత, మన దేశపు స్త్రీల జుట్టు,కట్టు,బొట్టు, సాంతంగా మార్చకుండ, ప్రాచీన సంప్రదాయాలను నిలబెట్టు తున్నందుకూ, భారత స్త్రీజాతిని, అభినందిస్తున్నాను. ★






# నక్షత్రఫలితాలు

**| 7-10-59 మొదలు 13-10-59 వరకు |**

ఈ వారము గ్రహస్థితి.

| | | | |
|---|---|---|---|
| శ | | | |
| | తే 9 దీని శుక్రుడు తులలో ప్రవేశించును. | | |
| | వృశ్చిక, ధనుర్మకర కుంభములలో చంద్రుడు. | | కు |
| కే | గు | బు | రకు రా |

## * అశ్విని [చూ, చే, చో, లా] *

ఈవారము ఎన్ని అవాంతరములు వచ్చినా పట్టుదలతో ప్రయత్నించి కార్యలాభం పొందుతారు. ఆశించిన ధనం సమయానికి అందక అప్పు చేస్తారు. ఆత్మీయులవల్ల నిందల పాలవుతారు. దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, భూస్వాములకు, ఇంజనీరింగుశాఖ ఉద్యోగస్తులకు, రంగులు, లోహపు సామానుల వ్యాపారస్తులకు కష్టముతో కూడిన లాభము. 8 న ప్రమాదభయం.

## * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము మీకు యోగప్రదము, బంధువుల సహాయముతోనూ, అధికారుల సహాయముతోను ఫలము పొందుతారు. ఆదాయము వృద్ధి అవుతుంది. వైద్యజ్యోతిషశాస్త్ర ప్రసంగాలు చేస్తారు. ఈశాన్యదిక్కునుండి క్షేమము తెలుస్తుంది. విద్యార్థులకు మంచి కాలము. కవులకు, శిల్పులకు, గణితశాస్త్రజ్ఞులకు, నటీనటులకు యోగకాలము, 10, 11, 12 తేదీలలో ధనలాభము, కార్యసిద్ధి.

## * కృత్తిక [అ, ఈ, ఊ, ఏ] *

ఈ వారము మీకు యోగదాయకముగా వుంటుంది. ఆశించిన సొమ్ము చేతికివస్తుంది. నూతనకార్యములు ప్రారంభిస్తారు. కోర్టు దావాలలో అనుకూలత వుంటుంది. పండిత గోష్ఠి జరిపి విషయాలు తెలుసుకుంటారు. వారమంతా శుభయోగము లున్నా కొంత ఆందోళనగా వుంటుంది. ధనలాభము. పుత్రుల అభివృద్ధి. కార్యసిద్ధి. 8 న అధిక ఖర్చులు. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలు కాలము.

## * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈ వారము వినోదాలలో పాల్గొనుట, దధి క్షీర మధుర పదార్థయుక్తభోజనము రజతపాత్రలలో భుజించుట, తలచిన కార్యములలో జయము, నీటిమీద ప్రయాణము, తెల్లని వస్త్రములు కొనుట మొదలగు యోగములు కలుగుతవి. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, బియ్యము, ద్రవపదార్థముల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము,

బి. నరసింగరావు

కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలు కాలము. వారాంతమున అధిక ఆందోళన.

## * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈ వారము ధనధాన్యాభివృద్ధి, పశువృద్ధి కృషిమూలముగా లాభము, వివాహాది శుభకార్యములలో పాల్గొనుట, ఇష్టవస్తులాభము, పరోపకారమువల్ల కీర్తివంటి రాజయోగములు కలుగును. విద్యార్థులు బాగా చదువుకుంటారు. విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు గట్టిలాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు నటీనటులకు యోగకాలము స్త్రీలతోనూ, పుత్రులతోనూ విందు వినోదము, 8 న కుటుంబ కలహము.

## * ఆర్ద్ర [కూ, ఖ, ఙ, ఛ] *

ఈ వారము మీకు రాబడి తక్కువ; కార్యభారము ఎక్కువ గృహావసరములు తీరక కలతలు. ఆరోగ్యము చెడుచున్న సూచనలు కనపడగానే ఔషధచికిత్స పొందవలయే కాకుండా గ్రహారాజైన రవికి శాంతి చేయించవలెను మేలు ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు. వర్తకులకు ఆందోళన. 10, 11, 12 పితృవర్గసహాయము. కార్యలాభము. ప్రయాణము, రాజకీయవాదులకు ఆందోళన, అధిక ఖర్చులు. 8 న అనారోగ్యము.

## * పునర్వసు [కే, కో, హా, హీ] *

ఈవారము మీకు మొదట్లో నిరాశగా వున్నా మిత్రసహాయమువల్ల కార్యలాభము పొందుతారు. ధనలోపమువల్ల ఆందోళన. ఉద్యోగస్తులకు బదిలీఅయ్యే సూచనలు. పుత్రుల ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. వారములో అవయోగములున్నా మిత్రసహాయము కార్యసిద్ధి, విదేశీయుల పరిచయము, విచిత్ర వస్తు సంపాదనవంటి శుభయోగములుకూడా వుంటాయి.

## * పుష్యమి [హూ, హే, హో, డా] *

ఈవారము మీకు మిశ్రమ యోగము. కార్యాచరణలో ఆటంకములు కలుగుతాయి. మీ బుద్ధిబలము ఉపయోగించి ప్రయత్నించినా కార్యసిద్ధివుండదు. చేతికి వచ్చే డబ్బు అవసరాలకు సరిపోక ఇబ్బందిచే అశాంతిగా వుంటుంది. దూరమందున్న ఆత్మీయులకు అనారోగ్యముగావుందని తెలిసి బాధపడతారు. అయిననూ దైవానుగ్రహముచే అన్నీ పరిష్కరించబడతాయని మనో ధైర్యముతో వుంటారు. ఉద్యోగస్తులకు అస్థిమితము. వర్తకులకు ఆందోళన, నిలకడలేని స్థితి, ప్రయాణము. 12 నష్టద్రవ్యలాభము. పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము. వింతలను చూచుట. 8 న ఆరోగ్యచింత.

## * ఆశ్లేష [డీ, డూ, డే, డో] *

ఈ వారము అనుకున్నట్లుగా డబ్బు చేతికి రాకపోవుటచేతను అధిక ఖర్చులచేతను అశాంతి కలుగుతుంది. కోర్టు వ్యవహారములు కొంతవరకూ అనుకూలిస్తవి ఉద్యోగస్తులకు అధికారులతొందరలు వర్తకులకు అశాంతి. భార్యకు ఆరోగ్యము బాగుండదు. వ్యవహారముల పరిష్కారములో దుష్టస్త్రీలతో వివాదము. 7 ధనలాభము. 8 న కార్యభారము, త్రిప్పట, వివాదములు, భార్యకు రోగ్య

### —ఈవారము ధరలు:—

నూలు, వస్త్రములు: నిలకడగావుండును
నూనెదినుసులు: స్వల్పముగా పెరుగును
ఆహారధాన్యములు. స్వల్పముగా పెరుగును
బెల్లము, పంచదార, చింతపండు: కొంచముగా హెచ్చును.
పప్పుదినుసులు :- నిలకడగా వుండును.
వెండి, బంగారము :- స్వల్ప తేడాలో వుండును. కొన్ని ప్రాంతములలో సువృష్టి కొన్ని ప్రాంతములలో మన్యవృష్టి

జన్మనక్షత్రమును బట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారివారి పేర్ల ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకోనువది. కృష్ణుడను పేరునకు మృగశిరానక్షత్రమును, హృష్ణుడను పేరునకు స్వాతియును, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలుడను పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయునూ చూచుకోనువది.




## ముస్తాబు ద్రవ్యముల చరిత్రలో ఇంతవరకు తయారుకాని క్రొంగ్రొత్త ఫేస్ పౌడర్లు!

**గోకుల్ శాంటోల్ టాయిలెట్ పౌడరు :**

శుద్ధమైన చందనపు చెక్కల పొడరుతో (మైక్రోనైజ్డ) చాల ఇంపైన టాల్కం చేర్చబడి, తయారుకాబడిన పౌడరు. మీ ముఖ కాంతిలో మెరుగు చూపుట, చెమటను అపుట, చాలకాలము వాసన యుండుట దీని ముఖ్య విశేషములు. చెమట పొక్కులను అపుచేయును.

**గోకుల్ శాండల్‌వుడ్ టాయిలెట్ పౌడరు :**

శుద్ధమైన చందనపు చెక్కలనుండి తయారుకాబడిన పౌడరు. ఫేస్ పౌడరులకు వలయునంత సున్నితము చేయబడినది.

**గోకుల్ బ్యూటీ పౌడరు :**

పరిశుభ్రమైన పసుపుకొమ్ముల నుండి తయారుకాబడిన పౌడరు. వివిధ ఛాయలలో గలవు. మీ ముఖవర్చస్సును పెంపొందించునట్టియు, క్రిమి సంహారక సంబంధమగునట్టియు గుణములు గలది. దీని సువాసన గంటలతరబడి నిలచియుండును.

## టి.యస్.ఆర్ & కో., కుంబకోణమ్

C. L. Mani

#  నక్షత్రఫలితాలు 

భంగము 12 వ కార్యసిద్ధి.

### * మఖ [మా, మీ, మూ, మే.] *

ఈవారము తలపెట్టిన పనుల మీద వేసుకొని కార్యసాధన అవసరపుటికి నిరుత్సాహపడక పట్టుదలతో ప్రయత్నించి నందుకు ఫలప్రాప్తి పొందుతారు. సోదరసహాయము కొంతఅనుకూలత కలిగిస్తుంది. ఉద్యోగస్తులకు అధికారుల చురుకుమాటలచే మనోవ్యథ కలుగుతుంది అవసరాలు తీరనందున ఇంట్లో అశాంతి, ప్రమాదమువల్ల గాయములు కలుగవచ్చును. రసాయనిక పదార్థములు, ఎరువుల వ్యాపారస్తులకు, గనుల యజమానులకు లాభము. 8 వ ప్రమాదసూచన. 9 వ కార్యభారము, ఆటంకములు. 10 వ సోదర సహాయము, కార్యలాభము.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### మో, టా, టీ, టూ

ఈవారము మీకు యోగదాయకము బంధుసహాయము అధికారుల సహాయము కలుగుటచేతను, ఆటంకములు గడిచి కార్యలాభము పొందుతారు. ఆదాయము వృద్ధి అవుతుంది. కవులు నూతనరచనలు చేస్తారు. బంధువుల క్షేమవార్త తెలిసి సంతోషిస్తారు. విద్యార్థులు వుత్సాహముగా కొత్తవిషయాలు నేర్చుకుంటారు గణితశాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, చిత్రకారులకు, నటీనటులకు మేలు కాలము.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### (టే, టో, పా, పీ)

ఈవారము మీకు మంచి భాగ్యయోగం, అనుకున్న డబ్బు చేతికివస్తుంది. ఇబ్బందులు తీరుతాయి. దావాలలో గెలుపుపొందుతారు. పిల్లల బాగుకోరకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. న్యాయస్థానవుద్యోగస్తులకు, న్యాయవాదులకు మేలుకాలము. పండితులకు, ఉపాధ్యాయులకు యోగము.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈవారము మీకు యోగదాయకము. ధనయోగం వుంటుంది. సంగీత సభలు, కవితా గోష్ఠివంటి వినోదాలలోపాల్గొని మృష్టాన్నభోజనము వెండిపాత్రలలో చేస్తారు. శుభకార్యాలలో పాల్గొంటారు. నూలు, బట్టలు, బియ్యము, వెండి వర్తకులకు లాభము. విద్యార్థులు ఉత్సాహముగా చదువుకుంటారు. కవులకు, గాయకులకు కళాకారులకు నటీనటులకు మేలుగా వుంటుంది

### * చిత్త [పే, పో, రా, రీ] *

ఈవారము యోగదాయకముగా వుంటుంది. అసంపూర్తిగా వుండిపోయిన పనులు లాభకరముగా ముగుస్తవి. శుభప్రదకార్యాలలో పాల్గొంటారు. నూతన గృహనిర్మాణమునకు ప్రయత్నిస్తారు ఉద్యోగస్తులకు హోదా పెరుగుతుంది. వర్తకులకు విలువగల వస్తువుల క్రయవిక్రయములలో ఎక్కువలాభము. వారమంత శుభయోగముతో కూడియున్నా కుటుంబకలహముచే ఆందోళన కలుగుతుంది. వారాంతమున మిత్రులతో విందు వినోదము.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈవారము రాబడితక్కువ. కార్యభారం ఎక్కువ గృహావసరములు తీరక స్పర్థలు వస్తవి అనారోగ్యసూచనలు కనపడగానే ఔషధచికిత్స పొందడము, రవికి శాంతి చేయడము మంచిది. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. వారమంత భయాందోళనలతో కూడివున్నా పితృవర్గము నుండి సహాయము, కార్యలాభము కలుగుతవి.

### * విశాఖ [తీ, తూ, తే, తో] *

ఈవారము మొదట్లో చింతగావున్నా మిత్రసహాయమువల్ల ఆందోళన తీరుతుంది. ఇంట్లోఉన్న వారి అనారోగ్యమువల్ల ఆందోళన కలుగుతుంది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత వర్తకులకు వారాంతమున లాభము. వారమంతా ఉద్రేకముతో వుంటుంది. విదేశీయుల పరిచయము, అపురూపవస్తుసంపాదనలు కలుగుతవి. 8 వ అధికఖర్చులు, మనోవ్యథ.

### * అనూరాధ [నా, నీ, నూ, నే] *

ఈవారము ఆశించిన సహాయము లభించక, అవసరములు తీరక, ఆందోళన కలుగుతుంది. అయినప్పటికీ దైవానుగ్రహమువల్ల కష్టములుగడిచి కార్యసిద్ధి పొందుతారు. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ. వర్తకులకు చాంచల్యము, పుణ్యపురుషుల సాంగత్యమువల్ల మనోవికాసము కలుగుతుంది. వారమంతా అశాంతిగావున్నా నవద్రవ్యలాభము పొందుతారు. 8 వ అధికఖర్చులు.

### * జ్యేష్ఠ [నో, యా, యీ, యూ,] *

ఈవారము అనుకూలతకన్నా ప్రతికూలత ఎక్కువ. ఇచ్చిపుచ్చుకు నేపట్ల వివాదములు వచ్చి మనోవ్యథ కలుగుతుంది. కోర్టు వ్యవహారములు అనుకూలించినా అమిత ఖర్చు

వల్ల ఆ సంతోషం వుండదు. భార్యకు అనారోగ్యంకలిగే సూచనలున్నవి. వినుములు, శొ(ర)లు, రాగులు, ఉప్పు, నువ్వు మొ నెవ్యాపారస్తులకు లాభయోగము. ఇతర జాతులవల్ల గౌరవము కలుగుతుంది 8 న బంధువులరాక, అధిక ఖర్చులు.

*** మూల [యే, యో, బా, బీ] ***

ఈవారము ఎంత ప్రయత్నించినా యత్నకార్యాలకు ఆటంకములు కలుగుతూనే వుంటాయి. అయినప్పటికీ పట్టుదలవల్ల కార్యలాభము పొందుతారు. సోదర సహాయమువల్ల ఒడిదుడుకులు సర్దుకుంటాయి దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనులయజమానులకు, లోహ, ఖనిజ, వ్యాపారస్తులకు, భూస్వాములకు కష్టముతో కూడిన లాభము. పోలీసుశాఖ ఉద్యోగులకు మేలుకాలము. 10 న ప్రయాణము.

***పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢా]***

ఈవారము మీకు యోగదాయకము. ప్రయత్నించిన పనులు నెరవేరుతవి. లాభము కలుగుతుంది. ఈశాన్య దిక్కునుండి క్షేమ సమాచారము తెలుస్తుంది. శుభకార్యములలో పాల్గొంటారు. బంధుదర్శనము గణితజ్యోతిష శాస్త్ర చర్చలు జరుగుతాయి. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, ఇత్తడి, కంచువర్తకులకు లాభము. కవులకు శిల్పులకు, నటీనటులకు మేలుకాలము. 8 న అధిక ఖర్చులు.

***ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]***

ఈవారము మీకు శుభయోగము. ఆశించిన డబ్బు చేతికి వస్తుంది. ఇంట్లో శుభకార్యాలు జరుగుతవి. పుణ్యకార్యాచరణ, ప్రభుత్వ సన్మానము, వైద్యజ్యోతిషశాస్త్రముల వంటి ప్రసంగాలు జరుగుతవి. విద్యార్థులు నూతనాంశాలు నేర్చుకుంటారు. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు పండితులకు, ఉపాధ్యాయులకు మేలుగావున్నా కొంత ఆందోళనకూడా వుంటుంది. పిల్లల అభివృద్ధికి కొన్ని ఏర్పాట్లు చేస్తారు.

*** శ్రవణము [జూ, జే, జో, ఘా] ***

ఈవారము మీరు తలపెటిన కార్యములలో జయము పొందుతారు. వెండిపాత్రలలో మృష్టాన్నభోజనము. బంధుమిత్రులతో చేస్తారు. వినోదములలో పాల్గొంటారు. విద్యార్థులకు చదువు వుత్సాహముగా సాగుతుంది. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, బియ్యము, ద్రవపదార్థజనిత వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, నటీనటులకు మేలుకాలము, 8 న అధిక ఖర్చులు.

*** ధనిష్ఠ [గా, గీ, గూ, గే] ***

ఈవారము మీకు యోగప్రదము. ధనధాన్యవృద్ధి కలుగుతుంది. వివాహాది శుభకార్యాలలో పాల్గొంటారు. ఇష్ట వస్తులాభము, పరోపకారమువల్ల కీర్తి కలుగుతుంది. విద్యార్థులకు చాలా చురుకుగా చదువు సాగుతుంది. ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులు అమిత లాభము పొందుతారు వాహన యోగము కలుగును. కవులకు గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 8 తేదీని కుటుంబ కలహము.

***శతభిషం [గో, సా, సీ, సూ]***

ఈవారము మీకు కార్యభారము ఎక్కువ. వింతమాటలువినుట, పరాక్రమమువల్ల ఘనత, ప్రయాణము, ధనలాభము వుండును, అకాల భోజనమువల్ల అనారోగ్య సూచనలు కనపడగానే జాగ్రత్తపడుట మంచిది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత. విద్యార్థులకు సరిగా చదువుసాగదు. రాజకీయవాదులకు వారమంతా అలజడితోపాటు అనుకూలత. 8 న అనారోగ్యము.

*** పూర్వాభాద్ర [సే, సో, దా, దీ] ***

ఈ వారము తలపెటిన పనులు నెరవేరవు. ఆలశ్యము కలుగుతుంది. వర్తకులకు తక్కువ లాభము. ఆత్మీయుల ఆరోగ్యం చికాకు కలిగిస్తుంది. ఉద్యోగస్తులకు వనపర్వత ప్రాంతములకు బదిలీ అయే సూచనలున్నవి. రహస్యములను కనిపెట్టుటకు నియోగించబడుతారు. వారమంతా చికాకుగావున్నా వారాంతమున మిత్రసహాయము, విదేశీయుల పరిచయము, కార్యసిద్ధి.

***ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా]***

ఈ వారము ధనాభావము ఎక్కువ. ఎవరి సహాయమువల్ల కార్యసాధన చేదామనుకుంటారో వారివల్లనే ఆటంకములు కలుగుతవి. అయినను దైవబలంవల్ల క్రమేణా కార్యానుకూలత అవుతుంది. ఇంట్లోవారి ఆరోగ్యము బాగుండదు. ఉద్యోగస్తులకు ఒత్తిడి, వర్తకులను నిరాశ, విద్యార్థులకు మంచి రోజులు కావు. వారమంతా ఆందోళన వున్నా సాధు సజ్జన సాంగత్యము, పుణ్యపురుషులను కలియుట, పుణ్యక్షేత్ర సంచారము. వింతలను చూచుట, నష్ట ద్రవ్య లాభము కలుగుతవి.

*** రేవతి [దే, దో, చా, చీ] ***

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. యత్నకార్యములు శ్రమాధిక్యముతో ఫలిస్తాయి. కోరుదావాలు అనుకూలిస్తవి. పరోపకారము నకు యత్నపడి సాగక నిందలుపొందుతారు. భార్య ఆరోగ్యము సరిగాయుండదు. ఇచ్చిపుచ్చుకునే వట్ల వివాదములు, ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడి వున్నా తోటివారి సహకారము లభిస్తుంది వర్తకులకు వారమంతా నిరాశ. వారాంతమున మేలు. విద్యార్థులకు చదువు బాగా సాగదు. ★

## బాల సాహితి

# శీలవతి

కొసనం మహేశ్వరరావు

పూర్వకాలమున రత్నకూట మను ద్వీప మొకటి ఉండేది. ఆ ద్వీపాన్ని రత్నాధిపతి యను ఒక రాజు పరిపాలిస్తుండేవాడు. అతనికి సకలదేశ రాజులను జయించి వారి వారి కుమార్తెలను వివాహ మాడాలని, తనో మహాచక్రవర్తి అని పించుకోవాలన్న కోర్కె కలిగింది. ఆ కోర్కెను సఫలీకృతం చేసుకోవ డానికతడు యోచించి యోచించి చివరికి భగవంతునికై తపస్సుచేసి వరం పొందాలనుకొన్నాడు.

అతడు వైష్ణవుడు. విష్ణుదేవుని గూర్చి ఘోరతపస్సు చేశాడు. విష్ణువు అతని తపస్సునకు మెచ్చి ప్రత్యక్షమై 'ఓ రాజా; నీ తపస్సునకు మెచ్చాను. నీ మనస్సులోని కోర్కెకూడా నాకు అర్థమైంది. అందుకు ఒక ఉపాయం చెబుతాను. దాని ఆధారంగా నీ కోర్కె నెరవేర్చుకో. పూర్వం కళింగదేశము నేలు రాజొకడు శాపవశమున తెల్లని ఏనుగయినాడు. ఆ ఏనుగు పేరు శ్వేతరశ్మి. అతని పూర్వజన్మ సుకృతము, నా భక్తుడు గావడం వలన ఆ ఏనుగునకొక దివ్యశక్తి ఉన్నది. అది ఆకాశంలో ఎగురగలదు. అది చాలా ప్రభావంగలది. దానికి పూర్వజన్మల వివరంకూడా తెలుసును. ఇప్పుడా ఏనుగు నా ఆదేశము ననుసరించి ఇక్కడకు వస్తుంది. అది నీకు వాహనంగా ఉంటుంది. నీవు దానిపై ఎక్కి ఏఏ దేశాల మీాదుగా ప్రయాణం చేస్తావో ఆ దేశాల రాజులు నీకు వశమై తమ తమ కన్యలను నీకిచ్చి వివాహం చేయగలరు. అప్పుడు నీ కోర్కె సఫలీకృతం ఔతుంది. నీకు మొత్తం ఆ విధంగా ఎనభై వేలమంది భార్యలుగా లభించగలరు.' అని చెప్పి విష్ణుదేవుడు మాయమైనాడు.

రత్నాధిపతి ఆనందానికి మేర లేకపోయింది. ఆకాశంలో ఎగురుతూ శ్వేతరశ్మి రత్నాధిపతి వద్దకు వచ్చింది. అమితానందంతో రాజు దానిపై ఎక్కి దేశదేశాలు తిరిగాడు, అతను తిరిగిన దేశాల రాజులు తమ తమ కన్యలను రత్నాధిపతికిచ్చి వివాహంచేసి అతనికి వశవర్తులై ఉంటూ వస్తున్నారు. ఈ విధంగా రత్నాధిపతికి ఎనభై వేలమంది భార్యలైనారు. గొప్ప చక్రవర్తిగా ఎంతో గర్వంతో అతడుంటున్నాడు. అతనికోర్కె నెరవేరింది. ఎనభై వేల రాణులకు రమ్య హర్మ్యాలు కట్టించాడు.



"వాడిజోలికి పోవద్దని మీా కెన్నిసార్లు చెప్పాను?"

—చిత్రం: శ. సీతారామారావు-బందరు.

ఇలా ఉంటుండగా ఒకనాడు ఏం జరిగిందంటే రత్నాధిపతి శ్వేతరశ్మితో గగనమార్గాన విహరించు చుండగా ఒక పెద్ద గరుడపక్షి శ్వేతరశ్మిని తీవ్రంగా గాయపరిచింది. ఆ దెబ్బలకు అది తాళలేక తెలివితప్పి నేలపై పడిపోయింది.

రాజు పడిన బాధ ఇంతాఅంతని చెప్పలేము. ఎన్నెన్నో ఉపచారాలు చేశాడు. కొంతసేపటికి కాస్త తెలివి వచ్చిందిగాని పూర్వస్థితికి రాలేకపోయింది. ఆకాశంలో ఎగిరే శక్తిని పొందలేకపోయింది.

రాజు ఎంతో భయపడ్డాడు. అతని విచారానికంతులేదు. భగవంతుని ప్రార్థించాడు. 'భగవంతుడా, శ్వేతరశ్మికి పూర్వశక్తి వచ్చేట్లు చేయి తండ్రీ... లేనిచో నేను బ్రతుకలేను. శిరస్సు తెగవేసుకోవడంకన్న వేరే గత్యంతరం ఉండదు 'అని ఒరలోని కత్తిని దూసి కంఠముపై వేసుకోబోతున్నసమయంలో ఆకాశవాణి వినిపిస్తుంది. 'ఓ రాజా, శాంతించు, తొందరపడకు. ఆవేశంతో అనర్థానికి పాల్పడకు. దీనికొకటే ఉపాయం ఉంది. పతివ్రతఅయిన స్త్రీ శ్వేతరశ్మిని తాకిన అది పూర్వశక్తిని పొందగలదు. ఎప్పటివలెనే ఆకాశంలో ఎగురుతుంది. అంతకుతప్ప

వేరే మార్గం ఏమీ లేదు.'

ఈ మాటలు విన్న రాజు ఆనందానికి మేర లేకుండా పోయింది. అదెంత పని తనకు ఎనభై వేలమంది భార్యలుండగా. వారిలో అమృతలత అను భార్య రాజుకు చాలా ప్రియమైనది. వెంటనే ఆమెకు కబురంపించాడు. 'నీ కోమలకరాలతో ఒకసారి ఏనుగును తాకు.' రాజు ఆమెతో అన్నాడు.

రాణి అమృతలత రాజు చెప్పినట్లు చేసింది. కాని ప్రయోజనం ఏమీ కలుగలేదు. శ్వేతరశ్మిలో ఎలాంటి మార్పు రాలేదు.

రాజు మనస్సు వికలమైపోయింది. తన ప్రియమైనదనుకొన్న అమృతలతలో ఆకాశవాణి చెప్పిన పతివ్రతా గుణాలే లేవా? ఆమె పతివ్రత కాదా అని వాపోయాడు. ఆమె తనను నిజంగా ప్రేమించటం లేదా అన్న ఆశ్చర్యం కూడా కలిగింది. పరీక్షలో ఆమె పతివ్రతగా నిలవలేకపోయింది.

రాణివాసంలోని భార్యలందరినీ శ్వేతరశ్మిని తాకవలసిందిగా ఆజ్ఞాపించాడు రత్నాధిపతి. రాణులందరూ ఏనుగును తాకారుగాని ప్రయోజనం సున్న.

రాజుకు శిరస్సు తెగవేసినంత పనయింది. ఇంతమంది భార్యలలోనూ ఏ ఒకరూ పతివ్రతగా నిలవలేకపోయారు. అతనొక బికారిగా, దుర్భర దారిద్ర్యంతో బాధపడుతున్నట్లు బాధపడినాడు ఆ క్షణంలో. మనసా, వాచా, కర్మణా తనను ప్రేమించే భార్య ఒకరుంటే చాలు. ప్రేమించలేని వారు, ప్రేమ నివ్వలేని వారు ఎందరున్నా లేనట్లే అనుకొన్నాడు. తన తప్పుకు చాలా పశ్చాత్తాపం పొందాడు. గట్టిగా లెంపలు కూడా వేసుకొన్నాడు తన పొరపాటు గ్రహాదారానికి.

ఎంతో ఆలోచన చేసినమీదట ఈ అవకాశాన్ని దేశప్రజలకు ఇవ్వాలని సంకల్పించాడు. చివరికి ఈ విధంగా చాటింపు వేయించాడు. 'ఎవరైనా పతివ్రతాస్త్రీ శ్వేతరశ్మిని తాకి దానికి పూర్వశక్తి పొందగలిగేదిగా చేసినచో వారు రాజుగారిచే గొప్పగా సన్మానింపబడెదరు.'

రాజుగారి చాటింపు విన్న స్త్రీలకు సన్మానము పొందాలన్న ఆశ ఉన్నా నెగ్గలేకపోతే సిగ్గుతో చావవలసి వస్తుందని భయపడి ఎవరూ ముందుకు రాలేదు. ఇలా కాదని ప్రతిస్త్రీని బలవంతంగా తీసుకొచ్చి శ్వేతరశ్మికి తాకిస్తున్నారు. అందువల్ల కూడా ఏమీ ప్రయోజనం లేకపోయింది.

ఇలా చాలా రోజులు గడిచిపోయింది. రాజు చాలా నిరాశ చెందాడు. ఇంతలో ఒకనాడు తామ్రలిప్తదేశపు హర్షగుప్తుడను వ్యాపారస్థుడు రత్నకూటమునకు వచ్చాడు. అతనివెంట అతని నౌకరు కూడా వచ్చాడు. నౌకరు భార్య శీలవతి కూడా వారితో వచ్చింది. వారికి శ్వేతరశ్మి విషయం తెలిసి అక్కడకు వెళ్లారు. వీళ్ళక్కడకు, రావడం గాలిలా పాకిపోయింది వార్త. పట్టణప్రజలందరూ తండోపతండాలుగా వచ్చారు. ఇసుక వేస్తే రాలని జనం. ఆతృతతో శీలవతి వైపే అందరూ చూస్తున్నారు.

శీలవతి ముందుకువచ్చి అన్నది 'నేను తామ్రలిప్త నివాసిని శీలవతిని. నేను శ్వేతరశ్మిని తాకబోవుచున్నాను. మనసా, వాచా, కర్మణా నా పతిదేవుని నేను ప్రేమిస్తున్నట్లయితే, నేను పతివ్రతనయితే శ్వేతరశ్మి నా కరచాలనంతో పూర్వశక్తిని పొందుతుంది.' జనసందోహం ఊపిరి పీల్చకుండా రెప్పవేయకుండా చూస్తున్నారు. శీలవతి కుడిహస్తంతో శ్వేతరశ్మిని తాకిందేతడవుగా అది లేచి నిలబడింది. శ్వేతరశ్మికి పూర్వశక్తి తిరిగి వచ్చేసింది. రత్నాధిపతి ఆనందానికి హద్దు లేకుండాపోయింది. అద్భుత వాహనం తిరిగి లభించింది. వాడిన మనస్సు వికసించింది; పునరుజ్జీవనం పొందింది. ఎనభై వేలమంది రాణులు, రత్నకూట స్త్రీ—పురుషులు చాలా సిగ్గుపడిపోయారు. ఒక విదేశస్త్రీకున్న పతివ్రతా లక్షణాలు తమలో లేకపోయినవేమ ఎంతో బాధపడినారు. రత్నకూట పురుషులందరూ తమ భార్యలకు పతివ్రతాగుణాలు లేవు గదా తామ కడుదరిద్రులన్నంత బాధపడిపోయారు.

రత్నకూటవాసులు, రాజు శీలవతిని రత్న, సువర్ణాదులతో గొప్పగా సత్కరించారు. ఆమె పాతివ్రత్యాన్ని ఎంతగానో కొనియాడారు. ఎంతో ఆనందంతో శీలవ హర్షగుప్తుడు, సేవకుడు రత్న సువర్ణాలను పడవల కెక్కించుకొ తామ్రలిప్తకు ప్రయాణమైనారు.

ఒకామె : "నాదగ్గరికి ముందు రాకుండా నరాసరి మా అమ్మాయిదగ్గరికి వెళ్లి పెళ్లిచేసుకుంటానని చెబుతావా? ఎంత సాహసం!"

అతను : "క్షమించాలి, నేను తమకు ఈడు కాదు కదండీ!"



# దురాశ



అనగనగా ఒకఊళ్లో ఒక శాస్త్రులు గారుండేవాడు. ఆయనకు లేక లేక ఒక పుత్రుడు కలిగాడు. తన పౌరోహిత్యంపై వచ్చిన నాలుగు రాళ్ళకు తోడు రాజుగారిచ్చిన మాన్యం మడి వుండడంవల్ల జీవితాన్ని నిశ్చింతగా కాలం గడుపుతూండేవాడు.

ఆ సంవత్సరం పంటలు బాగా పండడంవల్ల, చేను కోయించి కళ్లంలో కుప్ప వేయించి, తనే రోజూ రాత్రిపూట కాపలా వుండేవాడు. ఇలావుండగా ఒకనాడు శాస్త్రులు గారు తనభార్యని దిబ్బరొట్టె మూట కట్టి ఆ రాత్రి కిమ్మన్నాడు. ఆమె సరేనని బాగా పదనుగా కాలేటట్లు ఒక రొట్టెను కాల్చి మూటకట్టి యిచ్చింది. ఆరాత్రి శాస్త్రిగారు తనకు రాబోయే అధికాదాయాన్ని ఎలా ఖర్చు చేయడమా అని ఆలోచిస్తూ కూర్చుండి, చివరికి నిద్రపోయేడు.

ఆరాత్రి ఆకసమందు స్వేచ్ఛావిహారం చేస్తున్న పార్వతీ పరమేశ్వరుల కారొట్టె వాసన బాగా

కె. కామేశ్వరరావ్

కొట్టింది. పార్వతికి నోరూరింది. తనెప్పుడూ బహుశా యిటువంటి రొట్టెను చేసివుండలేదు కాబోలు! ఉండబట్టలేక, శివుని ఒప్పించి ఆ రొట్టెను తీసుకుని, ఊరికనే వదిలేస్తే బాగుండదని అందులో ఒక మంత్రపు బంగారుగిన్నె నుంచి వెళ్లిపోయింది పార్వతి. అది చాలా విచిత్రమైన గిన్నె! అది బోర్లించి యెత్తేసరికి పంచభక్ష్య పరమాన్నాలు వస్తయ్!!

యథాప్రకారం శాస్త్రులుగారు ఉదయాన్నే లేచి, ఆకలిగా ఉండటం వల్ల, రొట్టెను తినబోయేడు. కాని విప్పి చూసేసరికి బంగరుగిన్నె కన్పించింది. దానితో ఆయనకు ఎక్కడలేని ఆశ కలిగింది. పోయినరొట్టె పోతే పోయిందిగాని, పదారువన్నె బంగారుగిన్నె దొరికిందని సంతోషించేడు. గిన్నె నెత్తేసరికి పంచభక్ష్య పరమాన్నాలు సిద్ధమైనై. ఆనందంతో ఆరగించి శాస్త్రులు ఆత్రంతో యింటికివచ్చి, భార్యతో యీ సంగతి జెప్పాడు. దాంతో ఆమె పొంగిపోయి, అదంతా తన భర్త తెలివేననుకొని తెగ పొగిడేసింది.

తన ప్రతిభను వూరివారికి చూపాలని తలచి, వూరి వారందరినీ భోజనానికి పిలిచేడు. మధ్యాహ్నం పన్నెండుగంటలైనా శాస్త్రిగారి భార్య హాయిగా బాతాఖానీ కొట్టడం జూసి, వూరి వారంతా ఆశ్చర్యపోయారు. తమ కా రోజు వుపవాసం తప్పదనుకున్నారు. కాని శాస్త్రిగారు దేవతార్చనాది క్రియలు ముగించి యింటింటికి వెళ్ళి అందరినీ భోజనానికి పిలిచేడు. అంతమందీ పీటలమీద కూర్చోగానే శాస్త్రి మందహాసవదనుడై గిన్నెను ఒక్కొక్కరి విస్తరిలోనే బోర్లిస్తూవచ్చేడు. దాని ఫలితాన్ని జూసి అంతా విస్తుపోయి శాస్త్రి ఘనతను తెగ పొగిడేరు!! చాలామంది తానెలా దాన్ని సంపాదించేడో చెప్పమని ప్రాధేయపడ్డారు—కాని శాస్త్రి వ్యతిరేకించాడు. కొందరు తమకు గిన్నె అమ్మేయమన్నారు—కాని శాస్త్రి వప్పుకోలేదు.

ఇంతలో శాస్త్రికి ఒక బ్రహ్మాండ

## మా పాప

రావి వినతాదేవి

ఓయమ్మ లాలమ్మ
దాయమ్మ మాయమ్మ
ఉయ్యాలలో పాప
నూరుకో బెట్టమ్మ.

ఏపూర్వ పుణ్యమో
ఎరుగనైతిని నేను
మాయింట వెలసింది
మహాలక్ష్మి మాతల్లి

మాపాప నవ్వులో
రతనాలురాలు
మా పాప పలుకులో
మధువుల్లజాలు.

నా చిట్టి పాపాయి
నడయాడు తుంటేను
కైలాస గిరి దేవి
కదలాడినట్లుండు.

గుమ్మడి మూటగా
కూర్చుండి పాపాయి
మాయింటి దీపమై
మమత వెలిగిస్తుంది.

మైన యుక్తి తట్టింది. తానింకో గిన్నెనుగాని సంపాదిస్తే, యీగిన్నె నమ్మేసి, ఆ పైకాన్ని పై ఖర్చులకు వినియోగించుకోవచ్చుననీ, తాను మరి పౌరోహిత్యం చేయక్కర్లేకుండా మహారాజులాంటి జీవితం గడపవచ్చుననీ ఆశ కలిగింది. వెంటనే భార్యను పిలిచి, ఆనాడు కూడ మళ్ళీ దిబ్బరొట్టెనే చేయమన్నాడు! ఆనాడుకూడ మళ్ళీ రొట్టెకడితే, యింకొక బంగారుగిన్నె దొరుకుతుందని ఆశ పడ్డాడు పాపం శాస్త్రి!! ఆశలో అతనికన్న ఒక ఆకు ఎక్కువే చదవిందవడంవల్ల క్రిందటిసారికన్న యీసారి బాగా నేయివేసి గుమగుమ లాడేటట్టు కాల్చి మూటకట్టి యిచ్చింది. నోరూరుతున్నా, పాపం! బంగారం వస్తుందన్న ఆశతో దాన్ని చూసి నాలిక చప్పరిస్తూ కూర్చున్నాడు శాస్త్రి!! చివరికి నిద్ర రావడంవల్ల పరుండిపోయాడు.

యథాప్రకారం విహారిస్తున్న శివ పార్వతులు మళ్ళా యీ రొట్టె వాసన కొట్టేసరికి, వీడెవడో కాస్త దురాశగలవాడని తలచి, రొట్టెకు బదులు అందులో ఒక బంగరుగిన్నె నుంచారు. ఉదయం లేచి చూచేసరికి శాస్త్రికి అందులో గిన్నె ఆకారం కన్పించింది. తన ప్రతిభని భార్యకి, తన వూరివారికి చూపాలన్న కోరికపై మూట విప్పకుండా యింటికి తెచ్చి, క్రిందటిసారిలాగే వూరివారి నందరినీ భోజనానికి పిలిచేడు. బాగా తిన్నవారైన ఆ వూరివారు నిజమేనని క్రిందటిమాటులాగే సకుటుంబంగా వచ్చారు. ఆకులు వేసి, మనుషులు పీటల మీద

(64-వ పేజీ చూడండి)

# ★ స్నేహం ★

(27 వ పేజీ తరువాయి)

త్వరత్వరగా వరండాలన్నీ దాటి తోటలోకి వచ్చాను. ఆ తోటదాటి, పెద్ద మామిడిచెట్ల క్రిందనుంచి పరుగులెత్తాను. విజిటర్సు రూమ్ కే చోటు చేరేసరికి ఆయాస పడుతున్నాను.

ఎంత గుంపులో వున్నా అతన్ని గుర్తు పడతానని ధైర్యం—గుర్తుపట్టలేనేమో నని బెరుకు—తెల్లగా పొడుగ్గా ఓ కోయన సూట్‌లో కూర్చుని వున్నాడు. అతనే! ఎంత చక్కని విగ్రహం. చీ చేతిలో నలుపుతూ "నమస్కారమండీ?" అన్నాను. అతను తెల్లబోయినట్లు కనబడి, చేతులు జోడించాడు. "ఎంతసేపైంది వచ్చి?" అతనింకా తెల్లబోయాడు. 'మీరు పొరబడుతున్నారు, మిస్' అన్నాడు ఇంగ్లీషులో. నేను ఒకడుగు వెనక్కి వేశాను. 'మాధవరావుగారు కారా?' అన్నాను.

'నేనండీ మాధవరావుని–సుమిత్ర గారూ! వెనక్కి తిరిగి చూశాను.'

సుమిత్ర ఆగిపోయింది. వసుంధర ఉత్సుకతని రేకెత్తించడానికని ఆగలేదామె. ఆ సన్నివేశాన్ని చెప్పలేక ఆగింది.

"ఎల్లా వున్నాడతను?" వసుంధర మృదువుగా అడిగింది.

"బాగుండలేదు వసూ, బాగుండలేదు. లోతుకుపోయి, ఎఱ్ఱబారి సన్నగా గీతల్లాగా వున్న అతని కళ్ళు, కళ్ళక్రింద నల్లని గుంటలు, స్ఫోటకం కావచ్చు. సన్నగా, బాగా నల్లగా, పొడుగ్గా వున్నాడతను. కరుకుగా వుంది అతని ముఖం. వికారంగా వుంది అతని ముక్కు–

అతని కళ్ళు–అవి చూసి బావురుమని ఏడవాలనిపించింది వసూ.

"నమస్కారమండీ" అన్నాడతను చిరునవ్వుతో. అతను నన్ను చూసి చాలా హర్షపులకితుడైనాడు. అతని ముఖంలో చూపుల్లో కనిపిస్తోంది ఆ విషయం స్పష్టంగా. నా పెదవులు సన్నగా కదిలాయి. నా చేతిలోని చీటీ క్రిందికి జారవిడిచి, సిమెంటు బంచీ వేపు చూశాను. మగతనంలో నే క్రిందడ్డి చూపించి 'ఇల్లా కూర్చోండి' అన్నాను అస్పష్టంగా. అతను జేబులోంచి రుమాలుతీసి తుడుచుకుని కూర్చున్నాడు. నేను చెప్పులు విడిచి కూర్చున్నాను. అతనివంక కళ్ళెత్తి చూడలేకపోతున్నాను.

"వచ్చేముందు వ్రాయలేదేం నాకు?" అతని కంఠం గంభీరంగా వుంది. ఏదో చనువు వినిపిస్తోంది ఆ స్వరంలో.

"వ్రాయలేదు—మీ ఇల్లు ఎంత దూరం ఇక్కడికి?"

"ఏమంత దూరం కాదు. అతను గడియారం చూసుకున్నాడు.

అతని చేతులపై బాగా నలుపు అరచేతిలోని తెలుపుకి కాంట్రాస్టుగా వుంది. వేళ్ళకణుపులు బండగా వున్నాయి.

'మీరు బైటికి రావచ్చునా యీ టైములో?' అన్నాడతను. నేను పరధ్యానంగా గడియారం చూసుకున్నాను. 'రావచ్చు... కానీ' అని ఆగిపోయాను. హాస్టల్లోకి వెళ్ళిపోవాలనిపిస్తోంది అప్పటికే.

'పదండి అలా వెడదాం ఎక్కడికైనా' అంటూ అతను లేచి నుంచున్నాడు. నేను కూడా లేచాను. బయట గేటుదగ్గర చిన్న కారు నిలబడివుంది. ముందుతలుపు తీసి ఎక్కండన్నాడు. వద్దు, వెనక కూర్చుంటానని అననివ్వలేదు నన్ను.... 'ఎక్కండి' అన్నాడు మళ్ళీ. యాంత్రికంగా ఎక్కాను.

నాకు గొంతులో ఏదో వేదనగా వుంది. శరీరమంతా నీరసంతో వ్రాలిపోతోంది. నరాలలోని పటుత్వం ఒక్కసారి సడలి, శక్తులన్నీ నీరసించి పోతున్నాయా అనిపించింది.

కారు బయలుదేరినప్పట్నుంచీ రోడ్డువంకే చూస్తూ కూర్చున్నాను నేను. ఇన్ని సంవత్సరాల తర్వాత మనం కలుసుకోవడం చాలా బావుంది నాకు. కాదూ? మీ వూరువచ్చి, మిమ్మల్ని చూసేద్దామని ఎన్నోసార్లు అనిపించినా ఎప్పుడూ కుదరలేదు అన్నాడతను. మధ్యమధ్యను హారన్ మ్రోగిస్తూ అతను కారు సున్నితంగా నడపడం మాత్రమే తెలుస్తోంది నాకు. మెత్తగా జారిపోతుంది సిమెంటు

# ★ స్నేహం ★

రోడ్డుమీద కారు. గాలికి నా ముంగురులు కదులుతున్నాయి. బజార్లన్నీ దాటి నిర్జనంగా వున్న రోడ్డుమీద పోతోంది కారు.

'మనం ఏమేమి ముఖ్యమైన ప్రదేశాలు దాటివచ్చామో తెలుసా? న్యూ మార్కెట్టు హాస్పిటలు, హైకోర్టు, కొంచెం దూరాన చార్ మినార్ - ఎప్పుడూ రాలేదా మీ రీవేపు? అన్నాడతను.

'లేదు.' అన్నాను నేను. మరికొంతసేపు నిశ్శబ్దంగా గడిచింది. ఎక్కడో పూరిబయటకు వెడుతున్నామని తెలుసు నాకు.

యూనివర్శిటీకి ఒక్కరూ వెళ్లడం అలవాటైందా? అన్నాడతను. తలూపాను. 'క్లాసులు జరుగుతున్నాయా?' అన్నాడు. తలూపాను.

పావుగంట తర్వాత బ్రిడ్జి, ఒక చిన్న తోట, పెద్ద చెరువువున్న ఒక ప్రదేశాన్ని చేరాము. బ్రిడ్జి దాటగానే కారు ఆపితలుపు తీశాడతను. కొన్ని మెట్లు క్రిందికిదిగి. అక్కడున్న తోటనిచేరాము. ఎదురుగా ఎన్నో గులాబీలు, చిన్న చిన్న మామిడిచెట్లు, అశోక వృక్షాలు. ఒక చెట్టుక్రింద కూర్చున్నాము.

'ఏమిటంత సైలెంట్ గా వున్నారు? మీకింత కోర్తి వుంటుందనుకోలేదు నేను— బాగుండలేదా యిటూ రావడం?' అన్నాడతను నేను ప్రయత్నపూర్వకంగా నవ్వాను. అబ్బే ఏం లేదు' అన్నాను. నా వూహకి, యీ యథార్థానికి సమన్వయపఱచుకుని, ఒక సంబంధం యేర్పఱచడానికి ప్రయత్నిస్తోంది నా మనస్సు. చెట్టుకి దొడిగిన మొగ్గ నేడో రేపో దివ్యసుందరకుసుమంగా వువ్వమై వికసిస్తుందని ఎదురుచూడగా చూడగా— ఆ మొగ్గ ఎండి రాలిపోయినట్లుంది నా పని.

'మీరు నన్ను గురించి ఏమనుకునేవారు?' ఎందుకింత వ్యక్తిగతమైన ప్రశ్న వేశానను కుంటూనే అడిగాను. అతను తేలిగ్గా నవ్వాడు. 'ఏమనుకునేవాడినా? ఏమో!... కానీ నేను చాలా 'ప్లీజ్' అయ్యాను మిమ్మల్ని చూసి. మిమ్మల్ని చూడగలిగినందుకు నన్ను నేను అభినందించుకున్నాను. మరి మీరు?'

నేను కొంచెం సిగ్గుపడి నవ్వాను. 'నేను కూడాను.' నా ముఖం నేను చెప్పిన మాట వింటుంది. కానీ నా హృదయం మాత్రం హాయిగా నవ్వలేదు. అతని ముఖం మాత్రం సంతోషంతో వికసించింది. యూనివర్శిటీ విషయాలు, లెక్చరర్లను గురించి, వూళ్లో సాహిత్య సంఘాలనుగురించి, నేను చూడవలసిన ప్రదేశాలనుగురించి చెప్పాడతను. అతని కంఠం శ్రావ్యంగా వినిపించడం మానేసింది కాస్సేపు గడచేసరికి. వాటిలోని వైముఖ్యం అతని కేమీ పట్టినట్లు కనుపించలేదు.

మాట్లాడుతున్నంతసేపూ నా కళ్ళు, నుదురు చూస్తున్నాడతను. తల వంచుకుని కూర్చున్న దాన్ని మళ్ళీ ఒకసారి నిజం చూసి తెల్సుకుందామన్నట్టు, కళ్ళెత్తి అతనివంక చూశాను. ఏమిటో! మార్దవం లేదు అతని కళ్లలో ఏ మెరుపులూ లేవు... నాకు నచ్చని భావాలేవో వున్నాయి. లోకంలోని విషయాలన్నీ తనకే కావాలన్న దురాశ కనిపిస్తోంది ఆ చూపులో. తన స్వంతమైన వస్తువు వంక చూసుకుంటున్న దర్పము కనిపిస్తోం. నేను తల వంచేసుకున్నాను.

చీకటిపడేలోపే తిరిగి వచ్చేశాము. 'రేపు యింటికి వెడదాము. వస్తారా?' అన్నాడతను హాస్టలు గేటుదగ్గర నేను మాట్లాడ లేదు. నాకు వెళ్లాలని లేదు. చికాకు కలుగుతోంది. అతను నాకు వ్రాసిన వుత్తరాలు, నేను అతనికి ఆప్యాయంగా వ్రాసిన వుత్తరాలు అందంగా తేలికైన పూలలా కనుపించాయి. మరుక్షణమే హోరుగాలి లేచి, పూలన్నీ అల్లా ఎగిరిపోయాయి దూరంగా.

'రేపా?' అన్నాను సందిగ్ధంగా.

'ఏం? ఆదివారమేగా! నాలుగింటికి వస్తాను. ఏం?' అన్నాడతను. లాలనగా వుంది అతని ప్రశ్న. నేను తప్పకోనిదీ వీల్లేదన్నట్లుంది అతని వాలకం.

'ఊ' అన్నాను. 'గుడ్ నైట్' అని కారెక్కి తలుపు వేసుకున్నాడు. కారు బయలుదేరి వెళ్ళేవరకు అల్లాగే నుంచున్నాను నేను. హాస్టల్లోకి వస్తుంటే—ఆ పెద్ద మామిడిచెట్లక్రిందనుంచి, గుడ్డిగా వెలిగే దీపాలక్రిందనుంచి వస్తుంటే— నాకు కలలోంచి మేలుకుంటున్నట్లనిపించింది. హఠాత్తుగా ఒక దరిదాపు లేని ఎడారిలో పడవేసినట్లుంది నా పరిస్థితి. ఆ రాత్రి - ఎంతసేపో కరువుతీరా నిశ్శబ్దంగా ఏడ్చాను నాకు కలిగిన నిరాశ, బాధ తగ్గిపోయాయి.

మర్నాడు ఏమీ చేయలేదు. మధ్యాహ్నం నుంచి నాకు మళ్ళీ ఆరాటం ప్రారంభమైంది. ఏమిటి నాకతనితో సంబంధం? ఎందుకు నేను వాళ్ళింటికివెళ్ళాలి? అనిపించింది. మూడున్నరైనా నేను లేచి తయారుకాలేదు. నాలుగు కావస్తున్నకొద్దీ నాకు నీరసం ఎక్కువైంది. ఏమిచేసేందుకు ఓపిక లేకుండా అశక్తురాలినవలెపడుకున్నాను. ఆయా చీటీ పట్టుకువచ్చింది. నేను బద్ధకంగా లేచి చీటీ వెనకాల వ్రాశాను. 'ఒంట్లో బాగులేదు, క్షమించండి. రాలేను' అని. మరి పావుగంటకి మళ్ళీవచ్చింది ఆయా. మళ్ళీ ఎప్పుడు కలవమంటారు? అన్నప్రశ్న పట్టుకుని. నేనే ఉత్తరం వ్రాస్తానని సమాధానం వ్రాసి పంపాను. నిర్వికారమైన మనస్సుతో నిద్రపోయాను ఆరాత్రి. వారంరోజులవరకు ఏమీ వ్రాయలేదు నేను.

ఊళ్ళోనే మరోకాలేజీలో పనిచేసే అతను, ఒకమధ్యాహ్నం యూనివర్శిటీలో కనిపించాడు నాకు. నన్ను చూస్తూనే అతని ముఖం నవ్వుతో వికసించింది. 'హల్లో— బాగున్నారా?' అన్నాడు. నేను తలూపాను. 'ఏం, యిల్లా వచ్చారు?' అన్నాను.

'మిమ్మల్ని చూద్దామని'— న్నాడు. 'అబ్బే. మా తమ్ముడికి ఫీజుకట్టాలనివచ్చా... బి. ఎస్ సి లో వున్నాడు—వ్రాస్తానన్నారు వ్రాయలేదేం?' అన్నాడతను—మళ్ళీ.

'మొన్న మంగళవారం వ్రాశాను. అందలేదా?'

'లేదే! ఏమని వ్రాశారు!' అన్నాడతను.

'ఇవాళ్ళ నన్ను చూడ్డానికి రమ్మని వ్రాశాను' అప్రయత్నంగా అబద్ధాలు. పిరికిగా తప్పించుకోవడానికని అబద్ధాలు కానీ— మనస్సు వీటిని అంగీకరిస్తోంది. ఇతనిపట్ల నీకు బాధ్యతఏమిటి అని సమర్థించుకో చూస్తోంది. నువ్వెందుకు సంజాయిషీ చెప్పుకోవాలని ఎదురు తిరిగి ప్రశ్నిస్తోంది హృదయం.

'అరె. సారీ, సాయంత్రం కాలేజీలో ఒకమీటింగువున్నది. మీకు ప్రాక్టికల్సు రెండింటికి కదా? అలావూళ్ళోకివెళ్లి కాఫీ త్రాగేసివద్దాం రండి' అన్నాడతను. దూరాన అతనికారు నిలబెట్టివుంది. మెట్లు దిగబోతూ ఆగాను నేను......అడ్డంగా తలూపాను. 'వద్దు' అన్నాను. కానీ— అతనితోపాటు మెట్లుదిగి క్రిందకివచ్చాను. అతను ఆశ్చర్యపోయాడు ముందు. 'ఏం' అన్నాడు సందేహంగా. అతని ప్రశ్న అంత చొరవగా లేదు. 'ఏంలేదు, వద్దు' అన్నాను అతనివంక చూసి అతనికళ్లలో ఏమిటిది అన్న సంశయం వున్నదా అనిపించింది నాకు.

'నేను వెడతాను మరి. తలనొప్పిగావుంది' అని నమస్కారంచేసి, వీలైనంతహాయిగా నవ్వి, వెనక్కితిరిగి మెట్లుఎక్కి కాలేజీలోకి వెళ్లిపోయాను. అతను ఒక్కనిముషంలో కారు స్టార్టుచేసి వెళ్లిపోయాడు......'

సుమిత్ర కంఠం రుద్ధమైంది.

"చీకటిపడుతోంది లే" అన్నది వసుంధర. సుమిత్ర కదల్లేదు.

..."తర్వాత వారంరోజులకి ఏదో వూరు వెడుతున్నానని, నెలవరకు రాలేనని ఉత్తరం వ్రాశాడతను. నెలరోజుల తర్వాతే వ్రాయమన్నాడు నన్ను. ఈలోగా నాకేదయినా సహాయము అవసరముంటే వాళ్ళ తమ్ముడికి చెప్పమన్నాడు నన్ను ఫోన్లో.

నెలదాటినా నేను అతనికి వ్రాయలేదు. ఆ తర్వాత అతనొక్కసారి వచ్చాడుట హాస్టలుకి నేను లేనప్పుడు. వచ్చి వెళ్లాడని

తెలిసికూడా నేను ఏమిటో సంగతి కనుక్కో లేదు. వసూ, నేను చేసుకున్న వూహలన్నీ కల్లలై పోయాయన్న బాధ ఒక్కటే కాదు నాకు — తానంత వికారంగా వున్నట్లుకూడ అతనికి తెలియదా అనికూడా నాకే బాధ. ఏమిటో కసిగా నా ఆలోచనల్లోంచి అతన్ని తొలగించుకోవడానికి ప్రయత్నించాను. అన్నీ మర్చిపోవడానికి యత్నించాను. అటు యిటు ఆనందంతో చూడవలసిన విశేషాలేమీ లేనట్లుగా సూటిగా సాఫీయైన రోడ్డుమీద నడకలాగా అయింది జీవితం. ఏవో అందమైనవిషయాలు యింకా ముందు ముందు చూస్తానన్న ఉత్సాహం లేదు ఆగమనంలో. నన్నలముకొనిన నిరాశ, హతాశ మెల్లిగా విడిపోసాగాయి.

మొదటి టరమ్ సెలవులకి నేను యింటికి బయలుదేరాను. రైలు సికిందరాబాదు చేరింది. బయటకు తలవుంచి, స్టేషనులోకి చూడసాగాను. బిస్కట్ల బండీవాణ్ని పిలచి ఒక పాకెట్టు కొన్నాను. రైలు బయలుదేరే వేళైంది. దూరాన్నుంచి జనం పరుగులు పెడుతూ రైలువేపుకి వస్తున్నారు. ప్లాటుఫారం మీదకి చూశాను. చటుక్కున — అతను కనబడ్డాడు. పుస్తకాల షాపుదగ్గర నిల్చుని ఏదో మేగజీను తిరగవేస్తున్నాడు. అతను తలెత్తిచూశాడు కొద్ది క్షణాల తర్వాత. నన్ను చూడగానే అతని ముఖం ఒక్కసారిగా వికసించింది. నా హృదయం ఝల్లుమన్నది — భయంతో, చీకాకుతో ముడుచుకుపోయింది మనస్సు. నా ముఖంలో నవ్వు రాలేదు. ఎందుకితనితో నేనీ పరిచయాన్ని పొడిగించడం? మనస్సు నిగ్గబట్టుకుని నేను ముఖం ప్రక్కకు తిప్పుకున్నాను.

రైలు కూతపెట్టింది. ఒక్కసారి తలత్రిప్పి అతనేమి చేస్తున్నాడో అని చూశాను నేను. పదిగజాల దూరంలోనే ఉన్నాడతను. అతని కళ్ళు మెరుస్తున్నాయా అనిపించింది. అర్ద్రంగా మిణుకు మిణుకు మంటున్నాయి ఆ కళ్లు — బాధాకరమైన ఒక సత్యాన్ని కనుక్కొని, తీవ్రవేదన పొందుతున్నట్లుందేమో ఆ చూపు అని యిప్పుడనిపిస్తుంది నాకు.

అతనితో ఉత్తర ప్రత్యుత్తరాలు నా ఇష్టం వచ్చినతీరున నడిపి, నన్ను గురించి, ఏవో ఆశలు కల్పించుకోనిచ్చి — ఆ స్నేహాన్ని నా ఇష్టం వచ్చినట్లు త్రెంపివేసే అధికారం నా కెవరిచ్చారు? 'నీతో స్నేహం నాకిపుడు బాగుండలేదు. పో' అని విసరికొట్టేహక్కు నాకులేదు. వసూ, అవన్నీ ఇప్పుడనుకుంటాను. ఆ ప్లాటుఫారంమీద అతనితో నవ్వు



చిత్రం: జె. సత్యనారాయణ-బిలాస్‌పూర్.

తూ మాట్లాడితే నా సొమ్మేమి పోయింది? నా ఘనత ఏమితగ్గింది? ఒక చిరుకాన్ని అవతలకి త్రోసిపారేసి, అది బాధతో గిలగిల లాడుతుంటే, నాకేమీ పట్టనట్లు చూస్తూ ఊరుకున్నాను తోటి మానవుణ్ని అల్లాగే బాధించాను నేను...'

"తర్వాత ఎప్పుడు చూశావు అతన్ని మళ్లీ?" అన్నది వసుంధర. సుమిత్ర వసుంధర వళ్లో తలదాచుకుని బిగ్గరగా ఏడ్చింది. ఎంతసేపుగానో అపుకున్న దుఃఖం పొంగి పొర్లుకొచ్చింది.

"లేదు — అందుకే వసూ అన్నాను జీవితంలో ఎవరికైనా మరో వ్యక్తికి ఆనందం కలిగించే అవకాశం ఎప్పుడుగానీ రాదని. ఆవచ్చిన అవకాశాన్ని జారవిడుచుకోవడమేకాదు — అతి క్రూరంగా వేదనకలిగించి, వెనుతిరిగి సవరించుకోలేని అపచారం చేశాను నేను. ఎంతసేపూ నా ఆశలు తల్లక్రిందులవడం, నన్ను గురించిన ఆలోచనలే నాకు తోచాయిగాని — అతనిలో నే నేమి వూహాల రేకెత్తించాను, అతను నన్ను చూసి ఏమనుకున్నాడు. నేను ఆతృతగా అతన్ని చూడ్డానికి పరుగెత్తుకొనివచ్చి, నీవా అన్నట్లు చూసినప్పుడు అతనెంత అవమానభారంతో క్రుంగిపోయినాడు, — వసూ, నేను చేసినపని ఎంత తప్పు!" సుమిత్ర ఏడుస్తూనేవుంది. వసుంధర కొంచెం ఆగింది. "ఎందుకు సుమిత్రా ఆ యేడుపు? నువ్వేం చేశావని తప్పు? మళ్లీ ఎప్పుడు చూశావు అతన్ని?" అన్నది ఆమె సుమిత్ర తలనిమిరి.

సుమిత్ర మరొక్కసారి బిగ్గరగా ఏడ్చింది. "ఎప్పుడు చూస్తాను? నేను సెలవులంతా అతన్ని గురించి ఆలోచించలేదు. ఇక్కడికి తిరిగివచ్చిన మూడోనాడు పేపరులో పడింది — అతను రెండురోజులు జ్వరంతో తీసుకొని చనిపోయినట్లు ... వసూ, నేను నిజంగా పాపం చెయ్యలేదూ? ఆఖరుసారిగానైనా అతన్ని చిరునవ్వుతో పలుకరించి ఆ ఆనందాన్ని యిస్తే నిజంగా ఎంత మధురంగా వుండేవి అతని స్మృతులు? నన్ను అహోరాత్రాలు వెన్నాడే బాధ మాత్రమే మిగిలింది నాకు."

బాగా చీకటి పడేవరకు అల్లాగే కూర్చున్నారిద్దరూ. చుట్టూ ప్రకృతి అంతా కనులకు స్పష్టంగా కనిపించడం మానేసింది. అక్కడొకటీ, యిక్కడొకటీ పక్షులు ఆతృతగా అరుస్తూ, ఎగురుకుంటూ వెళ్లాయి.

"లే సుమిత్రా — లోపలికి పోదాంపద." అన్నది, వసుంధర. సుమిత్ర లేచి, కళ్లు తుడుచుకుంది, కొంగుతో. వసుంధర మీద ఆనుకొని రూము చేరింది ఆమె. రూములోకి వెళుతూనే మంచంమీద పడి వెక్కి వెక్కి ఏడ్చింది ఆమె.

అప్పుడుగానీ, ఆ తర్వాత ఎన్నో సార్లు దిగాలుగావుండే సాయంత్రాల్లోగానీ సుమిత్రఏడ్చినప్పుడు — వసుంధరకి ఏమని ఆమెను అనునయించాలో తోచలేదు.

భూమి త్రవ్వినకొద్దీ వూరుతుంది నీరు — ఎవరేమి చేయగలరు? ఎవరూ తీర్చలేని, ఎవరికివారు తీర్చుకోలేని వ్యథలు కొన్ని వుంటాయి. అవి అంతే. 



# వనితా లోకం



## శాస్త్రకారుల దృష్టిలో...

# ఇల్లూ - ఇల్లాలు

(ఇల్లు చూసి ఇల్లాలిని చూడమంటారు పెద్దలు. 'ఇంటికి దీపం ఇల్లాలే' నంటారు అనుభవజ్ఞులు.

సమాజానికి సాహిత్యం ప్రతిబింబం. కాని శాస్త్రం శాసనకర్త.

శాస్త్రరీత్యా స్త్రీ 'వంటఇంటి కుందేలు' కాదు. తన కుటుంబానికి ఆమె ఆర్థికమంత్రి, సర్వాధికారిణి.

ఆయావిషయాలు స్థాలీపులాకన్యాయంగా వివరించడం ఇక్కడ రచయిత ప్రయత్నం.)

పది సంవత్సరాలనాటి ముచ్చట. ఒక పల్లెటూరు. ఒక సామాన్య గృహస్థుని యిల్లు. చూడ ముద్దుగావుంది. సిమెంటు గచ్చులాగా అలికి వుంది ఆ పంచపాళీ. దానిమీద చక్కని ముగ్గులు. ఆ వరండా కొక యిల్లు మొత్తం మీద మూడు గదులు. వంటయింటిలో పహా. దణ్ణాలమీద ఉతికిన బట్టలు. ఎదురు బీరువాల్లో పుస్తకాలు. ఆ ముగ్గురి పిల్లల్లోనూ యిద్దరు శుభ్రంగా వున్నారు. మూడోది ఆడపిల్ల మాత్రం చీమిడి ఓడుతున్నది. ఈ తీయని పాటలో అదొక అపస్వరం. కారణం ఆపాడుం ముక్కు తండ్రి—జిడ్డుగారుతున్న ఘటం.

ఇల్లు అలా వుండడానికి కారణం ఆ యిల్లాలు అక్షరజ్ఞానం లేని పదహారణాల పల్లెపడుచు.

మరి యీ శుచీ, శుభ్రతా యిదంతా యెక్కడినించి అలవడిందీ? భోజన సమయంలో తన అత్తవారి యింటిని గురించి చెప్పాడు ఆ ఆసామీ, మాట సందర్భంగా.

ఆమె పుట్టినింటి సాంప్రదాయం అట్టిది. తల్లి, ముత్తవతల్లి ప్రసాదించిన సత్ప్రభావం అట్టిది.

"ఇల్లు చూసి యిల్లాలిని చూడు" అన్నారు.

అటువంటి యిళ్లు రానురాను కొరవ అయిపోతున్నాయి.

అంటే యిల్లాళ్లు కొదవ అవుతున్నారు.

* * *

### శతమతాలు

"న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి"—"స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః!"

స్త్రీకి చిన్ననాట తలిదండ్రులఆశ్రయం; యౌవనంలో భర్త ఆశ్రయం; పెత్తనంలో కుమారుల ఆశ్రయం. ఇంతేగాని ఆడదానికి స్వేచ్ఛకూడదు స్త్రీ అంటే శక్తి స్వరూపిణి. కొంపలు ఆర్పేస్తుంది. కైక మండోదరి,

**వారణాసి సుబ్రహ్మణ్యం**

శూర్పణఖ, ద్రౌపది... యీ మహాతల్లులేగా అడపాదడపా మానవజాతి మారణహోమం అవడానికి కారకులు.

ఇది ఒక మతం...!

స్త్రీకి పతిభక్తిని మించిందిలేదు. సీత, మండోదరి, దమయంతి, సావిత్రి ... అంతకన్న ఆదర్శం యేమిటి?

అని మరొక మతం!...

ఏమిటేమిటి? అన్ని అవాంతరాలకీ కారణం ఆడదా? పతిభక్తి తప్ప మరోధర్మం లేదా ఆడదానికి? అయితే మరి దేవతలేని దేవుడేడీ? శివుడు తన శరీరంలో సగాన్ని గిరిజకి అప్పనంపెట్టి అర్ధనారీశ్వరుడైనాడు. మహావిష్ణువు లక్ష్మీదేవిని వరాపరి గుండె మీదికే యెక్కించుకున్నాడు. బ్రహ్మదేవుడు సరేసరి! వాణి దయవల్లనే అసలు మాట పెకలింది గొంతులోనుంచి!!

ఇక వేదఋషుల్లో బ్రహ్మచారులు ఎందరండీ??

స్త్రీలకి విద్యాగంధం లేదా?

యాజ్ఞవల్క్యుడిభార్య యెంత తపస్విని! శీల, విద్య, మారుల, మోరిక, విజ్జలదేవి వంటివారు ప్రసిద్ధమైన పాండిత్యం చూపినవారు కాదా? మండనమిశ్రుడిభార్య ఉభయభారతి శంకరాచార్యుణ్ణి "నీకు సమస్త విద్యలూ, కళలూ, శాస్త్రాలూ, కొట్టిన పిండి కావచ్చుగాక. కాని, కామశాస్త్రం తెలియనిదే, స్త్రీ స్వరూపం గ్రహించనిదే నీజ్ఞానం సంపూర్ణం కాదు" అని సవాలు చేయగా, ఆయన నానా హైరాణాపడి, చివరికి కృతార్థుడు కావాల్సివచ్చింది.

అంటారు విషయం తెలిసినవారు.

వేదకాలంలో ఓ ఆవిడ ఏదో ఋక్కులు చెప్పిందనీ, - స్మృతికాలంలో మరో ఆవిడ శాస్త్రచర్చ చేసిందనీ - ఇతిహాసకాలంలో ఇంకో ఆవిడ యుద్ధంచేసిందనీ ... ఏమిటో వాద! ఉభయభారతి, సత్యభామసంగతి కాదు మనకు కావలసింది,

"అసలు స్త్రీకి, మన సంఘంలో శాస్త్ర రీత్యా ఎటువంటి స్థానముంది?"

అని మహిళాలోకపు ప్రశ్న (?)
—అతి సహజమైనదీ, సబబైనదీనూ యీ ప్రశ్న.

* * *

## శాస్త్రకారుల దృష్టిలో...

ఘోటకముఖుడు, గోనర్దీయుడు, వాత్స్యాయనుడు, బాభ్రవ్యుడు, వీరభద్రుడు, యశోధరుడు-వీరు శాస్త్రకారులు. స్త్రీ జీవితాన్ని గ్రహించి, అవసరాలు గుర్తించి, సంఘపరిస్థితుల్ని ఆకళించుకుని, జీవితాన్ని శాసించినవారు.

భర్త అంగీకారంతో, భార్య కుటుంబ విషయమంతటినీ ఆకళింపుచేసుకుని ఆబాధ్యతను తన స్వాధీనంలోకి తెచ్చుకోవాలంటోంది శాస్త్రం.

"తన్మతేన, కుటుంబచింతామాత్మని సంనివేశయేత్."

శాస్త్రరీత్యా, హిందూ స్త్రీ 'వంటయింటి కుందేలు' కాదు. తన యింటికి సర్వాధికారిణి. కుటుంబానికి వెన్నెముక. ఆమె బాధ్యతలు చూస్తే, అసలు యింటిలో తక్కినవారు నిర్వాహకం చేసేది మరేముందీ? అనిపిస్తుంది!

* * *

## "ఆర్థిక మంత్రి!"

తాళపు చెవులగుత్తి ఆమె కొంగున వుంటుంది.

"సాంవత్సరిక మాయం
సంఖ్యాయ తదనురూపం వ్య
యం కుర్యాత్ ॥"

వచ్చే సంవత్సరానికి మనకి రాగల రాబడి ఇదిగో ఇంత...అని అంచనా వేసి. అందుకు తగినట్లుగా ఖర్చు చేయాల్సిన బాధ్యత ఆమెదే నంటాడు వాత్స్యాయనుడు.
అంటే బడ్జెటు తయారింపు! ఇక భర్త విషయంలో ఆమె......

"అతివ్యయం, అసద్వ్య
యం వా కుర్వాణం, రహసిబోధయేత్"

ఆయన ఖర్చువిషయంలో మరిచేయి జారవిడుస్తున్నా, లేదా మంచీ చెడ్డా లేకుండా యివ్వకూడని వారికి డబ్బుయిస్తూ దండుగ చేస్తున్నా, భార్య... ఆ యీ విషయం... రహస్యంగా నచ్చచెప్పాలి! ఎందుకంటే నలుగురిలోనూ దులుపుతే నొచ్చుకుంటాడు గనక.

"ఎత్తెరిగి చెయ్యాలి కాపురం" అన్న మాట వుండనే వుంది.

పొదుపరితనం గురించి పత్రికల్లోనూ, ప్రసంగాల్లోనూ ఎంతో ఉద్బోధ జరుగుతోంది. ఈ క్రిందిది చదవండి.

## వగైరా వగైరా

"అచాము మంద తుషకణ కుట్యాంగా రాణా ముపయోజనమ్"

ఇది గోనర్దీయాచార్యుడిమాటలు. అంటే గంజి, మీగడ, ఊకలాటి ధాన్యపు పొట్టు, నూకలు, తవుడు, కట్టెకాలగా మిగిలిన బొగ్గు వీటి ఉపయోగం సంగతి యిల్లాలికి తెలియాలి. యశోధరుడు దీనిని తన వ్యాఖ్యలో యిలా వివరిస్తాడు. "గంజి, మీగడవంటివి దాసీల కోసం; మండ్లవంటివి దింపినప్పుడు వచ్చే ఊకలాటిది గోడల పూతకోసం; బియ్యపు నూక పెంపుడుకోళ్ళకీ; పావురాలకీ; తవుడు ఆవులకీ మేకలకీ, కాలినకట్టె బొగ్గు కమ్మరి పనికోసం."

భర్త కట్టగా, కట్టగా పాతవైన బట్టలు నౌకర్లకి యివ్వాలి. ఊరికే యివ్వడం కాదు. వాటిని తెల్లగా ఉతికించిగాని, లేదా రంగులలో అద్దించిగాని, మరీ యివ్వాలిసి! మరీ శిథిలంగా వుంటే, ఆపాత బట్టల్ని దీపాలకీ, కాగడాలకీ వత్తులుగా ఉపయోగించాలంటాడు యశోధరుడు.

ఇంటిలో పెట్టూ, పెంపూ, ఆతిథ్యం, ఆదరణా అంతా యిల్లాలిది. నౌకర్ల జీతభత్యాల విషయం తెలుసు, పనులకాపరి మొదలైనవారి బాగోగుల పరామర్శ; పెంపుడు జంతువుల ఆలనా, పాలనా; యిదంతా ఆకళింపుగా వుండాలి. ఇక రోజువారీ ఖర్చు విషయం తేరిజు వేసుకుంటూ వుండాలని కూడా వాత్స్యాయనుడు స్పష్టం చేస్తున్నాడు.

"భృత్యవేతన పరిజ్ఞానం, కృషి పశుపాలనచింతా వాహన విధాన యోగాః, మేషకుక్కుట లావక శారికా పరభృత మయూర వానర మృగాణా మవేక్షణం. దైవసికాయవ్యయ పిండీకరణమితి చ విద్యాత్ ॥"

వాత్స్యాయన కామసూత్రాలలో "భార్యాధికారాధికరణము" అన్నదాని నిండా యిల్లాలి విషయమై ఎంతో అమూల్యమైన విషయం ఉంది.

ఇల్లుగల అవిష, మట్టి, వెదురు, కొయ్య, తోలు, లోహమువంటి వాటితో తయారైన భాండాలను "సకాలంలో" సేకరించాలి. సకాలంలో ఎందుకంటే వాటిలో ఆయా సమయాల్లో దొరికే ఉప్పులు, నూనె, నెయ్యి, సుగంధద్రవ్యాలూ, మందులు పనికివచ్చే మూలికలవంటివి భద్రపరచడానికి.

పల్లేరు, గలిజేరు, ములకవంటి ఓషధుల్ని పెంచి, విత్తనాలు భద్రం చెయ్యమంటాడు.

## "హృద్య దర్శనం"

భార్య ముందటి వీధి యిల్లు "హృద్యదర్శనం" గా సర్దుతుంది. తగిన చోటుల, చక్కని పూలతో అలంకరింప మంటాడు. "నహ్యతోన్య ద్గృహస్థానాం చిత్త గ్రాహకం"— అంటాడు గోనర్దీయుడు. గృహస్థుకి చక్కగా అమర్చిన యింటికన్న మరేదిగాని ఆనందం యివ్వలేదు—అని.

ఇల్లు చక్కబెట్టుకునే విషయంలో గృహిణి అత్తమామలు, ఆడుబిడ్డలు, నౌకర్లు మొదలైనవారిపట్ల "యథార్హం ప్రతిపత్తిః"— తగు రీతిగా నడుచుకోవాలంటోంది శాస్త్రం. పైగా, పెద్దలందరినీ ఆమెకు వశమై వున్నవారుగా

ఎప్పుడూ ఇంతే—3. శంకర్



తెలుస్తోంది. ఖజానాపెట్టె ఆమె వద్ద వుంటాయి! అందుకని వశ్యులు! కాని అధికార గర్వం చూపెడుతుందేమోనని, తగురీతిగా నడుచుకోవాలంది శాస్త్రం.

“మనోహరంచ సుగుప్తంస్యాద్దర్శనీయంచ.” వంటయిల్లుదర్శనీయంగా వుండాలి. అందరికంటా పడనియ్యకుండా వుండాలి. ఎందుకంటే కొందరి కళ్లుపడితే పాలు విరిగిపోతాయి. మజ్జిగ పుల్లనవుతుంది. ఊరగాయలకి చద్ది వాసన సంక్రమిస్తుంది. ఏదో అయిపోతుంది మరి!! అందుకే “సుగుప్తంస్యాత్!”

సుశ్రుతాచార్యుడు వంటయిల్లు యెలా వుండాలో చేసిన యీ వివరణ చదవండి.

“భోక్తారం విజనే, రమ్యే, నిస్సంపాతే, శుభే శుచే,
సుగంధి పుష్పరచితే, సమేదేశే ఽథ
భోజయేత్ !!”

భోజనశాల విశాలంగా వుండాలి. మనుష్యుల తొక్కిడి లేకుండా, యెత్తుపల్లాలు లేకుండా వుండాలి. పూవుల సౌరభం గుబాళిస్తూ వుండాలి.

## “ఇల్లాలి స్వేచ్ఛ”

స్త్రీ, మనశాస్త్రం ప్రకారం ‘వంటయింటి కుందేలు’ కాదన్నాను.

“నాయక మిత్రాణాంచ స్రగనులేపన తాంబూలదానైః పూజనః న్యాయతః”

భర్త ఆప్తులూ, మిత్రులూ వస్తే, వారికి కావలసినవన్నీ న్యాయంగా కనుక్కోవాలి. న్యాయమంటే? భర్త అంగీకారంతోనని. ఎందుకూ అంటే,—అలా కాకుండా స్వతంత్రిస్తే స్ఫురించే అపార్థం, దాపురించే అనర్థం గురించి కొందరు కథలు కూడా వ్రాస్తూనే వున్నారు.

ఇంతేగాదు. భర్త అంగీకారంలో సర్వక్రీడలలోనూ ఆటపాటలలోనూ భార్య పాల్గొనవచ్చు—తగు రీతిగా అంటే ఆయనతోసహా. అటువంటి క్రీడలు రమారమి యిరవై వరకూ వివరిస్తోంది మన శాస్త్రం. వీటిలో కొన్ని:—

## “సుఖరాత్రి”

కార్తిక అమావాస్యనాడు “యక్షకౌముది” యక్షుల్ని పూజిస్తారు. ఆ రాత్రి విలాసంగా [illegible]పాలిట. దీనికే సుఖరాత్రి అని మరొక [illegible]ట. అంత ఖులాసాగా గడిపేవారు [illegible]లు! ఆశ్వయుజ పున్నమినాటి వెండి [illegible]సిన వెన్నెలలో ఆట, పాట, మంది[illegible]నం, ఊయల వూగడం మొదలైన సరదా వుంది. దీనిని “కౌముదీ జాగరము” అన్నారు.

వసంతమాసంలో యెండ తెగకుండా సాగే సంగీత సాహిత్య కాలక్షేపానికి “సువసంతకం” అని పేరు. పిచికారీలతో రంగు రంగుల సువాసననీరు కలిపి జల్లుకోవడం, బూరుగచెట్టుకింద వెన్నెలలో ఆడడం, కాసిన మామిడి చెట్టుని యెక్కకుండా, ముట్టకుండా, యెగురుతూ అందినన్ని కాయలు నోటితో కొరుకుతూ కోసుకు తినడం, కడిమి పూలతో రకరకాల ఆయుధాలు చేసి యుద్ధం చేసినట్లుపాడుకుంటూ ఆడడం...యిలాటివి.

ఇంతదేనికి? “వైహారికము” అంటూ వేషం వుంది. అంటే విహారానికి వెళ్లేటప్పుడు కులస్త్రీ వేసుకోవలసిన వేషం. కన్నెత్తి కాకుండా వుండాలి. తేలికపాటి వస్త్రాలూ, మరీ గుప్పుమనని సుగంధపూత తగు మాత్రంగా నగలూ, కొద్దిగా పూలూ... యిదీ వైహారిక వేషం. ఎందుకంటే వెడుతున్నది నలుగురిలోకి, భర్తతో సహా. ఆడంబరమైన వేషం యీసడిస్తూ యీమధ్యయెందరో మహిళలు పత్రికల్లో వ్రాస్తూనే వున్నారు.

## జీవితంలో కళ

అయితే, ఆటపాటల్లో పాల్గొనే ఉత్సాహం, జ్ఞానం, యిల్లాలికి వుండేదా? అటువంటి తరిఫీదు కద్దా?

ఓ! భేషుగ్గా.

వాత్స్యాయనుడు, కన్య 64 కళలు నేర్వాలంటాడు. బొమ్మలు వేయడం, ముగ్గులు తీర్చడం, నృత్యం, నాట్యం, సంగీతం, కాలంప్రకారం పడకగది సంగతి చూసుకోవడం, పువ్వుల, సుగంధవస్తువుల సంగతి రకరకాల అల్లికలు, కవిత్వసమస్యలు పూర్తి చెయ్యడం, పక్షులచేత మాట్లాడించడం... యిటువంటి విద్యలు.

* * *

మనశాస్త్రకారులు యిల్లాలికి యిచ్చిన స్థానం అట్టిది. తనకుటుంబానికి ఆమెసర్వాధికారిణి. ఆ యింటి మంచీ, చెడ్డా, పెట్టూ, పెంపూ, అతిథ్యం, ఆదరణ అన్నిబాధ్యతలూ ఆమెవి.

మన పూర్వులు, పిండపుష్టిగా, కండపుష్టిగా బ్రతికారు. నాలుగు పురుషార్థాలలోనూ మూడోదైన కామానికి స్త్రీకగ్రస్థానాన్ని గ్రహించినవారు. అందుకనే ఆమె సంతోషంగా వుండాలి. అధికారం కలిగివుండాలి. “కలకంఠి కంట కన్నీరొలికిన సిరి యింట నుండ నొల్లదు”—అన్న విషయం తెలిసిన వారు మన పూర్వులు.

అందుచేత ప్రథమ ద్వితీయ పురుషార్థాలు రెంటిమీదా ఆమెకి అధికారం యిచ్చారు. దానధర్మాల బాధ్యత ఆమెది. ఖజానా బాధ్యత ఆమెది.

అందుకే ఆమె అర్ధాంగి, సహధర్మచారిణి.



## గ్రామాయణం

ఆమధ్య ఒకగ్రామంలో పంచాయబోర్డు ఎన్నికలు జరిగాయి. అందులో రెండుపక్షాలుగా రెండు ముఠాలు పోటీచేశారు. స్వతంత్రుడుగా ఒకాయన నిలబడ్డాడు.

ఏనాదిగూడెంలో ఉన్న యాభై ఓట్లూ తనకే ఇప్పించే ఒప్పందంమీద ఒకపక్షం అభ్యర్థి 500 రూపాయలు గూడెం మేస్త్రీకి ఇచ్చాడు. ఇది ఎలాగో పసికట్టిన రెండో అభ్యర్థి పైపోటీగావచ్చి ‘మీ 50 ఓట్లూ నాకే’నంటూ 600 రూపాయలు గూడెం మేస్త్రీ చేతిలో పెట్టాడు.

ఎన్నికరోజున గూడెం నుంచి యాభైమంది వచ్చి ఓటింగులోపాల్గొనడం ఇరుపక్షాలవారు చూశారు. అంతే కాదు అవి తమకే పడ్డాయని ఎవరికి వారు ఆనందించారు.

రెండుపక్షాలూ గూడెం ప్రజలకు డబ్బులిచ్చి ఓట్లుకొనుక్కున్నట్లు ఊరంతా ఆసాయంకాలానికి పాక్కిపోయింది.

తీరా అభ్యర్థులువెళ్ళి ఓట్లు ఎవరికి వేశారని వాళ్ళను అడుగుతే......

“బాబూ ఇద్దరూ డబ్బుదయసేశారు గదండీ ఇద్దరికీ న్యాయంజరగాలని ఓటు పిక్కంటు రెండుముక్కలుసేసి రెండు పెట్టెల్లోనూ ఏశామండీ అయ్యా—సత్తెం” అన్నారు అమాయకులైన ఆ యేనాదులు.

ఇదివిని అభ్యర్థులు ఇద్దరూ (విడివిడిగానే) ఏడవాలో నవ్వాలో తెలీక, రెండూ చేయనూలేక నెత్తికొట్టుకుంటూ కొంప చేరుకున్నారు.

మరునాడు ఉదయం స్వతంత్ర అభ్యర్థి గెలిచినట్లు ప్రకటించబడింది.

—చంద్రశేఖర్.

# మనస్సు చివుక్కు- మనిపించే మన వింతధోరణులు...

సి హెచ్. సీత

జీవితయాత్రలో, మనకు వింత వింతమైన మనస్తత్వాలవారు తటస్థపడ్తూ వుంటారు. కొన్ని సందర్భాలలో వారిమాటలు, చేష్టలు బాధాకరంగాను, అయాచితంగాను హాస్యాస్పదంగాను ఉంటాయి. ఇంటికి వచ్చి నామెను వీధిగడపలోనే నఖశిఖపర్యంతం పర్యచేస్తూ "ఏమే, ఓసిదా! కళ్ళజోడు పెట్టుకున్నావా! కాలికి జోళ్ళు పట్నవాసంవారంతా తొడుక్కుంటారా! ఏమాత్రమో చదువుకున్నట్లు విన్నాను— ఇంట్లో పనిపాటలు చేస్తావా?" మొదలయిన ప్రశ్నల పరంపరతో మనిషిని దిగాలుపర్చేస్తారు.

పెత్తనానికివచ్చి, అతిచొరవగా ఇంట్లో అలమార్లు, డ్రాయర్లు అన్నీ గబగబా తీసేస్తూ "ఇందులో ఏముంది? అందులో ఏం పెట్టారు?" అంటూ వారినిమిత్తం వరండాలో వేసిన చాప మనకే వప్పచెప్పి ఇల్లంతా స్వేచ్ఛా విహారం చేసినతదుపరి, మనం చూచి చూచి కోసుకోలేక అందానికి మొక్కల్నే వుంచిన పువ్వులన్నీ కోసిన పెద్దమనుష్యులవుతే వారిని ఏమనగలం చెప్పండి! ఏమీ అనలేక అనలేకపోతున్నామే అని బాధపడ్తూ, వారి వింత ప్రవృత్తి పరిశీలిస్తూ మనంకూడా వారితో విహారానికి ఉపక్రమించడమేగా కర్తవ్యం!

మరికొందరు—విమర్శనాత్మకులైనా సరే—వారి గుణగణాలని ఇతరులు ఎత్తిచూపడానికి ససేమిరా ఒప్పుకోరు. సాధారణంగా పది మంది అమ్మలక్కలు గుమిగూడిజరిపే సమావేశాలలో ఇరుగు పొరుగువారిమీద నేరాలు విమర్శలు, ఆక్షేపణలు, నిందారోపణలు మొదలైనవి వింటూ ఉంటాము. మనంకూడా వారిలో ఒక మెంబరై వంతపాడ్తూ ఎక్కే గుమ్మం దిగేగుమ్మం పెత్తనాలుచేస్తూ ఎక్కడెక్కడివార్తలు — నిజం కాకపోయినా ఇబ్బందిలేదు—పోగేసి తాజాగా మురిగి పోకుండా వీరికి అందజేస్తూ, విలువయిన సలహాలుఇస్తూ కుడిభుజంగా పనిచేసి వారి అభిమానానికి పాత్రులమై, మెప్పించుకొని మేకతోలు కప్పించుకొంటే సరే—లేదూ వారిదృష్టిలో మనం విషకీటకాలం, కలిమిడి కలిసిగొట్టుస్వభావంలేని ఒంటెత్తు, మాల కాకులు, గుడిపాము ఇంకా ఇంకా...... ఏ సాహసైనా "ఎందుకల్లా పిల్లిమీద ఎలుక, ఎలుకమీద పిల్లిని ఎక్కిస్తూ కాలక్షేపం చేస్తారు? పుణ్యమా పురుషారమా? ఏ పుస్తక మేనా చదువుకోకూడదా?" "ఉపయోగించే పనులు చేసుకోకూడదా?" అంటే, "ఓరోర, ఎంతతెలుసు, ఎంత తెలుసు. కానికాలం వచ్చి కళ్ళుమూసుకుపోతున్నాయమ్మోయ్ ఈ కాలంవాళ్ళకి" అని దుమ్మెత్తిపోసేసి, వరేసి వంతపని చేస్తారు.

చాటుగా పొంచివినడం, తలుపు సందులోంచి చూడడం మరికొందరి నైజం. ఏదో, అలవాటు ప్రకారం చేరారనుకున్నా దాంతో ఊరుకుంటారా? విన్నవి, చూచినవి గోరంత కొండంతచేసి, మరో నాలుగు చేర్చి, మెరుగులు పెట్టి, ఎవరెవరికి ఏవిధంగా చెప్తే పని జరుగుతుందో ఆ ప్రకారం వార్తలు అందజేస్తేకాని, నోటికి ఆహారంవెళ్ళదు, కంటికి కునుకుపట్టదు. "నువ్వు పుట్టింటికి వెళ్ళిన మూడు నెలలూ, మీ ఆయన రాత్రిళ్లు ఒంటిగంట దాటితేగాని ఇంటికి వచ్చేవారు కాదు. ఒకరోజున, ఎవరో ఆడమనిషి, మీ వారి గదిలో మసిలినట్లయిందమ్మా" అన్న పొరుగు ఇల్లాలి మాటలు విన్నక్షణంలో, కొత్తగా కాపురానికి వచ్చిన పిల్లదాని మనస్సు ఎంత క్షోభపడ్తుందో ఆలోచించండి! తాత్కాలికమైనదైనా, ఆ బాధ చాలదు.—మనలో మనమాట— అసలు, ఆ పతివ్రతకు, పరాయి మగవాడు రాత్రి ఎన్నిగంటలకు ఇంటికి వస్తున్నాడో గమనించే అవశ్యకత ఎందుకొచ్చింది? ఒంటరిగాఉన్న పొరుగు మగవారి గదిలో అలికిడి, ఆలకించడం తగిన పనేనా? స్వగతంలోని పర్యవసానాన్ని, మొహంమీద కుండబద్దలు కొట్టినట్లు అనేసుకల్గితే!!

గురివిందగింజ తన క్రింద వున్న నలుపు ఎరుగదన్నట్లు, తాము ఎంత అసభ్యంగా ప్రవర్తిస్తున్నా పరే తప్పులేదు కానీ, ఎదటివారిలో అవే చేష్టలు సహజమైనవైనా, తీవ్రంగా విమర్శించి, అపార్థాలుతీసి, నిందలు సహితం మోపుతారు. తమకూతుళ్లు, బంధువర్గంలో వారు సంవత్సరాల తరబడి పుట్టినింట్లో ఉన్నా సరే, పొరుగమ్మ, మూడు నెలలు పుట్టింట్లోఉంటే ఎంతో బాధపడిపోతారు. తాము సినిమాలకు భర్త కాని, పరాయి మగవానితో వెళ్ళినా ఏమీ తప్పు లేదుకానీ ఎదురింటి ఇల్లాలు స్వంతభర్తతో సినిమాకువెళ్తే మహాపరాధం.

తనకు లేదని ఓబాధైతే, ఎదుటివారు ధనవంతులని, దర్జాగా ఉన్నారని మరో వైపు కృంగిపోతూ ఉంటారు. ఈ సద్గుణం మగవారిలోకూడా వ్యాప్తిలో ఉంటుంది. శుభ్రమైన బట్టలు వేసుకుని, దర్జాగా ఉంటే క్రిందపనిచేసే గుమాస్తాని చూచి ఆఫీసరు ఓర్వలేడు. స్థితిగల ఇల్లాలిఇంటికి పొరుగామె పెత్తనానికివచ్చి "మీకేం, పెద్దమేడ కట్టుకున్నారు. హాయిగా సుఖపడ్తున్నారు. అన్ని కూరలు ఇంట్లో పండించుకుంటున్నారు. అన్ని సదుపాయాలు చేసుకుంటున్నారు. అంతా నిలకే! ఉన్న ఊళ్ళో ఉద్యోగం— ట్రాన్స్‌ఫర్ అయిపోతే ఎల్లాగో ఏమిటో ఏంచేస్తారు!" అంటూ అధమం విచారం పార్లేసా వాపోకుండా వెళ్ళదు. ఎదుటివారి సంసారభారమంతా తాము భరిస్తున్నట్లు, తాము కటికదరిద్రం అనుభవిస్తున్నట్లు మదనపడిపోతారు.

మరికొందరికి ఇరుగుపొరుగు ఇళ్ళలో వారి విషయాలే కాకుండా, వారి ఇళ్లకి వచ్చేపోయే ఆడ, మగవారి వివరాలు సకారణంగా కావాలి. పని ఒత్తిడివల్ల వీలు చిక్కకపోతే తమ తమ పిల్లల్నే నారంపి, ఎప్పటికప్పుడు సమాచారాలు సేకరిస్తూ ఉంటారు.

ఒకసారి మా యింటికి నా స్నేహితురాలు కమల వచ్చింది. గుమ్మంలో అడుగు పెట్టిందో లేదో ఆమెకంటె ముందరే యింటికి ఎడా పెడా ఇళ్లల్లో వారు, సకుటుంబ సపరివార సమేతంగా వీధిదారిని వీలైనవారు వీధి వైపుకి, దొడ్డిదారి వీలైనవారు వంట యింట్లోంచి కిలకిలలాడుతూ వచ్చేశారు. అదికొంప, ఇల్లు ఇరుకేమో నా అవస్థ ఏం చెప్పేటొమంటారు. ఊపిరి సలపడానికైనా సావకాశంలేకుండా ఈగల్లా ముసిరారు. సంబాళించుకొని ఆమెను కుశల ప్రశ్నలు వేసి కూర్చోపెట్టాను. చాలాకాలానికి కలుసుకున్నాం. కాస్త టిఫిను కాఫీఇచ్చి మంచి చెడ్డ మాట్లాడాలా? వీళ్ళందరిలో ఏం పెట్టను, ఏం మాట్లాడను? ఆ రోజుకు ఆమె ఉండిపోయింది కాబట్టి సరిపోయింది. ఆ మాట ఈ మాట చెప్పుకుంటుంటే కమల "నాకెందుకని ఊరుకున్నాగానీ, వెళ్ళమన లేం! ఎవరొచ్చినా వీళ్ళు ఇల్లాగే ప్రవర్తిస్తారా? లేక నేనేమన్నా వింతమృగంలా కన్పించానా?" అంది. "ఎవరొచ్చినాసరే ఇదే వరసనుకో! నువ్వు ఆడదానివి కాబట్టి నిదానంగా లోపలికివచ్చి చూశారు. మగవారలైతే క్యూసిస్టమ్‌లో ఒక్కొక్కరే ఒక్కొక్కరే తొంగి తొంగిచూస్తూ వెళ్తుంటే వాల్ట్ డిస్నీ బొమ్మలు జ్ఞాపకం వస్తాయి. వెళ్లమని మొహంమీద ఎల్లా చెప్పడం? ఏం బాగుంటుంది?" అన్నాను.

"వాళ్లు చేసింది బాగుందా? ఏమాటతోనని కుండా. బాగోగులు తెలుసున్నవాళ్ళయితే



# చెక్కు – పుస్తకం



(12-వ పేజీ తరువాయి)

గోకి వచ్చి: "ఆయన ఇంట్లో లేరు" అంది.

"బ్యాంకువాళ్ళు చెక్కు త్రిప్పి పంపించేశారండీ... వాళ్ళతో చెప్పాను గానీ నా కర్థం కాలేదు ఆయన చెప్పిన ప్రకారమే ఈ వేళ ఇంత త్వరగా వెళ్ళాను."

"ఒక వేళ పై ఆఫీసునుంచి పుస్తకం రాలేదేమో..." శాంతి, వీరాస్వామి ఇచ్చిన మాటల ఆసరాతో అంది.

"ఏమో అమ్మా! నాకు తెలియటం లేదు"... సాయంకాలం వస్తానని ఆయన గారితో చెప్పండి, అంటూ వీరాస్వామి నిష్క్రమించాడు.

*   *   *

గరికపాటి సాంబశివరావు కాదను కుంటాను

సాయంకాలం నాలుగు గంటలయింది.

వంటగదిలో పక్క కూర్చున్న వెంకటేశ్వర్లు గారింటికి అతడి బావమరిది సోమనాథం, ఆవెనుకనే వీరాస్వామి కొద్ది తేడాలో వచ్చారు.

వంటగదిలో కూర్చున్న బావ గారికి సోమనాథం: "వెంకటేశ్వరుడి మూలకంగా శివుడు చెల్లెలితో స్త్రీలో దాక్కున్నట్టుగా నువ్వు నాకోసం.. వంటగదిలో మకాం పెట్టవలసి వచ్చిందన్నమాట" అని నవ్వుతూ తీసుకున్న లెఖ్ఖని ఇచ్చాడు.

లెఖ్ఖ తీసుకొన్న వెంకటేశ్వర్లు, దాంతో జేబీ ధరించి వచ్చి: "నువ్వు బ్యాంకుకు పన్నెండు గంటల వేళ వెళ్ళావుగా! అప్పటికి డిపాజిట్ బుక్ రాలేదు. ఆతర్వాత వచ్చింది. ఇదిగో నీ లెఖ్ఖ. ఆ చెక్ నేను కాన్సిల్ చేసుకుంటానులే. అదీ, నోటూ ఇలా ఇచ్చెయ్యి" అన్నాడు.

వీరాస్వామి లెఖ్ఖ తీసుకొని, నోటునూ, చెక్కునూ వెంకటేశ్వర్లుకు యిచ్చి "సెలవంటూ" నిష్క్రమించాడు.

వెంకటేశ్వర్లు యింట్లోకి వచ్చాడు: సోమనాథం బావగారికేసి తమాషాగా చూసి "నీపని మా బాగా వుందయ్యా...

చెక్కు పుస్తకాలూ ... బరువూ ... ఒహో నాకు కూడా మీ బ్యాంకులో ఎకౌంటు పెట్టి పెంతా వేమిటని" అడిగి నవ్వాడు.

వెంకటేశ్వర్లు సమాధానం యిచ్చేలోగా శాంతి అందుకొని: అన్నయ్యా! మాపగవాడికయినా ఈతిప్పలు వద్దు... చెక్కూ వద్దు, పుస్తకమూ వద్దు... ఈ భాగవతం అంతా దానికే"—అంది.

సోమనాథం "అంతేనా"—అన్నట్లుగా బావగారికేసి చూశాడు.

"నిజం" — అన్నట్లుగా వెంకటేశ్వర్లు శాంతివైపుకు దృష్టి తిప్పాడు. ★

# ★ రాజధాని కబుర్లు ★

(5 వ పేజీ తరువాయి)

రులను సమాధానాలు చెప్పమనండి, ఉంటే, ఈ ప్రశ్నలకు.

## ఒకటో ప్రశ్న

నగరపాలక సంఘం కాచిగూడా చౌరస్తా నుంచి సుల్తాన్ బజార్ చౌరస్తా వరకు గల బాటను బాగుచేయడం ప్రారంభించి నాలుగు నెలల పైగా అయింది. ఆ రూటుపై నడిచే బస్సులు వేరే బాటలపై నడుస్తున్నాయి.

మామూలుగా వేరుదారి వెతకొల్సివచ్చినప్పుడు ఎడంప్రక్కగా ఉన్న బాటను నిర్ణయించుకోడం ఆచారం. ఈ ఆచారం ప్రకారం కోఠీదిశగాపోయే 7-బి, 7-సి బస్సులు వైశ్యగసతిగృహం వద్ద ఎడమచేతి ప్రక్కకు తిరిగి కుత్బీగూడా, ఈసామయా బజార్, ఉస్మానియా శ్రీ కళాశాల మీదుగా పోయి కోఠీ చేరవలసింది. కోఠీనుంచి వచ్చే ఈ బస్సులు సుల్తాన్ బజార్ వద్ద ఎడంచేతి ప్రక్కకు తిరిగి తిలక్ మెమోరియల్ హాల్ మీదుగా కాచీగూడా చౌరస్తా చేరవలసింది. ఈ విధంగా చేయలేరు. చేయక పోవడంవల్ల కొన్ని వేల గేలన్ల డీసెల్ నూనె ఖర్చయింది అనవసరంగా.

ఇది అసలు జరిపితే - సుల్తాన్ బజార్ చౌరస్తానుంచి స్త్రీ కళాశాలవరకూ ఉన్న బాటపై ఏ బస్సూ ప్రయాణం చేయవలసిన అవసరం ఉండేదికాదు. ఇప్పుడు జరుగుతున్నట్టుగా సుల్తాన్ బజార్ దవాఖానా ముందు నిలబడి, ప్రయాణీకులు 'బస్సు ఉత్తరానికిపోతుందా దక్షిణానికిపోతూందా' అని గాభరాగా అడగవలసిన అవసరం ఉండేది కాదు.

'ప్రజాక్షేమంలో పరమానందం'లో అన్న శీర్షికక్రింద ఈ కబుర్లలో ఈ విషయం కొన్ని నెలల క్రిందట ప్రస్తావించబడింది.

కనుక ఇది మొదటి ప్రశ్న: ఈ అనవసరపు ఖర్చుకి ఎవరు బాధ్యులు? ఎక్కువ ఎవరి జేబులలోకి పోతున్నాయి? అధికారుల అసమర్థతకి ప్రయాణీకులు ఎందుకు పన్ను చెల్లించుకోవాలి? ★

## సవరణ

గతవారం సంచిక 4 వ పేజీ 3 వ కాలం 2, 3 పంక్తుల్లో శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి బదులు శ్రీ దేవులపల్లి రామానుజరావు అని దిద్దుకొని ప్రార్థన.

కనుల. "కష్టంగానే ఉంటుంది మాటకు మాట అనేయలేక కాదు. మంచి మర్యాద కోసం" అన్నా. ఒసి పిచ్చిదానా, ఇంకా పాతరోజులలోనే ఉన్నావు. మంచికి మర్యాదకి ఈ రోజులలో తగిన స్థానం లేదు సరికదా దానికోసం తాపత్రయపడేవారిని పట్టిచేతకాని వారని, అసమర్థులని అంటారు. "కరవ్యం మాటఇచ్చి నిలబెట్టుకుంటుంటే నరులు నన్ను కొట్టి తొక్కి బాధించేస్తున్నారు. కర్తవ్యం ఏమిటనా" అన్నపాముకి నారదులు వారేమన్నారో తెలీదు. పిచ్చిదానా అనవసరంగా కరిచి చంపెయ్యద్దన్నాను గానీ బుసకొట్టవద్దన్నానా? అన్నాడు" అంది కమల. ఇదే కర్తవ్యమంటేనంటారా!!! ★



చిత్రం: ఎమ్. రంగారావు, మద్రాసు.

# చదరంగం

[చదరంగంలో అఖిల భారతస్థాయి అగ్రగణ్యులలో ఒకరైన శ్రీ దర్భా వెంకయ్య రచించిన వ్యాసమూ, సమస్య ఈ వారం ప్రచురిస్తున్నాము. వీరి వ్యాసాలు, సమస్యలు ఇకనుంచీ తరచు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురితమవుతూ ఉంటాయి. సం॥]

ఆటలో ప్రధానలక్ష్యం శత్రుసేనలోని రాజును బందీ చెయ్యటం. పరిస్థితుల్నిబట్టి ఇది రెండింతో సొంపుగా నిర్వహించవచ్చు. పేరెన్నికగన్న రెండుఆటల వివరాల్ని పరిశీలిద్దాం.

## మొదటిఆట:

తెలుపు-అండర్సన్. నలుపు-కెజెరిట్స్కీ. కాలం 1851

నలుపు-కెజెరిట్స్కీ—14



తెలుపు-అండర్సన్—18

రెండు బలాల్లోనూ రాజులు కోటలు కట్టలేదు.

నల్లబలానికి శకటు ఎక్కువ.

తెలుపు బలంలో, గుర్రాలూ, శకటు, మంత్రీ, బంట్లూ మంచి స్థానాలలో ఉన్నాయి.

నల్లబలంలో ఒక శకటూ, మంత్రీ దూరంపైకి వచ్చేయి.

సారాంశం:-బలం తక్కువగా ఉన్నా మంచి ఎన్నికగా ఉంది తెల్లబలం. ఉధృతమైన దాడిని జరిపితే సరికాని తెలుపుబలానికి తీవ్రమైన నష్టంకూడా కలగవచ్చు.

తెలుపు వేసిన ఎత్తు చూదాం.

1 శ-మ 6!! శ×ఏ

ఇచట 1...మ×ఏ,షా అయితే 2. రా-రా 2, మ×ఏ

3. గు×బ షా రా-మ 1;4. శ-శ 7, ఆటకట్టు. ప్రస్తుతంలో నల్లమంత్రి, గుర్రపు బంటుని కాస్తోంది.

2. బ-రా 5!!

వెనక్కి తిరిగి చూట్టంలేదు! గుర్రపుబంటుకి మంత్రి కాపు తీసెయ్యాలి.

2.....మ×ఏ షా

3. రా-రా 2 గు-మఏ 3

గుర్రపుబంటు ఎలాగూ పోయింది. ఆటకట్టు జరగకుండా శ 2 కాసుకోవాలి. దారికిదాన్ని పోగొట్టకూడదు కనుక ఏనుగుని పుచ్చుకోలం కూడా సబబే

4. గు×బ షా రా-మ 1

5. మ-శ 8 షా గు×మ

6. శ-రా 7 ఆటకట్టు.

## రెండవ ఆట

1853 సం॥ లో — బెర్లిన్ నగరంలో జరిగిన ఆట.

డ్యూఫ్రేన్ నలుపు—18



అండర్సన్ తెలుపు—12

ఎత్తు తెలుపుది

ఇప్పుడే నల్లమంత్రి శ-3 లోని తెల్ల గుర్రాన్ని చంపింది ఆటకట్టుకు బెదిరిస్తోంది. నల్లమంత్రి గుర్రాన్ని చంపకముందు తెల్లబలం వేసిన ఆఖరి ఎత్తు ఏ—మ 1

ఈ రెండు ఎత్తులూ వెనక్కి జరిపి చూదాం.

నల్లమంత్రి తన గుర్రాన్ని చంపుతోందని తెలుసు అండర్సన్‌కి. దాన్ని తియ్యాడు. కాయనం. నల్లమంత్రి ఆట కట్టడానికి ముందుగానే తెల్లబలం ఆటకట్టేసే పథకాన్ని తయారు చేసేను.

1. ఏ×గు, షా! గు×ఏ
2. మ×బ, షా!! రా×మ
3 శ—శ 5, షా! రా—రా 1
4 శ—మ 7, షా! రా—మ 1
5. శ×గు ఆటకట్టు.

నల్లబలం సరిగా వెయ్యలేదు. ఈ క్రింది పద్ధతి ఎక్కువ సబబుగా ఉంటుంది.

1. ............ రా—మ 1
2 ఏ×బ, షా రా—శ 1
3. ఏ—ఏశ, షా!! రా×ఏ
4. శ—శ 5, షా మ×ఏ, షా
5. మ×మ, షా గు—మ 5
6. బ×గు తరువాత క్రమంగా ఆట గెలుస్తుం-.

ఈ రెండు ఆటల్లోనూ తెలుపు బలం తన లక్ష్యాన్ని చక్కని ఎత్తుల కూర్పులతో నిర్వహించింది. ఇటువంటి కల్పనల్ని కాంబినేషన్స్ అంటారు. కొన్ని కల్పనలు పై మాదిరిలాగ ఆటకట్టెయ్యడం సాగించినా, కొన్ని బంటు, వంతువు మొదలైన లాభాల్ని లక్ష్యంగా పెట్టుకుంటాయి.

కల్పనలోని ప్రధాన విషయం లెక్కించటం. పొరపాటు లేకుండా ఎదుటి బలం ఎట్టి సమాధానాలిచ్చినా వాటికి సరియైన జవాబుల్ని లెక్కించాలి. కల్పనలోని రెండో విషయం కొత్తదనం. ఎత్తు చూడగానే ఎదుటివ్యక్తి విస్మయం చెందాలి. కల్పనలో మూడో విషయం కూడా ఉంది. తక్కువ పెట్టుబడితో ఎక్కువ లాభాన్ని సంపాదించే పద్ధతి. కొంత బలితో ప్రణాళిక ప్రారంభించి, ఖర్చుపెట్టినవాని కంటె హెచ్చువాటిని శత్రుబలంలోంచి తగ్గించాలి. కాంబినేషనులు ఆటకిఅందాన్ని ఇస్తాయి. ఆటల పరిమితి ఎత్తుల సంఖ్యలో తగ్గుతుంది. ఇవి చదరంగం ఆటలో మెరుపు తీగలు. హాకీమ్యాచ్‌లో ముగ్గురునలుగురు ప్లేయర్లు శత్రుపక్షంలోని పరివారాన్నంతటినీ దాటించుకుంటూ, రివ్వుమని గోలుకొట్టే పన్నెల్లాటివి. ముఖ్యమైన గళ్ళు గుర్తించాలి. వాటికి అవసరమైన పరివారాన్ని చేర్చాలి. సరియైన కాలంలో పని ప్రారంభించాలి. న్యాయమైన పద్ధతిలో నిర్వహించాలి. ప్రతి ప్లేయరూ కల్పనాశైలి (Combination Style) అలవర్చుకోడానికి ప్రయత్నించాలి.

## వార్త

జాతీయ చదురంగం పోటీలకు ఆంధ్ర జట్టు: డిశంబరులో ఢిల్లీలో జరిగే చదురంగం పోటీలలో ఆంధ్ర తరఫున పాల్గొనడానికి ఈ దిగువ పేర్కొన్నవారు ఎన్నికైనారు. శ్రీయుతులు 1. డి. వి. రంగారావు, 2 పి. తిలక్ 3. ఆర్. సుబ్రహ్మణ్యం, 4. పి.ఎస్. కామేశ్వరరావు.

రిజర్వు 1. శ్రీ వి. జి. కె. మూర్తి, 2. పి. ఆర్. శాస్త్రి, 3. జి. కుటుంబరావు.

# ★ ఉత్తరాలు ★

(2-వ పేజీ తరువాయి)

గారు సులువుగా వ్రాసయ్యేందుకు, ఈ సలహాలు ఉపకరించవు, అని వ్రాశారు. కాని, ఆ సలహాలు సులువుగా వ్రాసయ్యేందుకు ఉపకరిస్తాయని గాని, ఉపకరించేవి గా ఉండాలని గాని ఏ ఒక్కరూ అనుకోరు.

కె. లలిత, నందిగామ.

## రోజా మొక్కలకు ఎరువు

మా ఇంట్లో కొన్ని రోజా చెట్లు ఇగురు వేసి కూడా ఉచ్చిపోతున్నాయి. కొన్ని బాగా ఎదిగి పూలు పూయుట లేదు. పూలు పెద్దవిగా పూయుటకు పెరుగుటకు ఏమి ఎరువు వెయ్యాలో తెలిసినసోదరి ఎవరైనావుంటే దయచేసి పత్రికద్వారా తెలియజేస్తారని ఆశిస్తున్నాను.

ఎ. రాజేశ్వరి, నెల్లూరు.

## వైద్యార్థుల అగచాట్లు

ప్రవీణ్ గారు "ఉస్మానియాలో కాబోయే వైద్యార్థులు" అనే శీర్షిక క్రింద వ్రాసింది చాలా బాగుంది. అధికారులు ఇటువంటి అవకతవకలు యికముందు జరగకుండా తగుచర్య తీసుకొంటే ప్రవీణ్ గారి శ్రమ ఫలిస్తుంది.

ఎల్. వి. ఎస్., విజయవాడ.

* * *

అన్నపూర్ణ దేవిగారి వ్యాసము చదివితిని. వారు వ్రాసినవి నిజంగా ఉన్నమాటలే యని వారితో నేకీభవిస్తున్నాను. కాని ఒక్కటి "ఈనాడు సినిమాలు ప్రజాజీవితంలో సంచలనము తెస్తున్నై" అని తమ వ్యాసములో లిఖించిరి. చలనచిత్రాలు ప్రజాజీవితంలో సంచలనము కలిగించుట లేదనియు, వాటిలో గల మంచిని అర్థముచేసుకోలేక చెడును అతిత్వరగా గ్రహించి, తమకు తామే కూడని దారుల నడచుకొంటున్నారు. వాటిలో మంచిని గ్రహించి వాటి వ్యాప్తికి ఎందుకు తోడ్పడకూడదూ? అని నా మనవి. పైగా విజ్ఞానవ్యాప్తికి బహుళముగా తోడ్పడు చలనచిత్ర పరిశ్రమను రచయిత్రి గారు ఎందుకు నిందించడం?

ఎ. ఆర్. జి. బోయిన (కలకత్తా).

* * *

రామచంద్రుని సుందరీదేవిగారు, "ముసుగులు - ముస్తాబులు" అనే వ్యాసంలో స్త్రీల అలంకరణ గూర్చి వ్రాస్తూ విద్యార్థులను గూడ విమర్శించినారు. కాని వారు చెప్పినట్లుగా నైలాన్ చీరల లాంటివినరించి, డాబుసరిగా రోడ్లవెంట అనవసరముగా తిరిగేవారిని మాత్రం అది "స్త్రీ"కి తగినపని కాదు అనేవిషయమై తెలియజేయుటకు మాత్రమే విద్యార్థులు, ఏమైనా అనెనని శ్రీమతి సుందరీదేవిగారు గమనించ ప్రార్థన. సాధారణ యువతులను విద్యార్థులు ఎప్పుడూ గోలచేయరని తలంచవలయును.

వి. హరనాధబాబు (గుంటూరు).

## ఏ దేశమేగినా

పద్మ గారి "ఎందరో మహానుభావులు" వ్యాసం బాగుంది. ఈ మహానుభావుల్ని మొదటిసారిగా చంద్రలోకం పంపిస్తే అక్కడ ఎవరితో వాడీలు చెబుతారు?

సుందరీదేవి గారి 'ముసుగుల ముస్తాబు'ల్లో మేము కలుగజేసికోవడం అంతమంచిది కాదేమో!

కె. హేమాద్రి, (గొల్లప్రోలు).

* * *

మన చిత్రాల్లోని అతిప్రధానమైన లోపాన్ని విస్పష్టంగా ఎత్తిచూపిన శ్రీ రామారావుగారిని "శభాష్ రాముడూ" అని ప్రశంసించక తప్పదు,

జి. సాంబశివరావు, (విశాఖ)

## చేమంతుల పెంపకం

16-9-59 వారపత్రికలో చేమంతుల పెంపకమును గూర్చి అడిగిన "అబ్బులు" గార్కి నా జవాబు.

చేమంతి మొక్కలు కుళ్ళిపోవటం, నేనింత వరకు చూడలేదు. పిల్ల వేర్లకు, తల్లి వేరుకు అధిక నీటిసరఫరా వుండినను కుళ్ళిపోవుటకలదు. బహుశా సూర్యరశ్మి లేనిచోట పాతినారేమో! కాని ఆ నేలలోపల తగినంతగా ఖనిజ లవణములు లేవేమో! దీనికి ఒక ఎరువని ప్రత్యేకముగా వేయరు. బహుశా ఉదాహరణకు 144 చ॥ అం॥ వైశాల్యముగల స్థలము తీసికొనండి. ½ అడుగు లోతు లేక ½ అడుగు. త్రవ్వండి. మన సాధారణ దిబ్బలలో (పశువుల పేడetc)లోపల గల పచ్చిఎరువును త్రవ్విన మట్టితో కలపండి. ఎంటనే సూర్యకిరణాలు స్పర్శించని మొక్కను నాటి, పాదుచేసి, నీరుపోయండి. (అంటే వర్షకాలములో కూడ కాదు) తగిన నీరుపోయండి. (1 మొక్కను మాత్రమే నాటండి) నేను చెప్పింది కానట్లయితే మళ్ళీ మన "ఉత్తరాల" శీర్షిక ద్వారా కలుసుకుందాము.

వి. ఏ. ఎస్. (భాకరాపేట).

* * *

[illegible]పరశ గారి సలహాలన్నిటితో నే నేకీభవించలేనని 23-9-59 పత్రికలో ఒక [illegible]మణిగారు వ్రాసినారు. నిజమే, ఒకరి [illegible]లు, సూచనలు, సలహాలతో ఇంకొ[illegible] ఏకీభవించుట చాలకష్టమే నేనునూ, [illegible]పరశ సలహాను విమర్శించినవారితో ఏకీ[illegible]ంచలేకున్నాను. కారణం: స్వమత, [illegible]కుత ఆత్మగౌరవముగల ఏ స్త్రీయైననూ [illegible]ద్దవారు కానివ్వండి, చిన్నవారు కానివ్వండి - అంత ఎబ్బెట్టుగా తిరగడానికి సిద్ధ[illegible]పడు.

భాస్కర్ (హైదరాబాద్)

★

శ్రీ జి. యస్. దీక్షిత్ సీడెడ్ ప్లేయర్సులో ఉన్నారు. జాతీయ ఛాంపియన్‌షిప్ పోటీలు, డిశంబరు 16 నుండి ప్రారంభమవుతాయి. సుమారు 60 వరకూ ఆటగాళ్ళు ఉండొచ్చు.

## సమస్య 9

కొంబి నేషను 1.

నలుపు 14



తెలుపు 12

పరిస్థితి:- నవి, నగు, నశి, 3, నరా నవి; నబ, నబ, నబ, 2, నబ,నబ, నబ; 1, నశి, 6; 3 నమ 4; 3నబ, తెగు 3; తెమ 4 తెగు 2; తెబ, తెబ, తెబ, 2, తెరా, తెబ, తెబ; తెవి,1 తెశి,1 తెవి 3;

ఎత్తు: తెలుపు వెయ్యాలి;

4 ఎత్తులలో కట్టాలి.

-(జవాబు వచ్చేవారంలో)

## 8 వ సమస్యకు పరిష్కారం

1) శి—ఏ 8, రా × బ; 2) శి × ఎ సా, రా—ఏ 6; 3) ఏ—ఏ 7 లేక

1) ... బ—శి 7; 2) ఏ—గు 7, రా × బ; 3) ఏ—మ ఏ 7 లేక

1) ... బ × బ; 2) గు—మ 4, బ—రా 7; [2)... బ × ఏ (మ) సా; 3) గు—శి 2]3) గు × బ.

★

# వార్తావరణం

తమిళ చిత్రసీమలో తెలుగు వారికి ప్రముఖస్థానం ఉంది. భానుమతి, సావిత్రి, అంజలీదేవి, జానకి, కన్నాంబ, నాగేశ్వరరావు, రంగారావు మొదలైన వారంతా మంచి పేరు తెచ్చుకున్నారు. నిర్మాణంలో కూడా కొందరు తెలుగువారు తెలుగుతో పాటు తమిళంలో కూడా చిత్రాలు నిర్మిస్తున్నారు. విజయ, అన్నపూర్ణాపిక్చర్స్, భరణి, సారథి, ఇపుడు వాహిని, సాహిణి, జయంతి, అనుపమ మొదలైన సంస్థలు తమిళంలో చిత్రాలు తీస్తున్నాయి. తమిళ నిర్మాతలు ఇంతకాలం తెలుగువారికి చిత్రాలు తీసిన సందర్భాలు తక్కువ. పరోక్షంగా,- అంటే తమిళచిత్రాన్ని అనువాదానికి విక్రయించి పంపడంద్వారా మాత్రం చాలా తమిళ చిత్రాలు తెలుగుదేశం వచ్చాయి. ఇపుడు సరాసరి తెలుగులో చిత్రాల నిర్మించడం తమిళనాడులో కూడా ఆరంభం అయింది.

తమిళదేశంలో రజతోత్సవం జరుపుకొన్న కొద్దిపాటి సాంఘిక చిత్రాలలో 'కల్యాణపరిసు' ఒకటి. ఈ చిత్రాన్ని దర్శకనిర్మాత శ్రీధర్ తెలుగులో పునర్నిర్మిస్తున్నారు... పక్షిరాజావారు, ఇటీవలి తమ 'మరగతం' చిత్రాన్ని తెలుగులో నిర్మిస్తున్నారు.

తెలుగు చొక్కాలు తొడిగించుకోబోతున్న ఇతర అన్యభాషా చిత్రాలలో లాజవంతి, తలాక్, ఏక్ హి రాస్తా, న్యూఢిల్లీ, రాగ్‌కహా రోక్నికహా మొదలైనవి ఉన్నాయి.

* * *

ఒక దర్శకుడు ఈ అంశాలు పురస్కరించుకొని క్రిందివిధంగా ఉపన్యసించారు:



'రేణుకా మాహాత్మ్యం'లో జి. వరలక్ష్మి





చేతనావారి 'గుళ్ళోపెళ్ళి'లో చదలవాడ

అన్యభాషాచిత్రాలు అని మనకి పట్టీమన తెలియని తెలుగుచిత్రాలకు కూడా కథావస్తువులూ, చట్టాలూ, ఎన్నో బొంబాయినుండీ, కలకత్తానుంచీ, లాస్ ఏంజెల్స్‌నుంచీ వస్తున్నాయి. ఇంకెన్నో కిందటి శతాబ్దంలో నవలలనుండి వస్తున్నాయి. వీటన్నిటికీ ఆత్రేయలూ, ఆరుద్రలూ తెలుగురంగు వేసి, అందులో రామారావునీ, రమణారెడ్డిని, రంగారావునీ నిలబెట్టి తెలుగుమీసాలు తీర్చి కించిత్ వంచన లేకుండా దర్శకుడితో కట్టచేసి తెలుగు సినిమాని తయారుచేస్తున్నారు. ఈ విధంగా చూస్తే డబ్బింగ్‌కు దీనికీ తేడా ఏపాటి ఉందిటా?... అన్నారాయన.

* * *

ఈ అభిప్రాయం ఒకవిధంగా అతిశయోక్తి అయినా ఈ విమర్శ చేసినవారికి బాధ కల్పించి పై ఉపన్యాసానికి ఆయన్ని రెచ్చగొట్టిన విషయం కూడా ఆలోచించ తగినదే. మౌలికమని అభివర్ణించతగ్గ కథ ఏదీ తెలుగు సినిమా జోలికి రావడంలేదు; లేదా దాని జోలికిది పోవటంలేదు. దానాదీనా తెలుగు సినిమాకి వెళ్ళబోయేవేళ ఎవరూ కొత్తకథను గాని, కొత్త ఊహను గాని ఎదురుచూడడం లేదు. ఆ అలవాటు పోయింది.

ఇందుకెవరు బాధ్యులు?

"మేము కొందరు రచయితలను పిలిచి కథ ఇవ్వండి అని అడిగితే వారు, 'మీరు తీరుబాటుగా కూర్చుంటే ఇద్దరం కలిసి తయారు చేదాం' అని సమాధానం చెబుతున్నారు. అదీ పరిస్థితి" అని ఒక నిర్మాత, నటుడు ఇటీవల అన్నారు.

* * *

కాగా అక్కడనించీ ఇక్కడనించీ తెచ్చే కథలను తెనిగించి అందుమీద తెలుగు జీవితాన్ని తెలుగు సమాజాన్ని చిత్రించడం ఎంత బాగా జరుగుతోందీ అన్న ప్రశ్న కూడా కొందరు చర్చిస్తున్నారు.

ఇదీ కొంత నిజమే. ఈ రోజు సినిమాలు చూస్తూ ఉంటే ఏది జీవితం ఏది సినిమా అని విడదీసి చెప్పుకోవడం కష్టమనిపించే విధంగా లేదు.

అనేక స్థితిగతుల చిత్రణ, సమస్యల వివరణ, పాత్రల స్వరూప స్వభావాలూ, వేషభాషలూ అన్నీ విజయవాడలోను, అంగలకుదురులోను ఉన్న జీవితాన్ని చూసి ముక్కకి ముక్కగా అనుకరిస్తున్నవి ఎంత మాత్రం కావు.

ఒక ప్రేక్షకుడు అన్నట్టుగా, సినిమా వారు శూన్యంగా పరిశీలించి అర్థంచేసుకో

(60-వ పేజీ చూడండి)

మొదటినుంచి చివరదాకా కదనకుతూహలరాగంలా ఉత్సాహంగా ధాటిగా, కోటి ప్రేమలేఖలు జవాబులందుకున్న వాడి కోలపాటలా కులాసాగా జరిగితే చిత్రం 'కిలాడిపిల్లా' గతవారం ఆంధ్రలో విడుదల అయింది. పేరు మార్చి ఇది డబ్బింగ్ చిత్రం అనుకుంటే మీరు కరెక్టు. చిత్రం చూసి అలా అనుకుంటే తప్పు. రచయిత శ్రీ శ్రీ, గాత్రధారులు జగ్గయ్య, రమణారెడ్డి, రంగారావు (తనకే). అంత పకడ్బందీగా లిప్ సర్వీస్ నిర్వహించారు.

అల్లరి చిల్లరిగా తిరిగే కొడుకును, మరమ్మత్తు చేయించి దారిన పెట్టాలన్న ఆశతో ఒక తండ్రి, అతన్ని పట్నంలోని తన మిత్రుడింటికి పంపిస్తాడు. ఆ అల్లరిపిల్లడు మోహన్, పట్నం వెళ్ళినట్టే వెళ్ళి అక్కడ తన మిత్రుడు శేఖరానికి 'తన పేరు-వేషం' వేయించి తండ్రిమిత్రుడు అప్పన్నదొరగారింట్లోకి తోలేస్తాడు. ఆయన ఇదే బాగని మోహన్ పేరు గల శేఖర్ కి అల్లుడి మర్యాదలన్నీ చేసి పిల్లనిచ్చి కట్టబెట్ట సిద్ధపడతాడు. ఈలోగా మోహన్, జీవితం నలుమూలలా తిరిగి కష్టాలలో పెరిగి మానసికంగా పెద్దవాడయ్యే వరకు, ఒక ఖూనీ నేరంలో ఇరుక్కుంటాడు. అనవసరంగా దర్శకుడు ఈ కథలో ప్రవేశపెట్టిన సమ్మెవంటి సన్నివేశాలలో పాల్గొన్నందుకు శిక్ష న్యాయమే అయినా ఇంత తగదని మీకు అనిపిస్తుంది. పోలీసులకు అందిన ఆధారాల ప్రకారం హంతకుడి పేరు మోహన్; కాని కాల్తీమటుకు మోహన్ పేరిట ఉన్న శేఖర్; శేఖర్ ఎవరన్నది పెద్ద చిక్కు. ఎందుకంటే అచ్చు అతన్ని మూర్తులా పోలిన రిక్షావాడు వేరే ఒకడున్నాడు. ఈ పేరు వేషాల మారువేషాల గందరగోళం మీద పాత్రలనీ, మనని ఆడించినంతసేపు ఆడించి, (కొంతసేపు పాడించి-బాగుంటేని పాటలుసహా) నవ్వించిచివర్కి అందరికీ ప్రాణం హాయిమనిపించేలా సరదాగా కథ ముగించారు దర్శకుడు బి.ఆర్. పంతులు.

శివాజీ గణేశన్, చంద్రబాబు, రంగారావు, కుసుమ (శభాష్‌రాముడు) కుమారి, బి. సరోజా (పెళ్ళిసందడి) దేవి, కులదైవం రాజగోపాల్ మొదలగువారు నటించారు. గణేశన్ హాస్యంమన్ని మొదట్నుంచి చివరిదాకా పొట్టచెక్కలయ్యేలా నవ్వించలేకపోయినా, చాలా సందర్భాలలో బాగుంది. అంతటా మెచ్చుకోతగ్గ విధంగా చేసినవాడు చంద్రబాబు. పాదరసం చురుకుదనంతో చైతన్యంతో చంద్రబాబు ఇందులో విహరించాడు. రమణారెడ్డి అతనికి దీటైనరీతిన మాటలు చదివాడు. రంగారావు పాత్ర, రూపకల్పన నటనకూడా హాయిగా మనోహరంగా ఉన్నాయి. 

శంభూ వారి 'నమ్మినబంటు'లో సావిత్రి



వెంకటరమణా వారి 'బాలనాగమ్మ'లో రంగారావు

# ★ బొంబాయిలేఖ ★

## కంగన్

ఉమాశంకర్ ప్రొడక్షన్స్‌వారి 'కంగన్', మనం మామూలుగా ఆశించనంత బాగా ఉంది. మంచి సాంఘికాలంత గొప్పగాను చెత్తడిటెక్టివ్ చిత్రాలంత చెత్తగానూ కూడా ఉండకుండా, అనేకవిధాల అరుదనిపించేలా ఉంది. అన్నిటికన్న విశేషం, తరవాత ఏమవుతుందీ అన్న ఆసక్తిని కట్టుదిట్టంగా కట్టుకువెళ్ళడం. మామూలుగా దొరికిన కథని తోచినవిధంగా తీసి అవతల పారేస్తాడన్న చెడ్డపేరు పడ్డ (కొందరి దృష్టిలో) దర్శకుడు నానా భాయి భట్ నిజమైన ప్రజ్ఞను, ' చిత్రంలో ఆయన చూపిన పనితనం మనకి చూపిస్తుంది.

కంగన్‌లో ముఖ్యవృత్తాంతం చిన్నదే: ఒక అపరాధ పరిశోధకోద్యోగి ప్రేమించి పెళ్లి చేసుకోబోతున్న పిల్ల, ముహూర్తం కొద్దిసేపు ఉందనగా, ఒక స్నేహితురాలికి తోడ్పడబోయి ఉద్రేకంలో, ఒక దుష్టుడి నెత్తిన బలమైనదెబ్బ కొడుతుంది. అతను చనిపోతాడు.

ఈ అమ్మాయికి పెళ్ళి అయిపోతుంది. ఆమెభర్తే ఈ ఖూనీనేరంలో, ఆ హత్య చేసిన వ్యక్తికోసం అన్వేషణ సాగిస్తాడు. అందువల్ల ప్రతిదినం, అనుక్షణం, ఆమెకు తననేరం గుండెలమీద కుంపటిఅయి బాధిస్తుంది. తనమీద ఏ అనుమానమూ లేని భర్తతో చెప్పలేక, చెప్పకుండా ఉండలేకా క్షోభపడుతుంది. చివరకు ఆమె అపరాధం బయటపడ్డ రోజున, భర్త ధర్మకర్తవ్యాన్ని బట్టి విధిగా ఆమెను కోర్టుకు హాజరు పరుస్తాడు.

మనం ఎదురుచూడనట్టు ఈ చిత్రం ఎంత బాగా కుదిరిందో, ఇక్కడే మనం ఊహించని కొత్త సంఘటనతో కథ కొత్త మలుపు తిరిగి సుఖాంతం అవుతుంది. ఇది నిర్వహించడానికి దర్శకుడు ఎంత జాగ్రత్తగా పనిచేశాడో, పోలీసు అశోక్‌కుమార్, అతనిభార్య నిరూపరాయ్ అంత నిండుగాను నిగ్రహంతోనూ నటించి ఈచిత్రాన్ని రక్తికట్టించారు. మొత్తంమీద ఈ చిత్రంపేరిట "గానతాంబూలం", కథ వ్రాసిన శశిభూషణ్‌కు దక్కుతుంది. హత్యచేసిన దెవరో ప్రేక్షకులకు తెలిపి, పాత్రల ఉత్కంఠమీద కథను రక్తికట్టించడం కష్టమైన పని. దానిని దర్శక రచయితలు వంకలు పెట్టేందుకు వీల్లేకుండా దిద్దుకొచ్చారు.

పూర్ణిమ, ఇఫ్తికర్, నజీర్ హుసేన్, భగ్వాన్, లాల్ బహదూర్, డెయిసీ ఇరానీ, చివర్న ఒక డాన్సరు [illegible] ఇందులో పాల్గొన్నారు. కథకు హాని జరగనివిధంగా హాస్యం, సంగీతం చొప్పించారు. సంగీతదర్శకుడు చిత్రగుప్త ఉత్సాహకరమైన కొన్ని పాటలు చేశారు. చూడతగ్గచిత్రం కంగన్.

## ఉత్తమ రచయిత

ఈమధ్య ఒకరోజు సాయంకాలం సినీజనులు పదిమంది ఒకచోట చేరి కబుర్లు చెప్పుకుంటూ ఉండగా సినీసంభాషణల మీదా, వాటి రచయితలమీదా చర్చజరిగింది. సరదాగానే వారివారితీరులనూ, పనితనాన్ని బేరీజులువేసి ఎవరి శ్రేణి వారూ అని తేల్చారు. ఆయా రచయితలపరోక్షాన ఈచర్చలు జరిగాయికాబట్టి, దీని సంగతి సందర్భాలు వెల్లడి చేయడం న్యాయం. ఆ చర్చల ఫలితంగా ఈ క్రిందివారు ఉత్తమ సంభాషణా రచయితలుగా వచ్చారు (వరుస ప్రకారం):

ఇస్మత్ చుగ్‌తాయ్, క్వాజా అహమద్ అబ్బాస్, రాజేందర్ కిషన్, ఇందర్ రాజ్



లలితా మూవీస్ వారి 'నాగమోహిని'లో కమ్మాళ్

# వార్తావరణం

(56-వ పేజీ తరువాయి)

ప్రయత్నించేది నిజజీవితాన్ని కాదు. సమాజాన్ని కాదు. వాటి సినీ ప్రతిబింబాలు అని తాననుకొంటున్న వాటినే.

ఏనాడో కొందరు శాస్త్రంలోఉన్న గ్రంథాల్లో తామెరిగిన స్థితిగతులను, వింతలను విశేషాలను కొన్ని చిత్రాలలో చూపించారు. తర్వాత వారి వాలకంది ఆ కల్పనాచిత్రంలో చూసిన మనుషులు, వారి తరహాలనే పాత్రలు సరకుగా పెట్టుకుని అవే ప్రాతిపదికలుగా కొత్త కథలు చెప్పుకొచ్చారు. తిరిగి ఇవి ఆధారంగా మరికొన్ని వచ్చాయి. అవి వాచకపుస్తకాలుగా మరికొన్ని వచ్చాయి. వీటికి జరిగి ఇది, నటులు తెలుగుసినిమాలు, పాత్రలు, నాటక భాషా బాధా అన్నీ కృత్రిమమైన సహజత్వాన్ని సంపాదించుకోవడం వీటికి మిగిలింది సెల్యులాయిడ్ గదాటాలోంచి వడబోసిన జీవితం. సినీజీవితం.

ఇవన్నీ ఇలా చెప్పుకోవడం చాలా చిరులు కలిగించినా, ఇవి పరమ అబద్ధాలు కావు. వీటికీ మన కంటికీ మధ్య సరిపెద్ద ధూరత్వాలు లేవు....

* * *

ఎన్. ఎ. టి వారి 'సీతారామకల్యాణం' చిత్రానికి సెప్టెంబరు 19 నుంచే మూడు రోజులు వరుసగా ఎ. వి. ఎం. స్టూడియోలో పాటల రికార్డింగ్ జరిగింది. రావణబ్రహ్మ శివస్తుతిని రికార్డుచేశారు. ఒకపాటా రావణ శివస్తోత్రంలోని మూడు జటలూ ఘంటసాల పాడారు. లోగడ న్యూథియేటర్స్‌లో రికార్డిస్టుగా పనిచేసిన ముకుల్ బోస్ (ప్రస్తుతం ఎ. వి. ఎం. లో ఉంటున్నారు) వాటిని రికార్డుచేశారు. సంగీతదర్శకుడు రాజేశ్వరరావు, శివస్తోత్రంలో నృత్యాల ఉత్సాహానికీ ధాటికి దీటైనరీతిన సంగీతం రచించారు. మృదంగం, డోలు, ఢమరుకం, తూర్యనాదం మొదలైన వాద్యవిశేషాలతో సందడి ఝల్లుమనిపించేలా వినిపించారు. తెరమీద రావణపాత్రధారి రామారావు ముఖతః వీటిని వింటాము.

* * *

భాస్కర్ ప్రొడక్షన్స్ వారి 'మనోరమ'కు గతవారం నేపథ్యసంగీతం రికార్డింగ్ ఆరంభమైంది, సంగీతదర్శకుడు రమేష్‌నాయుడు.

* * *

## ఫిలించేంబర్ కొత్తభవనం

దక్షిణభారత చలనచిత్ర వాణిజ్యమండలి వారు తమ కార్యాలయానికై ఒక భవనం నిర్మించుకుని, సెప్టెంబరు 27 న గృహప్రవేశం జరుపుకొన్నారు. దేశం మొత్తం మీద స్వంతభవనం కట్టుకున్న తొలి చలనచిత్ర సంస్థ ఇదే. భవనానికి, గత మండలి మాజీ అధ్యక్షులు, చిత్రనిర్మాత టి. ఆర్. సుందరం ప్రారంభోత్సవం జరిపారు. ఎం. ఎ. ముత్తయ్యచెట్టియార్ సభకు అధ్యక్షత వహించారు. మండలి అధ్యక్షులు బి. నాగిరెడ్డి, ఈనాడు, ఇరవయ్యవ వార్షికోత్సవం, నూతన భవనప్రవేశం జరుపుకుంటున్న ఈ చలనచిత్ర వాణిజ్యమండలి, ఈ 20 ఏళ్ళ చరిత్రలోనూ ఎన్నో క్లిష్ట సమస్యలను, మూకీఫిలిం నిరుమతి కోతవంటి విషమ పరిస్థితులను ఎదుర్కొని, ఐకమత్యమే దన్నుగా నెగ్గుకు వచ్చిందని, టి. ఆర్. సుందరం ప్రభృతులు దీనికి ఎంతో సేవచేశారనీ అన్నారు. తరువాత అఖిలభారత ఫిలిం ఫెడరేషన్ అధ్యక్షులు అజిత్ బోస్, టి. ఆర్. సుందరం తైలవర్ణచిత్రపటాన్ని ఆవిష్కరించారు. ఎం. ఎ. వేణు మొదలగువారు మాట్లాడారు.

ఫిలించేంబర్, పరిశ్రమఅభివృద్ధికై సాగించిన కృషిని, సాధించిన ఫలితాలను పేర్కొంటూ నాలుగుభాషలలో వ్రాసిన పాటలను ఘంటసాల, టి. ఎం. సౌందరరాజన్, లీల, ఎస్. సి. సరోజ (సులమంగళం) పాడారు. రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, కేంద్రమంత్రులు, మదరాసు గవర్నరు, మంత్రులు పంపిన సందేశాలను, మండలి కార్యదర్శి పి. ఎస్. రామకృష్ణారావు చదివారు. ఉపాధ్యక్షుడు ఎ. రామయ్య వందన సమర్పణతో సభ ముగిసింది.

* * *

నియో లైట్ ఫిలింస్ వారు, చింపాంజీ విశేషాకర్షణగా కట్టుకుంటున్న అపరాధపరిశోధక చిత్రం 'పోలీస్ డిటెక్టివ్' నానాభాయ్‌భట్ దర్శకత్వాన ముగింపుకు తయారవుతోంది. శ్యామ, సురేష్, జేడీ, అన్వర్, లిలియాన్, భగవాన్, పమ్మి, జయశ్రీగద్కర్, జీసయాన్ అని పేరు పెట్టుకొన్న ఒక సరికొత్త హాస్యనటుడూ పాల్గొంటున్నారు. ప్రపంచప్రసిద్ధమైన చింపాంజీ పెడ్రో ముఖ్యమైన పాత్ర నిర్వహిస్తుంది.

ఈ చిత్రానికి సంగీతదర్శకుడు చిత్రగుప్త.

ఈ కంపెనీవారిదే నిర్మాణంలో మరి రెండు చిత్రాలున్నాయి - మదాం ఎక్స్ వై జడ్, గాంబ్లర్. అవి దాదాపు పూర్తి అయినట్టే. త్వరలోనే 'తీన్ ఉస్తాద్' అనే చిత్రం—అపూర్వమని నిర్మాతలు చెబుతున్న ఒక కథ ఆధారంగా నిర్మించబోతున్నారు. ఇందులో ముఖ్య భూమికలను జంతువులే నిర్వహిస్తాయనీ. 'ద్విపాదులు' అనుబంధంగానే ఉండడం జరుగుతుందనీ అనుకొంటున్నారు. ముఖ్యంగా మూడు జంతువులు ఉంటాయి—గుర్రం. కుక్క, చింపాంజీ పెడ్రో. దీనినిబట్టి, ఇందులో ఉస్తాద్‌లు ముగ్గురూ 'వీరే'నను కోవచ్చని నిర్మాత రామ్ [illegible] నవ్వుతూ అన్నారు.

## గమనిక

అనివార్య కారణాలవల్ల ఈనాటి 'స్వరలహరి' శీర్షిక క్రింద శంకర్, జైకిషన్ల పై వ్యాసం ప్రచురించడం సాధ్యపడలేదు.

## చిత్రలేఖ

ఆర్యా, సినిమా బ్యాలెట్లు నడుపుతున్న వారికి నా దొక మనవి. ఉత్తమ హీరో, హీరోయినూ, విలనూ అన్నట్టుగానే, ఇక మీదట 'బెస్ట్ గెస్ట్ ఆర్టిస్టు' అనే పోటీకూడా ఏర్పర్చి 'గెస్ట్ ఆర్టిస్ట్'లను ప్రోత్సహించాలని కోరుతున్నాను.

గెస్టు ప్రేక్షకుడు.

---

ఆనంద్, కిషన్ చందర్, అబ్రర్ అల్వీ.

ప్రథమస్థానం, ఒక స్త్రీకి లభించడం పురుష రచయితలకు గర్వకారణం కాకపోయినా, అంతా సంతోషించి అంగీకరించతగ్గ విషయం. ఇస్మత్ చుగ్తాయి చిత్రాలలో బుజ్ దిల్, ఆర్జూ, జిద్దీ, దార్వాజా, సోనేకి చిడియా ఎన్నతగ్గవి. ఆమె మాటలలో అందం, అర్థంకూడా సమృద్ధిగా ఉంటాయి. ఉత్తరప్రదేశ్ లో పుట్టి పెరిగినందువల్ల, హిందుస్థానీభాష నుడికారం పైనా, పలుకుబడి సొగసుల పైనా పలుకుబడి సంపాదించింది.

* * *

జనతా చిత్రవారి 'నాచేనాగిన్, బాజే బీన్' సెట్ మీద ఇటీవల కుంకుం, చంద్రశేఖర్ కు మనసువిప్పి మంచిమాట 'శ్రావ్యము'గా చెబుతోంది. మజ్రూ వ్రాసిన ఆ పాటకు చిత్రగుప్త వరసకట్టాడు. అందమైన సెట్ మీద ఆ సన్నివేశాన్ని దర్శకుడు తె హారీష్ చిత్రించాడు.

ఇటీవల విజయవంతంగా సాగిన 'కాలీ టోపీ లాల్ రుమాల్' చిత్రం రచయిత (నిర్మాతకూడా) దేవీశర్మగారే ఈ చిత్రం తీస్తున్నారు. మంచికథ, సమర్థమైన దర్శకత్వం, చక్కని సంగీతం జతపడితే చిన్న నటులూ, చిట్టిసెట్లూ ఉన్నా చిత్రం ప్రజల ఆదరణ గడించుకుని నిర్మాతకి డబ్బు సంపాదించి పెట్టగలదని కాలీటోపీ ఋజువు చేసింది.

సిల్వర్ స్టార్స్ వారి 'దాసి' చిత్రానికి కూడా కథే కట్టనికోట. ఈమధ్య నిర్మాత ౧. ఎస్. నయ్యర్ కథ టూకీగా చెప్పినప్పుడు నేను ఎగిరి గంతువేసి మెచ్చుకోలేకపోయినా దర్శకుడు కుందన్ కుమార్ నోట సానుకూలంగా విన్నమీదట కథమీద గురి గౌరవం కుదిరాయి. గతవారం ఈ చిత్రానికి ౨షీ, రత్నపాలొన్న ఒక నృత్యాన్ని షూట్ చేశారు.

హెచ్. ఎస్. క్వాత్రా క్రొత్తచిత్రం 'గోరి'కి సంగీత దర్శకుడు మదనమోహన్ రెండుపాటలు రికార్డు చేశారు. ఒకటి, కంఠాన్ని అద్భుతమైన క్రమశిక్షణలో ఉంచుకున్న మహమ్మదీ రఫీ పాడాడు.

క్వాత్రా, తిరువాతి చిత్రం చంద్రశేఖర్ అజాద్ కు గతవారం ప్రారంభోత్సవం జరిగింది. జయరాజ్, జయమాల నటిస్తున్నారు. ఈ చిత్రానికి సర్దూల్ క్వాత్రా సంగీతం సమకూర్చుతున్నారు. —టచ్ స్టోన్



విఠల్ ప్రొడక్షన్సువారి 'పెళ్ళిమీదపెళ్ళి'లో రమణమూర్తి, పెకమాళ్ళు

## కంపల్షన్

కొలంనాడు ఆల్ఫ్రెడ్ హిచ్ కాక్ చేసిన 'రోప్'-ట్రిక్ లీలగా గుర్తున్న వారికి, ట్వంటీయత్ సెంచరీ ఫాక్స్ వారి 'కంపల్షన్' చిత్రం మాస్తే చూసిన సినిమా కేమళ్ళీ వచ్చాం అని భ్రమకలగవచ్చు. ఒకేఒక సన్నివేశంమీద, సన్నటి కథమీద-, ఉత్కంఠ మీద-, హిచ్ కాక్, నటుడు జిమ్మీ స్టీవర్ మనని పతాక సన్నివేశానికి తీసుకువెళ్లారు.

డబ్బు, పగ వగైరా కారణాలూ, లక్ష్యాలూ లేకుండా కేవలం చంపడంకోసమే శాస్త్రీకంగా అతి జాగ్రత్తగా ఒక ఖూనీ చేస్తే పట్టుబడకుండా ఉండవచ్చునా లేదా అన్న ఊహమీద ఇద్దరు కుర్రవాళ్లు అందులో ఖూనీ చేస్తారు.

కంపల్షన్ చిత్రానికికూడా అదే ప్రాతిపదిక... తెల... కోటీశ్వరుల బిడ్డలిద్దరు— న్యాయశాస్త్ర విద్యార్థులు, కూడబలుక్కుని ఒక కుర్రాణ్ణి శాస్త్రీకంగా ఖూనీచేస్తారు-, దాన్ని ఒక కళగా ఎంచి. పట్టుబడకుండా ఉండాలన్న పట్టుదలలో ఎంత శ్రద్ధపట్టి పని చేసినా. అందులో ఒకడు కళ్లజోడు వదల రానిచోటవదలివేసాడు—'రోప్'చిత్రంలో హంతకులు శవాన్ని దాచిపెట్టిన పెట్టెమూత దగ్గర ఉరితాడు ముక్క మరచిపోయినట్లే.

అంత కట్టుదిట్టంగా, తెలివైనవాళ్ళు చేసిన హత్యను పట్టుకుని హంతకులనుబయట పెట్టడంతో అపజయమే హిచ్ కాక్ చిత్రం గమ్యం. డారిల్ జానుక్ చిత్రం 'కంపల్షన్' కథకూడా అక్కడే అయిపోయినా దర్శక నిర్మాతలు బలవంతంచేసినందువల్ల ఆర్సన్ వెల్స్ భరోసాతో కొనసాగింది. ఈ రెండో భాగంలో కథ, ఆర్సన్ వెల్స్ లాయరు వేషం వెయ్యడం; ఆయన ఫ్రేములోకి వచ్చే సరికి మనం, మనతోపాటు కథలోని పాత్రలూకూడా నానాఖంగారూపడి విరగబడి మర్యాదచేయబోవడం. అక్కడనుంచి అంతా అమెరికన్ కామిక్స్ మల్లెచదవక బారు డిటెక్టివు నవలల్లో పోలీసువాడి ముందరపనే దాగుడే ప్రతిభమల్లె, హాలివుడ్ సినీహీరో మల్లె చిరాకూ, జాలీనవ్వూ పుట్టించే అతిశయోక్తి. హంతకులను మరణదండన తప్పించడం వెల్స్ లక్ష్యం. మరణదండన మంచి చెడ్డలగురించి వినబడే వాదోపవాదాలన్నీ చదివినమీదట, లాయరు వెల్స్ చివర జడ్జీనే పడగొడతాడు.

"ఈ పిల్లలు కావాలని ఆలోచించి బుద్ధిపూర్వకంగా హత్యచేశారు కాబట్టి దండనార్హులంటున్నారు. రేపు వీళ్ళని ఉరివేస్తే మీరుచేసిందీ అదే అవుతుంది. ఆలోచించి పథకం వేసిచేసిన ఖూనీయే అవుతుంది." అని వాదలేస్తాడు. జూరీ ఉంటే, తీర్పు బాధ్యత పదముగ్గురు కలిసి భరించవచ్చునని, ఇపుడు జడ్జి ఒక్కడే కాబట్టి బాధ్యత ఆయన ఒక్కడిదేనని బెదిరిస్తాడు.

అన్నిటినీమించి ఆలాయరు అచ్చుఆర్సన్ వెల్స్ మల్లె గొప్ప వాడిలా దర్జాగాపొగరుగా కోర్టు గది అంతా పచార్లుచేస్తు అడిగిన వాళ్లకి ఆటోగ్రాఫుకూడా ఇచ్చే సినిమా నటుడిలా తిరుగుతూ వాదించడం జడ్జీ మనసును మార్చేసి ఉండాలి. వినపడ్డ వాదాలే ఇలా ఉంటే, వెల్స్ ఇటు మనకి, అటు జడ్జికి కూడా వినపడకుండా గొణుక్కుంటూఅన్న మాటలలో ఇంకా ఎంతలేసి గొప్ప ఆర్గ్యుమెంట్లు ఇమిడివున్నాయోనని జడ్జి ఝడుసుకున్నా ఝడుసుకుని ఉండొచ్చు. ఏమో చెప్పలేము.

మొత్తానికి, హాలివుడ్ ను గొప్పగా చెప్పుకునేవాళ్ళకీ, నటనమీద-అందరి జోహారూ అందుకోగలిగినంతటి ప్రభుత్వం ఉన్న ఆర్సన్ వెల్స్ అభిమానులకుకూడా ఈ చిత్రం చూస్తే సిగ్గేస్తుంది. చెత్త చిత్రాలు తీసే సామర్థ్యం, హక్కు గలవారు అనేకచోట్ల ఉన్నారని ధైర్యం కలుగుతుంది. ★

# విద్యాప్రమాణం పెంచటానికి కొన్ని సూచనలు

## జుల్మానాలు

విద్యార్థులలో క్రమశిక్షణ సన్నగిలుతూందనే విషయం అందరూ ఒప్పుకొన్న విషయమే. కాని కట్టుబాట్లు లేనిచోట మాత్రమే క్రమశిక్షణ తగ్గుతోంది. సరైన నియమాలూ, కట్టుబాట్లుగల విద్యాలయాలలో క్రమశిక్షణ చెక్కు చెదరలేదు. ఇందుకు కారణం అచ్చటి అధ్యాపకులు, మొదలగువారు ఎంతటి వారికైననూ తమ నియమావళిని అమలు జరుపుటయే. ఇందుకు ప్రత్యక్ష నిదర్శనము మదరాసు లయోలా కాలేజీ, రామకృష్ణమిషన్ హైస్కూలు.

లయోలా కాలేజీ విద్యార్థులు బాధ్యతారహితముగాగాని, నిబంధనలకు కావాలని ప్రతికూలముగా గాని ప్రవర్తించినప్పుడు రూ 5 నుండి 50 వరకూ జుల్మానా వేస్తారు. జుల్మానా చెల్లించి, తమ నడవడికనూ, పద్ధతులనూ మార్చుకొననివారికి జుల్మానా చక్రవడ్డీవలె పెంచబడును. జుల్మానా గడువులోపల చెల్లించనివారు కళాశాలనుండి బహిష్కరింపబడుతారు. కళాశాలలో చదువవలెనంటే తల్లిదండ్రులకు సంగతి అంతా చెప్పి, క్షమాపణలుకోరి జుల్మానా కట్టవలెనుగదా. సామాన్యముగా ఏ తల్లిదండ్రులయినా (తెలివిగలవారు) ఒకటి రెండుమార్లు జుల్మానా చెల్లిస్తారుగాని. అదే పనిగా రోజూ చెల్లించరు. అందువలన ఇటువంటి పద్ధతి కొంతవరకూ విద్యార్థులలో క్రమశిక్షణను కాపాడగలదు. కాని ఇటువంటి పద్ధతిని ప్రవేశపెట్టిన తర్వాత ఉపాధ్యాయులు, ప్రధానోపాధ్యాయులు, మేనేజిమెంట్లు లేక ట్రస్టుబోర్డులు వంటివాటి అధీనములో ఉంటే అటువంటి మేనేజిమెంట్లు కఠినముగా జుల్మానాలు వసూలు చేయాలి. జిల్లా కలెక్టరుగారి ఏకైకపుత్రుడనీ, చైర్మను గారి కూతురనీ, బోర్డు మెంబరుగారి మేనల్లుడనే విభేదాలు ఉండరాదు.

—"లలితానంద్," మదరాసు

* * *

## పరీక్షా విధానం

9-9-59 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో వెలువడిన "విద్యార్థులు అల్లర్లు" అనే శీర్షికను చదివాను. దానిలో విద్యాప్రమాణాలు తగ్గిపోవుటకు కారణాలు చాలావరకు సమంజసముగానే ఉన్నవి. కాని వారందులో పరీక్షా విధానాన్ని గురించి చర్చించకపోవటం లోటుగా కనిపిస్తుంది. గైడ్సు చదివి చాలా మంది మార్కులు సంపాదిస్తున్నారనుటకు సందేహము లేదు. దీనికి ఇప్పటి పరీక్షా విధానము అనుకూలముగా ఉన్నది. ప్రతిసంవత్సరము వచ్చే ప్రశ్నలు చాలావరకు ముందుగానే ఊహించవచ్చు. కాబట్టి పరీక్షా విధానములో కొన్ని మార్పులు తెచ్చినయెడల చాలామంచిదని తోస్తున్నది. ఒకే పరీక్షతో భవిష్యత్తు నిర్ణయించుటకంటే, 50% మార్కులు క్లాసు పరీక్షలకై వినియోగించి, ప్రతిమాసముగాని, లేక రెండు మాసముల కొకసారిగాని వారి వారి మాష్టర్లచే విద్యార్థుల అర్హతలను నిర్ణయించి తగురీతిగా ఈ 50% మార్కులను వారు నిర్ణయించిన యెడల "ఒరిజినల్ స్టూడెంటు" దెబ్బతినడు. పైగా విద్యార్థులకును వారి మాష్టర్లయందు కొంత భయము ఏర్పడుతుంది. దీనివలన కొంతవరకు క్రమశిక్షణ కూడా అలవడుతుందని నా ఉద్దేశము.

ఎ. వి. రామారావు, బొంబాయి.

* * *

## విద్యార్థుల సంఖ్య

మన కాలేజీల్లో ఒక్కొక్క క్లాసులో వందమంది విద్యార్థులుంటారు. లెక్చరర్ వీరందరికీ అర్థమయేలా చెప్పడం ఎంత కష్టమో ఆలోచించండి. వీరందరినీ లెక్చరర్ సంతృప్తి పరచలేడు. విద్యార్థుల్లో కొంత తెలివి తేటలున్నవాళ్ళే, లెక్చరర్ చెప్పేది అర్థం చేసుకోగలుగుతారు. మిగతా వాళ్ళ గొడవ లెక్చరర్లకి ఉండదు. వాళ్ళు వెనుక బెంచీల నాక్రమించుకొని, తమ మానాన తాము నిద్రపోవడమో, లేక గోలచేస్తూ పాఠాలు వింటున్న వారిని డిస్టర్బ్ చేయుటమో జరుగుతుంది. ఇలా అధిక సంఖ్య వలన విద్యార్థులకి, ఉపాధ్యాయులకి మధ్య సన్నిహితత్వం తగ్గిపోతుంది. ఇక "ప్రతి విద్యార్థికి అర్థం కావాలి" అని తాపత్రయపడే లెక్చరర్ సిలబసులో సావువంతైనా పూర్తి చేయలేకపోతాడు. అలా ఉంటాయి మన సిలబసులు. ఇస్రాయిల్ లాంటి దేశాల్లో ప్రతి పదుగురికో లేక ఆరుగురు విద్యార్థులకి ఒక ఉపాధ్యాయుడుంటాడు. కాబట్టి ఉపాధ్యాయుడు విద్యార్థుల మనస్తత్వానికి అనుగుణంగా వారికి బోధిస్తూ, వారిలో కొంచెం వెనుకబడి యున్న వాడి విషయంలో ప్రత్యేకంగా కృషి సల్పి. వాణ్ణి వృద్ధిలోకి తేగలడు. ఇల్లా కూడా లొంగని మట్టిబుర్రలుంటే, వారందరికీ వేరే ఒక స్కూలుంటుంది. అక్కడ ఒక్కో విద్యార్థికి ఒక్కో టీచర్ ఉంటాడు. అలాంటి విద్యా విధానం మన దేశంలోకి రావాలంటే మొదట మన ఆర్థిక వ్యవస్థ బాగుపడాలి.

పి. రామగోపాలరావు, హైదరాబాద్

* * *

## ప్రిన్సిపాల్ బాధ్యత

"విద్యాప్రమాణాలు తగ్గటానికి విద్యార్థులే పూర్తిగా బాధ్యులు కారు" అనుట అసమంజసము కాదు. విద్యార్థులు అనగా వారు చిన్నవారనీ, ఆవేశపరులనీ మనం మరువకూడదు. కనుక వీరిని భావిభారత పౌరులుగా చేయుటకు బాధ్యులు ఉపాధ్యాయులు. తరువాత తలిదండ్రులు. ఇప్పుడు సామాన్యంగా కాలేజీలలో లెక్చరర్ల మోస్తరు ఎట్లున్నదనగా వారు కష్టపడే వారి మనస్సు ఇష్టపడరు. ఏదో కాలేజి వెళ్ళి ఆ గంట గడిపేస్తే మన జీతం వస్తుంది అని ఆ గంట గడిపేస్తున్నారు. ఇంకా కొందరు క్లాసుకు 10 నిమిషాలు ఆలస్యంగా వచ్చి 5 నిమిషాలు ముందుగా వదిలేస్తారు. ఇంక మిగిలింది 35 నిమిషాలు. దీనిలో 5 నిమిషాలు అటెండెన్సుకి. ఇంక మిగిలింది 30 నిమిషాలు. ఈ 30 నిముషాలలో ఈయన చెప్పేదేమిటి విద్యార్థులు నేర్చుకొనేదేమిటి? దీనికి కారణం ఏమిటి? ఆ లెక్చరర్లు సరిగా క్లాసుకు వెళ్ళుతున్నారో లేదో ఇవన్నీ చూచుట ప్రిన్సిపాల్ పని కాదా? ఆ ప్రిన్సిపాల్ గట్టివారయితే కనీసం ఆ లెక్చరర్లు ఆ 50 నిమిషాలు క్లాసులో తప్పక ఉంటారు. క్లాసులో ఉన్నాక ఊరికే కూర్చుంటే పిల్లలు అల్లరి చేస్తారు. అందువల్ల ఇంకవిధిగా ఆ లెక్చరరు తప్పక పాఠం చెప్పవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. తరువాత క్రమంగా అవి అలవాటయి పాఠాలు సక్రమంగా జరుగుతాయి.

అ. శకుంతలాబాయి, సికింద్రాబాద్

# ★ వాసంతి వేడుక ★

[14-వ పేజీ తరువాయి]

[14-వ పేజీ తరువాయి]

ఏమండీ! ఇంతవరకూ ఆ డిగ్రీపేరు వినలేదు! ఇంకా ప్రపంచంలో మనం వినని డిగ్రీలెన్ని వుంటాయో గదా అని ఆశ్చర్యం వేసింది.

చదువంటారా, బి. ఎ., బి. డి. (బెర్లిన్) వరకూ చదివాను లెండి. మా అమ్మాయి. నాన్నకి నేను కూడా ఒక్కదాన్నే! తమాషాగా లేదూ? ఇద్దరికీ మధ్య ఎంత సామ్యం వుందో?

ఇక వయస్సంటారా? ఆడదాని వయస్సు అడక్కూడదు.
స్వర్ణ."

"స్వర్ణకి,

మీ వుత్తరం అందింది. బి. ఎ. బి. డి అంటే ఏమిటో నాకేం అర్థం కాలేదు సుమండి! బహుశా బి. యి. డి అనటానికి పొరపాటున బి. డి. అన్నారేమోనని నా అనుమానం! లేకపోతే అదేమైనా ఫారిన్ డిగ్రీయా? నా సందేహం తీర్చ ప్రార్థన. అంతకీ మీరు బెర్లిన్‌లో చదివింది బి. ఎ. నా లేక బి. డి.నా?

మీ ఫోటో పంపించండి.
భాస్కర్"

......

"భాస్కర్‌కి,

బెర్లిన్‌లో బి. డి, అంటే, బేచిలర్ ఆఫ్ డెమస్టిక్ సైన్సు చదివానండీ!

ఫోటో పంపమన్నారు. కాని...అంతకంటె మనిషినే వచ్చి ముఖాముఖి అంతా తేల్చేసుకుంటే బాగుంటుందేమో!

ఫోటో పంపటానికి అభ్యంతరం ఏంలేదు సుకోండి! కానీ......నాకసలు ఫోటో తీయించుకోవటమే సరిగ్గా రాదంటే నమ్మండి! అందులో చూసినా నిలువు గుడ్లు పడి నీరసంగా ముఖం అంతా పీక్కుపోయి వుంటుంది.

అయినా, ఫోటో చూస్తే మనిషిని చూసిన తృప్తి వుండనే వుండదు కదా!

మీరు ఎప్పుడు రమ్మంటే అప్పుడు వస్తాను. మీ వూళ్ళో నాకు స్నేహితులున్నారు లెండి. ఆ వంకను మిమ్మల్ని చూడటానికొస్తాను.
స్వర్ణ."

......

"శ్రీ భాస్కర్ గారిల్లు ఇదేనాండీ?"

"అవును! లోపలికి రండి, తమ రెవరు?"

"నేను స్వర్ణ..."

"ఓ, మీరా! రండి, రండి!"

"ఓహో, మీరేనా 'భాస్కర్'? నమ్మలేకుండా వున్నానే? మీ వుత్తరాల్లో మీరు చామనఛాయ అని వ్రాశారే! తీరా చూస్తే మీకంటె 'తారు' తెలుపేమో ననిపిస్తున్నది. పైగా చూచిన వాళ్ళంతా అందగాడినంటారని వ్రాశారు, ఎంత మోసం!"

"చామన ఛాయ కాకపోతే మరేమనమంటారు? ఇది నా స్వంత అభిప్రాయం కూడా కాదు లెండి! మిత్రులంతా నా అందాన్ని తెగ మెచ్చుకుంటారు సుమండీ!"

"చామన ఛాయ కాదండీ బాబూ! 'ఛాయ మనఛాయ' అనుకుంటే సరిపోతుంది."

"పోనీయండి. నలుపులో మాత్రం అందం లేదుటండీ? నన్ను చూచినవాళ్ళంతా అందగాడినే అంటుంటారు."

"నిజమైతే అవొచ్చు లెండి! చూడ్డానికి మీరసలు కన్ను పొడుచుకున్నా కనపడటం అంటూ వుంటేగా? ఎంత మోసం, ఎంత మోసం!"

"మీరు మాత్రం ఏం తక్కువ తిన్నారు? నేను వ్రాసిన లక్షణాలన్నీ అచ్చుగుద్దినట్లున్నాయని వ్రాశారు? మరి, ఆ లక్షణాలు మీలో కంచుకాగడా పెట్టి వెతికిచూచినా కనబడందే?"

"ఎంతమాటన్నారు? మీరు కావాలన్న లక్షణాలు నాలో ఎందుకు లేవూ? చూశారా, ఇదిగో దొండపండులాంటి పెదాలు, తామర తూడుల్లాంటి చేతులు, సొట్టలున్న బుగ్గలు, గడ్డం క్రింద గుంట, చంద్రబింబం..."

"ఇంక వర్ణించ నక్కరలేదు లెండి. అన్ని లక్షణాలు అందంగా నేవున్నాయి. అర అంగుళం దళసరిని పౌడరు పూసుకుని, పెదాలకు లిప్‌స్టిక్ వేసుకున్నారు. పెదాలు చక్కగాలక్క దొండపండులాగే వున్నాయి. ముఖం అంతా మశూచికం మచ్చలే కాబట్టి, గడ్డం క్రింద, బుగ్గ మీద గుంటలకేం కొదవ? ఒక్క చేతులే ఏం ఖర్మ, వళ్ళంతా తామర తూడులానే వుంది! అసలు చీపురుపుల్లకీ, మీకూ ఏమైనా తేడా వుంటేగా? మరేం అనుకోకుండా ఇంక దయచెయ్యండి."

................

మరో ఇరవై రోజులకల్లా స్వర్ణ దగ్గర నుంచి భాస్కర్‌కి వుత్తరం వచ్చింది.

"శ్రీ భాస్కర్ గారికి,

నమస్తే! ఈ నెల ముప్పయ్యో తారీఖున నా వివాహం. శుభలేఖ దీంతో పంపిస్తున్నాను.

మీరు మరోలా అనుకోకండి! నా అసలు పేరు స్వర్ణ కాదు. నేను బి.ఏ. చదివినమాట నిజమేకాని బెర్లిన్ కాదుకదా, కనీసం మా వూరు కూడా ఎప్పుడూ దాటిఎరుగను! ఏదో తమాషాకి అలా వ్రాశాను, మిమ్మల్ని చేసుకోవాలనే వుద్దేశం నాకెన్నడూ లేదు.

ఇంకో విషయం! మిమ్మల్ని చూడటానికి వచ్చింది నేను కాదు. ఆ తమాషా చవిచూడాలని వుబలాటపడింది నా స్నేహితురాలు!

"అతనూ - ఆమె పెళ్లాడి సుఖపడుతున్నారంటావా"

"కాక మరేమిటి?"

"నిమొహం అతను పగలల్లా ఇంటో ఉండదు-ఆవిడ రాత్రల్లా ఉండదు"

"ఓరి చవటా! ఇద్దరూ ఇంట్లో ఉంటే ఇద్దరికీ ఇబ్బందేరా. అందుకే ఎవరికివారు అలా ఒంటరిగా సుఖపడుతున్నారు."

మా బావా, నేనూ వివాహం చేసుకుంటున్నాం. వీలైతే పెళ్ళికి తప్పకరండి.
వాసంతి."

................

ఆరోజునే వాసంతికికూడా భాస్కర్ దగ్గరనుంచి వుత్తరం వచ్చింది.

"కుమారి స్వర్ణలత గారికి,

నమస్తే! మిమ్మల్ని నేను చాలా మోసం చేశాను! అందుకు మీరు నన్ను క్షమించాల్సి వుంటుంది!

నా పేరు భాస్కర్ కాదు. ఈ తమాషా ఎలా వుంటుందో చూడాలనే ఇన్నాళ్ళూ నేనే మా మిత్రుని పేరుతో ఇంతవరకూ కథ నడిపించాను.

ఆరోజు మీతో మాట్లాడింది నేను కాదు, నా మిత్రుడు.

నేను మిమ్మల్ని అంతవంచన చేయాలని అనుకోలేదు. మీ పరిచయభాగ్యం కల్గించుకుందామని నా మిత్రుడితో అంతనాటకం ఆడాను. అతనే నేననుకుని మీరు కోపంతో వెళ్ళిపోయినట్టున్నారు.

పోనీయండి, అంతా మనమంచికే! నాకు ఈ నెల ముప్పయ్యో తేదీన మా మరదలుతో వివాహం జరగనున్నది. శుభలేఖ పంపుతున్నాను. వీలుంటే వచ్చివెళ్ళండి! జరిగిపోయిన విషయాలన్నీ తలచుకుని ఆగ్రహించకండి!

మోహన్."

వుత్తరం చదువుతూనే వాసంతి "ఇంతా చేసి నువ్వేనా బావా! ఎంత ఘటికుడవు!" అనుకుంది, వుప్పొంగిపోయే మనసుతో.

అక్కడ మోహన్, వాసంతి శుభలేఖ చూసి "ఔరా? ఎంతగడుగ్గాయి!" అనుకుంటూ మనసార నవ్వుకున్నాడు. ★

# ఆంధ్రపత్రిక గళ్లనుడికట్టు



## అడ్డం

1. పాషంలో పొతకాల ప్రాణం తీసుంది.

3. చంపావు! రాళ్లు ఎగురుతాయా ఎక్కడైనా. మరీ చోద్యం గాకపోతే.

4. ఆశ లావూ పీక సన్నం అన్నారు.

5. మరకి కొమ్ము తగిలి స్తే రాజమాత...

8 కొలతలో ఆగము.

9 మాటకి మాటా తిప్పికొట్టినా, తిరగబడి నవ్వే రచయిత.

10 తడబటంలో ఆలస్యం.

12. త్రిపుట తాళంలో కాగితం.

14. గానం వినిపించే ఆజ్ఞ.

15 చివరకు ఉన్నది.

16. ఎంత బంగారమైనా మలినములే.

## నిలువు

1. వెంకటకవి ఇంటిపేరు.

2. కలగా పులగపు రాబడి.

3. —రుచిగా ఉంటే పాకులాడము.

4. పిల్లలికి ఎంతో యిష్టం.

6. విష్ణువు

7. మూలనున్న ముసలమ్మను కొట్టడానికి అరు నెలలా!

10 ఇంటికీ, వంటికీ తప్పదు.

11. అజ్ఞనూ, ఆయుధాన్నీ కలిపితే ఇది గుర్తుకురాదూ?

12. సర్కారువారి ధర్మాసనాలకు పక్కవాద్యం.

13 పుణ్యానికి వెళ్లే వాళ్లకి తప్పక వేది.

★

## 20-వ నుడికట్టుకుజవాబులు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 శ్రీ | శ్రీ | | 2 కొ | డ | 3 వ | టి | గం | 4 టి |
| రా | | 5 బా | స | | న | | | ప్ప |
| 6 గం | 7 ధ | ము | | 8 మా | రు | 9 ని | రా | ణి |
| | మ | | 10 చి | వి | | రా | | |
| 11 అ | ని | 12 పి | ట్టి | | 13 దా | శ | 14 ర | థి |
| | | ల | | 15 స | డి | | గా | |
| 16 క | రు | వు | 17 భ | త్యం | | 18 గా | య | 19 త్రి |
| ల | | | ర | | 20 వా | లం | | షు |
| 21 ము | ని | మా | ణి | క్య | ము | | 22 చ | లం |

# పుస్తక సమీక్ష

**సుఖమూ-సుందరీ :** రచన:ఇచ్ఛాపురపు జగన్నాథరావు;కవితా పబ్లికేషన్స్, విజయవాడ-2. 156 పేజీలు, వెల: 2 రూ పాయలు.

"సుఖం అనేదీ, ఆనందం అనేదీ కేవలమూ మానవుడి మనస్సులో వివిధ పరిణామాలవల్ల సిద్ధిస్తాయి. వాటిని వెతకటం మూర్ఖత్వం. వెతికేచోట అవి ఎప్పుడూ ఉండవు!" అనే ప్రాతిపదికపై ఆధారపడి రచించిన పెద్దకథ ఇది. రఘునాథరావు అనే యువకుడి రైలు ప్రయాణంతో ఆరంభమైన కథ, ఛటుక్కున పట్టాలు తప్పి 'రాధ' అనే యువతి కథలో పడిపోతుంది. రాధకు పెళ్ళి కాని వాళ్లూ అంతా ఆదరిస్తారు. అది ఏదో విధంగా పోగానే, మామూలుగా జరిగేట్టుగానే వాళ్ళంతా ఆమెను అనాదరిస్తారు. రాధ కథే కాదు - రాధ తండ్రి వుంచుకున్న సుందరి కథా, రఘునాథరావు తల్లి కథా, విశాల అనే రాధ స్నేహితురాలి గాలికథా— వంటి కథలింకా కొన్ని ఈ 'పెద్దకథ'లో పిల్లకథల్లాగా ప్రవహిస్తాయి కలగా పులగంగా, కలగలుపుగా! మొత్తానికి ఏకధాటీగా సాగనివ్వలేదు రచయిత. "సుఖపడడం అంటూ ఏమీ లేదు రాధా! దానికి మార్గమూ అంతకంటే ఏమీ లేదు. రకరకాలుగా సాగుతుంది. అందరూ ఎల్లప్పుడూ సుఖపడదామనే చూస్తూంటారు, కాని ఏం వుంది? అంతా అట్లా అనుకోవడమేగా" అంటుంది సుందరి, 'సుఖము'పై తన భావాన్ని వ్యక్తీకరిస్తూ. "సుఖం ఎంగులోనూ లేదు, ఎవరికీ సుఖం లేదు, ఎవరికున్న బాధలు వాళ్ళవి!" అని రచయిత తాత్పర్యం కాబోలు. రచనలో 'నూటి'దనం తక్కువ. ఏవేవో పాత్రలు ఎందుకెందుకో వచ్చేస్తూ ఏదేదో మాట్లాడేస్తూ ('సుభాషితాలు!') ఎక్కడెక్కడికో పోతూవుంటాయి! ఇందుగల మనం కాస్త తికమకపడతాము, అంతే! కాగితమూ, ముద్రణా ముచ్చటగావున్నై!

—సుకుమార్.

# దురాశ

(43 వ పేజీతరువాయి)

మూర్ఛోగానే, శాస్త్రి తన గొప్పతనాన్ని తనే పొగుడుతూ, యీసారి కూడ తా సంకొకక గిన్నెను సంపాదించేనని సగర్వంగా చెప్తూ, ధీమాగా మూట విప్పి ఒక్కొక్కరి విస్తరిలోనే దాన్ని బోర్లించేడు. ఏముంది! అంతా తారుమారు!! పంచభక్ష్య పరమాన్నాలకి బదులు గిన్నెలోంచి యిద్దరు మంగళ్ళు కత్తులతోవచ్చి, పీటమీద వున్నవాళ్ల తలలు పొన్నకాయల్లాచేసి మాయమౌతున్నారు!!! దీన్ని చూసి వూరివారంతా మండిపడిపోయారు. అంతా సింహాచలం భక్తుల్లా తయారయ్యారు.

ఉక్రోషంతో వూరివారంతా శాస్త్రిని సకుటుంబంగా వూరినుండి తరిమేశారు.

చూశారా! శాస్త్రులుగారి దురాశ ఎంతకీ దారితీసిందో అంగుకే అంటారు. "దురాశ దుఃఖానికి చేట"ని పెద్దలు. ★

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd. by S. Radha Krishna at The Andhra Patrika Press 6 & 7 Thambu Chetty Street Madras-1 Editor S. Sambhu Prasad



రా ధా మా ధ వు లు

—చిత్రం : వీరిశెట్టి అచ్యుతరావు.

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.

# మీకున్నూ

# -సినీమా తారవంటి ప్రకాశమాన చర్మసౌందర్యము

వైజయంతిమాల ఇలా చెప్పుచున్నది:
"నా చర్మము లక్స్ టాయ్‌లెట్ సబ్బు వల్ల శుభ్రము గాను నునుపుగాను వుంటున్నది. దాని మీగడ వంటి నురగ నా చర్మమునకు మంచిది మరియు దాని పరిమళము రోజల్లా నన్ను హాయిగా నుంచుచున్నది."
మీరున్నూ వైజయంతిమాలకున్నట్టి మనోహరమైన చర్మ సౌందర్యమును పొందవచ్చును. మీకు ప్రతి దినమూ సౌందర్యము నిచ్చే సబ్బుగా లక్స్‌ను వాడండి. జ్ఞాపక ముంచుకోండి. లక్స్‌తో స్నానము ఎంతో ఆనందదాయకము!

శుద్ధమైన.తెల్లని.

## లక్స్

## టాయ్‌లెట్ సబ్బు

సినీమా తారలకు సౌందర్యమునిచ్చే సబ్బు






హిందుస్తాన్ లీవర్ లిమిటెడ్ వారి ఉత్పత్తి

LTS 9-X52 TL

